# చైతన్య భగవద్గీత

స్వామి సుందర చైతన్యానంద

# చైతన్య భగవద్గీత

(ప్రథమ సంపుటము)




స్వామి సుందర చైతన్యానంద

# చైతన్య భగవద్గీత

(ప్రథమ సంపుటము)

స్వామి సుందర చైతన్యానంద

చైతన్య భగవద్గీత

స్వామి సుందర చైతన్యానంద

ప్రథమ ముద్రణము : డిసెంబరు 2009....... 15000 కాపీలు.



ప్రతులకు :

1. సుందర చైతన్యాశ్రమం
దుండిగల్ రోడ్,
హైదరాబాద్ - 500 043.
☎ : 08418 - 255777
ఫాక్స్ : 08418 - 255355

2. చైతన్య వానప్రస్థాశ్రమం,
సుందర చైతన్యాశ్రమం
ధవళేశ్వరం - 533 125.
☎ : 0883 - 2417378

3. సుందర చైతన్యాశ్రమం
శాంతిపురం,
విశాఖపట్టణం - 530 016.
☎ : 0891 - 2791079

టైప్ సెట్టింగ్ : ప్రసాద్
ఫోటో డిజైనింగ్ : ప్రవీణ్
సుందర చైతన్యాశ్రమం,
హైదరాబాద్

ముద్రణ : శ్రీ లక్ష్మీ గణపతి బైండింగ్ వర్క్స్, కొవ్వూరు.
☎ : 08813 - 232354, 231575



చైతన్య భగవద్గీత

స్వామి సుందర చైతన్యానంద



## విషయ సూచిక





## అంకితం

అనుగ్రహించిన ఆదిదేవునకు
అర్థం చెప్పిన ఆచార్యదేవునకు
అంజలి ఘటిస్తూ

ॐ స్వామి సుందర చైతన్యానంద

## అంబ! భగవద్గీతే! త్వాం అనుసందధామి



ప్రాణాలు వెంట బెట్టుకొని
ప్రపంచం లోకి ప్రవేశించిన వారు
తిరిగి ప్రాణాలను ప్రపంచం లోనే
విడిచిపెట్టి వెళ్తున్నారు.

తల్లి గర్భం నుండి వచ్చే నాడు
అందరూ ప్రాణాల తోనే వస్తున్నారు.
పుట్టిన తరువాత ప్రాణాల్ని
చేదుకోవడం లేదు. తోడుకోవడం లేదు.

వెలిగే దీపం ఆరి పోకుండా
నూనె పోస్తూ ఉంటాము.
తెచ్చుకున్న ప్రాణం కారి పోకుండా
ప్రాణవాయువును పీల్చుకుంటూ ఉంటాము.

ప్రాణవాయువును ప్రసాదించి
ప్రాణాలు కాపాడిన ప్రపంచానికి
ఋణగ్రస్తులం కాలేక ప్రాణాలను
ప్రపంచం లోనే విడిచి వెళ్తున్నాం.

మరణ యోగ్యత ప్రతి ప్రాణికీ ఉంది
యోగ్యమైన మరణం ఎందరి కుంది?



**జీవిత మిదం తృటి ద్వయస్య క్రీడా**

ఈ జీవితం రెండు నిమిషాల ఆట.

ఒక నిమిషంలో జననం. మరో నిమిషంలో మరణం
ఒక క్షణంలో కళ్ళు తెరవడం. మరో క్షణంలో కళ్ళు మూయడం.

ఇదే ద్వయం. ద్వైతం. భయం.
కాదెన్నడూ ఇది అభయం.

రెండిటిని రమణీయంగా చూపిస్తూ
రెండిటి మధ్య అదే పనిగ పరుగు లెట్టిస్తూ
రెండు నిమిషాల్లో బ్రతుకును బుగ్గి చేసే
ద్వైత క్రీడ. తృటి ద్వయస్య క్రీడ.

**జాతస్య మరణం ధ్రువమ్**

పుట్టేది ఎవ్వరైనా గిట్టేందుకే - ఈ మధ్యలో,
తిరిగేది తిరగడమే. తరిగేది తరగడమే.
తిరగడం కర్మ. తిరిగి తిరిగి అరిగి పోవడం ఫలం.

తిరిగేవే అరుగుతాయి. కదిలేవే కరుగుతాయి.
మరిగే జలాలు అవిరౌతూ తరిగి పోతాయి.

దేహాలు తిరిగి తిరిగి
అవయవాలు అరిగి అరిగి
క్షణక్షణానికి ప్రాణాలు కరిగి కరిగి
మాయలో పడిన మనస్సు మరిగి మరిగి - ఒకనాడు
మనిషి మరణించి మట్టిలో మట్టిగా కలిసి పోతాడు
కట్టెలలో కట్టెగా కాలి మసై పోతాడు.

ఇక్కడ ఎవ్వరికీ మినహాయింపులు లేవు
మీనమేషాలు మనం లెక్కించ వచ్చు
మృత్యువు వాటిని లెక్క పెట్టదు.

పచ్చని చెట్టు ఎండేందుకే ఉంది
వెచ్చని దేహం మండేందుకే ఉంది.

కాయ ఏ చెట్టు దైనా రాలి పోయేదే
కాయం ఎవరి దైనా కాలి పోయేదే.

పడేందుకే లేస్తుంది కడలి కెరటం
కాటిలో కాలేందుకే పుడుతుంది కాయం.





**కాలః జగద్భక్షకః**

జల్లెడ బట్టి అందరినీ జగత్తు వడబోస్తూ ఉంటే
కాలం కదం త్రొక్కుతూ జగత్తునే కబళిస్తోంది
విశ్వాన్నంతా వ్యంజనంలా చప్పరిం చేస్తోంది.

జన్మ నిచ్చిన తల్లుల్ని మాటేసి కాటేసింది
పోషించిన తండ్రుల్ని వాటేసుకొని కూల్చేసింది.

భార్యల్ని మ్రింగింది. భర్తల్ని మ్రింగింది
మిత్రుల్ని మ్రింగింది. బంధువుల్ని మ్రింగింది
తాతలను మ్రింగింది. తనయులను మ్రింగింది
దారి కాచి మరీ దొంగలా దోచుకుంది - ఆ క్షణాల్లో

ఇక బ్రతకడ మెందుకు?
చావే మంచిది అనిపిస్తుంది.





ఈ వైరాగ్యం ఎంత కాలం ఉంటుంది?
కాలం దానిని కూడా మ్రింగేస్తుంది.

మరిగించిన మనసే మరపిస్తుంది
సమస్తాన్ని మరచి పోయేలా చేస్తుంది.

మళ్ళీ ప్రపంచం వైపే పరుగులు
అవే దరువులు. అవే కరువులు.

తన భుజబల పరాక్రమాలతో అవనికి వణకు పుట్టించిన హిరణ్యాక్షుడు, వరాహమూర్తి చేతిలో హతుడయ్యాడు. ఉదక ప్రదాన అంత్యక్రియాదు లాచరించిన తరువాత, పుత్రశోకంతో కుమిలి పోతున్న తల్లి దితిని ఊరడించ డానికి హిరణ్యకశిపుడు మాతృదేవి మందిరంలో ప్రవేశించాడు.

శా॥ నీరాగార నివిష్ట పాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు వీడి పోదురు సదా సంగంబు లేదొక్కచో
శూరుల్ వోయెడి త్రోవఁ బోయెను భవత్పూనుండు దల్లీ! మహా
శూరుఁ డాతఁడు తద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్!

అమ్మా! ఈ ప్రపంచం ఒక చలివేంద్రం లాంటిది. జీవు లందరూ దాహం తీర్చుకోవడానికి వచ్చిన బాటసారులే. దాహం తీరిన తరువాత, చలిపందిరిని విడిచి, ఎవరి దారిన వారు పోతూ ఉంటారు.

జననీ! ప్రారబ్ధ ఫలాలను అనుభవించ డానికి ఈ ప్రపంచ మనే చలివేంద్రం వద్దకు మన మందరమూ చేరాం. మనమూ బాటసారులమే. సంసార సంచారులమే.

చలిపందిరి వద్ద కలవడమే సంసారము. చలివేంద్రం వద్ద ఎవరితో చెలిమి? ఎవరిది కలిమి? ఏమి సంగము? ఎక్కడి సంసారము?

మాతా! ఎగిరి పోయేందుకే పక్షులు చెట్టుపై వాలుతాయి. తిరిగి నడచేందుకే బాటసారులు చలివేంద్రాన్ని చేరుతారు. వచ్చిన వాళ్ళందరూ తిరిగి పోయేవారే. స్థిరంగా ఉండేవా రెవ్వరూ లేరు. ఒక కాలంలో కనిపించిన వాళ్ళు మరొక కాలంలో కనిపించరు. అందరూ వెళ్ళే వారే. మనమూ అంతే. కాకపోతే, కొందరు ముందు. కొందరు వెనుక. అంతే.

నా సోదరుడు, మహిని వణకించిన నీ ముద్దుల తనయుడు హిరణ్యాక్షుడు ముందు వెళ్ళాడు. విదియ తనది, తదియ మనది. అంతే. తల్లీ! ఎవ్వరైనా పోయే వారే! కానీ నా సోదరుడు మహాశూరుడు. కనుకనే, విష్ణువుతో పోరాడి శూరులు పయనించే మార్గంలో వెళ్ళి పోయాడు. విజయం విష్ణువు దైతే, వీరస్వర్గం నా తమ్ముడిది.

సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం
దమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుండు - తల్లీ! భగవంతుడైన శ్రీమహావిష్ణువు సర్వజ్ఞుడు, సర్వాత్ముడు, నశించని వాడు, నిర్మలుడు, సత్యరూపుడు, అనంతుడు, ఆఢ్యుడు. ఆ దివ్యాత్ముని చేతిలో మరణించిన మహావీరుడైన నా సోదరుని మరణం దుఃఖించ దగింది కాదు అని హిరణ్యకశిపుడు తల్లి దితిని ఎంతగానో ఓదార్చాడు. కుమిలి పోతున్న మాతృశ్రీ హృదయాన్ని కుదుట పరచాడు.

ఆ తరువాత జరిగిం దేమిటి?

దానవ శ్రేణికిన్ వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీ కేటికిన్ - 'దానవు లందరికీ విష్ణువు ప్రబల శత్రువు. అతడిని వధించాలే గాని వర్ణించ కూడదు' అంటూ విజృంభించాడు.

**జాతస్య మరణం ధ్రువమ్**

పుట్టేది ఎవ్వరైనా గిట్టేందుకే - ఈ మధ్యలో,
తిరిగేది తిరగడమే. తరిగేది తరగడమే.
తిరగడం కర్మ. తిరిగి తిరిగి అరిగి పోవడం ఫలం.

తిరిగేవే అరుగుతాయి. కదిలేవే కరుగుతాయి.
మరిగే జలాలు ఆవిరౌతూ తరిగి పోతాయి.

దేహాలు తిరిగి తిరిగి
అవయవాలు అరిగి అరిగి
క్షణక్షణానికి ప్రాణాలు కరిగి కరిగి
మాయలో పడిన మనస్సు మరిగి మరిగి - ఒకనాడు
మనిషి మరణించి మట్టిలో మట్టిగా కలిసి పోతాడు
కట్టెలలో కట్టెగా కాలి మసై పోతాడు.

ఇక్కడ ఎవ్వరికీ మినహాయింపులు లేవు
మీనమేషాలు మనం లెక్కించ వచ్చు
మృత్యువు వాటిని లెక్క పెట్టదు.

పచ్చని చెట్టు ఎండేందుకే ఉంది
వెచ్చని దేహం మండేందుకే ఉంది.

కాయ ఏ చెట్టు దైనా రాలి పోయేదే
కాయం ఎవరి దైనా కాలి పోయేదే.

పడేందుకే లేస్తుంది కడలి కెరటం
కాటిలో కాలేందుకే పుడుతుంది కాయం.





**కాలః జగద్భక్షకః**

జల్లెడ బట్టి అందరినీ జగత్తు వడబోస్తూ ఉంటే
కాలం కదం త్రొక్కుతూ జగత్తునే కబళిస్తోంది
విశ్వాన్నంతా వ్యంజనంలా చప్పరిం చేస్తోంది.

జన్మ నిచ్చిన తల్లుల్ని మాటేసి కాటేసింది
పోషించిన తండ్రుల్ని వాటేసుకొని కూల్చేసింది.

భార్యల్ని మ్రింగింది. భర్తల్ని మ్రింగింది
మిత్రుల్ని మ్రింగింది. బంధువుల్ని మ్రింగింది
తాతలను మ్రింగింది. తనయులను మ్రింగింది
దారి కాచి మరీ దొంగలా దోచుకుంది - ఆ క్షణాల్లో

ఇక బ్రతకడ మెందుకు?
చావే మంచిది అనిపిస్తుంది.





ఈ వైరాగ్యం ఎంత కాలం ఉంటుంది?
కాలం దానిని కూడా మ్రింగేస్తుంది.

మరిగించిన మనసే మరపిస్తుంది
సమస్తాన్ని మరచి పోయేలా చేస్తుంది.

మళ్ళీ ప్రపంచం వైపే పరుగులు
అవే దరువులు. అవే కరువులు.

తన భుజబల పరాక్రమాలతో అవనికి వణకు పుట్టించిన హిరణ్యాక్షుడు, వరాహమూర్తి చేతిలో హతుడయ్యాడు. ఉదక ప్రదాన అంత్యక్రియాదు లాచరించిన తరువాత, పుత్రశోకంతో కుమిలి పోతున్న తల్లి దితిని ఊరడించ డానికి హిరణ్యకశిపుడు మాతృదేవి మందిరంలో ప్రవేశించాడు.

శా॥ నీరాగార నివిష్ట పాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు వీడి పోదురు సదా సంగంబు లేదొక్కచో
శూరుల్ వోయెడి త్రోవఁ బోయెను భవత్పూనుండు దల్లీ! మహా
శూరుఁ డాతఁడు తద్వియోగమునకున్ శోకింప నీ కేటికిన్!

అమ్మా! ఈ ప్రపంచం ఒక చలివేంద్రం లాంటిది. జీవు లందరూ దాహం తీర్చుకోవడానికి వచ్చిన బాటసారులే. దాహం తీరిన తరువాత, చలిపందిరిని విడిచి, ఎవరి దారిన వారు పోతూ ఉంటారు.

జననీ! ప్రారబ్ధ ఫలాలను అనుభవించ డానికి ఈ ప్రపంచ మనే చలివేంద్రం వద్దకు మన మందరమూ చేరాం. మనమూ బాటసారులమే. సంసార సంచారులమే.

చలిపందిరి వద్ద కలవడమే సంసారము. చలివేంద్రం వద్ద ఎవరితో చెలిమి? ఎవరిది కలిమి? ఏమి సంగము? ఎక్కడి సంసారము?

మాతా! ఎగిరి పోయేందుకే పక్షులు చెట్టుపై వాలుతాయి. తిరిగి నడచేందుకే బాటసారులు చలివేంద్రాన్ని చేరుతారు. వచ్చిన వాళ్ళందరూ తిరిగి పోయేవారే. స్థిరంగా ఉండేవా రెవ్వరూ లేరు. ఒక కాలంలో కనిపించిన వాళ్ళు మరొక కాలంలో కనిపించరు. అందరూ వెళ్ళే వారే. మనమూ అంతే. కాకపోతే, కొందరు ముందు. కొందరు వెనుక. అంతే.

నా సోదరుడు, మహిని వణకించిన నీ ముద్దుల తనయుడు హిరణ్యాక్షుడు ముందు వెళ్ళాడు. విదియ తనది, తదియ మనది. అంతే. తల్లీ! ఎవ్వరైనా పోయే వారే! కానీ నా సోదరుడు మహాశూరుడు. కనుకనే, విష్ణువుతో పోరాడి శూరులు పయనించే మార్గంలో వెళ్ళి పోయాడు. విజయం విష్ణువు దైతే, వీరస్వర్గం నా తమ్ముడిది.

సర్వజ్ఞుఁ డీశుండు సర్వాత్ముఁ డవ్యయుం
డమలుండు సత్యుఁ డనంతుఁ డాఢ్యుండు - తల్లీ! భగవంతుడైన శ్రీమహావిష్ణువు సర్వజ్ఞుడు, సర్వాత్ముడు, నశించని వాడు, నిర్మలుడు, సత్యరూపుడు, అనంతుడు, ఆఢ్యుడు. ఆ దివ్యాత్ముని చేతిలో మరణించిన మహావీరుడైన నా సోదరుని మరణం దుఃఖించ దగింది కాదు అని హిరణ్యకశిపుడు తల్లి దితిని ఎంతగానో ఓదార్చాడు. కుమిలి పోతున్న మాతృశ్రీ హృదయాన్ని కుదుట పరచాడు.

ఆ తరువాత జరిగిం దేమిటి?

దానవ శ్రేణికిన్ వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్జింప నీ కేటికిన్ - 'దానవు లందరికీ విష్ణువు ప్రబల శత్రువు. అతడిని వధించాలే గాని వర్జించ కూడదు' అంటూ విజృంభించాడు.

తల్లికి బోధించిం దేమిటి?
తానిపుడు వాదించే దేమిటి?

అనర్థాల వైపు పరుగు దీసే వారికి
పరమార్థం ఒక పట్టున వంట పట్టదు.

దేవుడు ఉన్నాడని తెలియని దెవరికి?
దేవుడు అంటే ఏమిటో తెలిసిం దెవరికి?

తెలియడం వేరు
అర్థం కావడం వేరు.

ఆవు తినిన ఆహారాన్ని నెమరు వేస్తుందని మనకు తెలుసు
కానీ, ఆవు నెమరు వేసేది జీర్ణం కాని దానినే అనేది తెలియాలి.

ఏది యుక్తము? ఏది అయుక్తము? అని ఆలోచించలేక
కసువు మేసే టపుడు ఆవు ఏదేదో తినేస్తుంది.

తినింది జీర్ణం కానపుడు, తిరిగి నోటి లోకి తెచ్చుకొని
మళ్ళీ నమిలి మ్రింగుతుంది. అదే నెమరు వేయడం.

తృణ స్వీకరణ కాలే
రోమన్థం కుర్వన్ పశురివ
పశ్చాత్ అనర్థం మా భజ !

అయోగ్యమైన దానిని ఆరగించి, అది అరగని దశలో
నెమరు వేయడానికి పశువు పరితపించినట్లు,
అనర్థదాయక మైన విషయాలను ఆశ్రయించి,
ఆ తరువాత ఆవేదనతో కుమిలి పోవద్దని ఆప్తవాక్యం,
స్వయంప్రకాశ యతీంద్రులు పలికిన హితవాక్యం.





జీవిత మొక విచిత్రమైన ప్రయాణము
ప్రయాణం లోనే ప్రమాదాలు జరుగుతాయి.

పయనించే నావే మునిగేది
జీవించే మనిషే మరణించేది.

మరణం అనివార్యం
ఎప్పు డనేది అనిశ్చితం.

అలహాబాద్ ప్రయాణంలో రాత్రి రైలెక్కిన వాడు
ఆసుపత్రిలో మరునాడు ఉదయం కళ్ళు తెరచి
నే నెక్కడున్నాను? అని పలవరించడం లేదా!

అలహాబాద్ వెళ్ళాలని రైలెక్కాడే గాని
ఆసుపత్రిలో పడక పైకి చేరాలని
పలవరించే వ్యక్తి కలలు గన్నాడా?





వాస్తవాలు ఊహాలలో ఊరేగవు
ఎప్పుడైనా, ఎక్కడైనా ప్రమాణాలే ప్రకాశిస్తాయి.

ఈ ప్రపంచ ఎడారిలో ఇంతవరకు
ఎవరి దప్పిక తీరలేదు.

కోరికలు అందరి బుద్ధులను కుదిపేశాయే గాని
ఎవరి హృదయాన్ని కూడా కుదుట పరచలేక పోయాయి.

అందరూ ప్రపంచంలో కొంత కాలం ఉండి తిరిగి పోయిన వారే గాని
ఈ ప్రపంచాన్ని తమదిగా, తమ ఆస్తిగా మార్చుకున్న వారు ఎవ్వరూ లేరు.



అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః

దేహాలు స్థిరం కావు. సంపదలు శాశ్వతం కావు.

సరుకులు మోసుకొచ్చే నౌక సముద్రంలో మునిగి పోగానే
ఆ పయనించే నౌక లోని సరుకులు కూడా మునిగి పోయినట్లు
మనిషి జీవితం ఈ ప్రపంచంలో ముగిసి పోగానే
అతని కున్న సమస్తము క్షణంలో అతనిది కాకుండా పోతుంది.

దీనికి ఎంత సమయం పడుతుంది?
అంతా క్షణంలో జరిగి పోతుంది.

ఆపదః క్షణ మాయన్తి
క్షణ మాయన్తి సంపదః
క్షణం జన్మ క్షణం మృత్యుః
మునే కి మిహ న క్షణం?



క్షణంలో ఆపద ఆవరిస్తుంది
క్షణంలో సంపద సమీపిస్తుంది
పుట్టేది క్షణం, చచ్చేది క్షణం
మునీ! క్షణం కానిది ఇక్కడ ఏముందని?
అని యోగావాసిష్ఠంలో వసిష్ఠ మహర్షిని
సూటిగా ప్రశ్నించాడు బాలరాముడు.

గతంలో ఎవరెవరు ఏమేమి చేశారో
వాటిలో ఎవరెవరు ఏమేమి చూశారో
వాటి ఫలాలు ఎలా ఉంటాయో, ఎప్పుడొస్తాయో
ఆలోచనలకు అందవు. ఊహాలు పట్టుకో లేవు

ఇక్కడే బంధ్దు ఓడ లవుతాయి
ఓడలు తిరగబడి కడలిలో కలిసి పోతాయి.

సంపదలు దూరమై ఆపదలు చేరు వవుతాయి
బాంధవ్యాలు శూన్యమై భారాలను గుండెలలో దించుతాయి.

క్షణాలలో ఆరోగ్యాలు విషమిస్తాయి
ప్రమాదాలు బ్రతుకులనే బుగ్గిపాలు చేస్తాయి.

ఎంతటి వారైనా ఏకాకులు కావచ్చు
ఏకంగా పరలోకానికే పయనించ వచ్చు.

తెలిసి చేసినా, తెలియక చేసినా
చేసినవే కనుక తప్పించుకోవడం సాధ్యం కాదు.



**నా భుక్తం క్షీయతే కర్మ**
**కల్పకోటి శతై రపి**

కోట్లాది జన్మ లెత్తినా
అనుభవించనిదే కర్మ నశించదు.

కోరుకునే మనస్సు మనిషి కుంది.
అలాగని కష్టాలను మనిషి కోరుకోడు
నష్టాలు రావాలని ఎప్పుడూ ఆశించడు
అయినా, వచ్చే సమయానికి అవి వచ్చి తీరుతాయి.



దుఃఖం ప్రాప్తించాలని ఎవ్వరూ అభిలషించరు
అనారోగ్యానికి ఎవ్వరూ ఆహ్వానం పలకరు.

భగవాన్!
నాకు జ్వర మొస్తే నీకు కొబ్బరికాయ కొడతాను
అని మ్రొక్కిన వాళ్ళను మీ రెక్కడైనా చూశారా?

షుగర్ వస్తే తలనీలా లిస్తాను
రక్తపోటు రావాలే గాని అంగ ప్రదక్షిణం చేస్తాను
మలేరియా వస్తే కాలి నడకన కొండ కొస్తాను
టైఫాయిడ్ వస్తే నిలువు దోపిడి సమర్పించు కుంటాను.

ఇలా ఎవ్వరూ కోరి ఉండరు. ఎవ్వరూ మ్రొక్కి ఉండరు.
కోరినా, కోరక పోయినా వచ్చే కాలానికి అవి వచ్చి తీరుతాయి.

అవన్నీ ప్రారబ్ధ ఫలాలు. పిలవక పోయినా వచ్చే చుట్టాలు
అయినా వాటిని ఆహ్వానించే పని లోనే మనం తలమునకలై ఉంటాము
పిలవక పోయినా వచ్చే వాటిని పని గట్టుకొని మరీ పిలుస్తూ ఉంటాము.

ఆస్తులు అంతస్తులు
అధికారాలు ఆరోగ్యాలు
సంపదలు సంతానాలు
ప్రయాణాలు ప్రమోదాలు - ఇవన్నీ ప్రారబ్ధ ఫలాలే.





ఏవి ఎప్పుడు రావాలో అప్పుడు వస్తాయి
ప్రార్థించక పోయినా తప్పక ప్రాప్తిస్తాయి.

ముక్తి అనేది ప్రారబ్ధఫలం కాదు
ముక్తి అనేది మన ప్రారబ్ధంలో ఉంటే,
మనం పుట్టి ఉండే వాళ్ళమే కాదు
తరించి పోయి ఉండే వాళ్ళము.

మోక్షం ప్రారబ్ధ ఫలం కాదు, పురుషార్థ ఫలం
పురుషుడు ప్రయత్నంతో సాధించ వలసిన ఫలం.



## పురుషార్థములు

**పురుషేణ అర్థ్యతే ఇతి పురుషార్థమ్** - ప్రతి పురుషుడు ప్రయత్నించి పొందా లనుకునే ప్రయోజనాలే పురుషార్థాలు. అవియే ధర్మార్థ కామమోక్షాలు. వీటిలో అర్థకామాలు ప్రాణు లన్నిటిలో గోచరిస్తాయి. ధర్మమోక్షాలు మాత్రం కేవలం మానవులకే సంబంధించి ఉంటాయి.

## అర్థం

'అర్థం' అనే పురుషార్థం భద్రతకు సంబంధించింది. ఈ అర్థం అనే పురుషార్థం సర్వ ప్రాణులలో గోచరిస్తుంది. అభద్రత నుండి బయట పడేందుకు, భద్రతను పొందేందుకు జీవులు ఆశించే ప్రయోజనమే అర్థము.

దేహాన్ని రక్షించుకోవాలని అందరూ భావిస్తారు. శరీరానికి భద్రత కావాలి. అంటే, ప్రాణాన్ని నిలుపుకొనేందుకు, దేహాన్ని నిలబెట్టు కొనేందుకు మనిషికి ఆహార పానీయాలు కావాలి. శీతోష్ణాల నుండి రక్షించు కొనేందుకు బట్టలు కావాలి. వర్షాతపాల నుండి దేహాన్ని కాపాడు కొనేందుకు వసతి కావాలి. ఆహార, పానీయ, వసతి, వస్త్రాదులు అందరికీ అవసరమై ఉన్నాయి. అభద్రతా భావాన్ని తొలగించు కొనేందుకు అవసరమైన వీటన్నిటిని మనిషి ప్రయత్నంతో సాధిస్తాడు. అదే అర్థ మనే పురుషార్థము.

'అర్థ' ప్రయోజనాన్ని ఆశించి చేసే ప్రయత్నాలు మానవుల లోనే గాక సర్వ ప్రాణులలో కనిపిస్తాయి. మనిషి గృహం నిర్మించుకుంటే, గువ్వ గూడు కట్టు కుంటుంది. ఎలుకలు బొరియలు చేసుకుంటే, చీమలు పుట్టలు పెట్టుకుంటాయి. వండిన ఆహారాన్ని మనిషి తింటే, వంటబట్టే ఆహారాన్ని జంతువులు తింటాయి. నిలువ చేసుకొనే స్పృహ మానవుని లాగే జంతువులకూ ఉంది. కాకపోతే, ఎంత నిలువ చేసుకున్నా మనిషికి తృప్తి ఉండదు. ఈ విధమైన అసంతృప్తి జంతువులలో వెదకినా కనిపించదు. అదే తేడా.

అర్థ మనే పురుషార్థ సాధన ద్వారా ఏ భద్రతను మనిషి వాంఛిస్తున్నాడో అది మాత్రము లభ్యం కాదని తెలిసి మనిషి నిరాశలో కూరుకు పోతున్నాడు. అర్థాన్ని సాధించుకో గలడే గాని, అభద్రత నుండి విడివడ లేడు. దేహానికి ఎంత భద్రతను కల్పించినా, ఒకనాడు శ్మశానంలో గుంట తీసి దానిని భద్ర పరచక తప్పదు. ఈ విధంగా 'అర్థం' అనే పురుషార్థం పరమార్థం కాలేక పోతోంది.

## కామం

'భద్రత' అనేది ఎలా 'అర్థం' అనే పురుషార్థానికి సంబంధించినదో, 'సుఖం' అనేది అలా 'కామం' అనే పురుషార్థం పరిధిలో చేరుతుంది. ఈ సుఖం దేహేంద్రియ మనోబుద్ధులలో దేని కైనా సంబంధించింది కావచ్చు.

దేహ భద్రతకు ఆహారం కావాలి అనేది 'అర్థం'. ఆహారం ఇలాంటిదే కావాలి, అలాంటిదే ఉండాలి అనేది 'కామం'. ఇది భద్రతకు సంబంధించింది కాదు; సుఖానికి సంబంధించింది.

పడుకోవడానికి పడక అవసరం. అది అర్థం. మెత్తని దూది పరుపే కావాలి అనేది కామం. ఉండటానికి ఇల్లు అవసరం. అది అర్థం. అది రమ్యమైన హర్మ్యమే కావాలి అనేది కామం. సుఖ భోగాలకు సంబంధించిన విషయం.

ఆహారం, నిద్ర, వసతి, వస్త్రాదులే కాకుండా, మనిషికి రుచులు కావాలి. అవి కూడా అభిరుచులకు అనుగుణంగా ఉండాలి. అంతేకాదు, ఉల్లాసాలు, విలాసాలు, వినోదాలు, వికాసాలు - ఇలా ఎన్నో కావాలి.

అందాలు కావాలి, ఆభరణాలు కావాలి, విహారం కావాలి, సంగీతం కావాలి, ప్రేమలు కావాలి, శృంగారాలు కావాలి, నృత్యాలు కావాలి, సఖ్యాలు కావాలి, ఆటలు కావాలి, పాటలు కావాలి, పువ్వులు కావాలి, నవ్వులు కావాలి. ఇవన్నీ భద్రత కొరకు కాదు. సుఖం కొరకు. కనుక ఇవి 'అర్థం' అనే పురుషార్థం క్రిందికి రావు. సుఖానికి సంబంధించిన 'కామం' అనే పురుషార్థం క్రిందికి వస్తాయి.

కామ పురుషార్థంలో కూడా పశుపక్ష్యాదులు మానవుల లాగే వర్తిస్తున్నాయి. వాటికీ సుఖాలు, వినోదాలు ఉన్నాయి. కోతి ఆడుతుంది. కోయిల పాడుతుంది. నెమలి నాట్యం చేస్తుంది. నక్క ఈల వేస్తుంది. పడుకోవడానికి పక్షి మెత్తని గూడు నిర్మించు కుంటుంది. వాటికీ మన లాగే ఆట లున్నాయి. పాట లున్నాయి. అనుకున్నవి జరగ నపుడు, అనుకోనివి జరిగి నపుడు కలత లున్నాయి. కళ్ళల్లో నీళ్ళున్నాయి.

సుఖాన్నిస్తుందని ప్రాణులు, మానవులు 'కామ' పురుషార్థాన్ని ఆశ్రయిస్తారు. కానీ, అక్కడ కూడా మనిషికి నిరాశే ఎదు రవుతోంది. సుఖాన్నిచ్చే వస్తువు ఎప్పుడూ సుఖాన్నిచ్చే స్థితిలో ఉండదు. అలాగే ఒక వస్తువుతో, ఒక విషయంతో ఒక సమయంలో సుఖపడిన వ్యక్తి, అదే వస్తువుతో, అదే విషయంతో అన్ని కాలాలలో సుఖపడలేక పోతున్నాడు. ఈ దృశ్యమాన జగత్తులో సుఖ స్థానాలన్నీ క్షర మయ్యేవే. క్షయ మయ్యేవే. ఏది సుఖ హేతువో ఎంతకూ మనిషికి అంతు పట్టడం లేదు. ఈ విధంగా 'కామం' అనే పురుషార్థం పరమార్థం కాలేక పోతోంది.

### ధర్మం

ధర్మ మనే పురుషార్థంలో నైతిక మైన అవగాహన ఉంది. ధార్మిక చింతనము చోటు చేసుకొని ఉంది. ఇది వివేకానికి సంబంధించిన విషయం. విచారించే బుద్ధి కరువై, కేవలం సహజాతాలపై ఆధారపడి జీవించే జంతుజాలము ఈ ధర్మ పురుషార్థం వద్దకు చేర లేవు. ఇది కేవలం వివేకవంతు లైన మానవులకే సంబంధించిన పురుషార్థము. మొదటి రెండు పురుషార్థాలైన అర్థకామాలను సాధించు కోవడంలో మనిషి సన్మార్గం లోనే చరించాలి. ఋజుమార్గం లోనే పయనించాలి. ఇదే ధర్మజీవనము. చతుర్విధ పురుషార్థాలలో మూడవ పురుషార్థము.

నా విషయంలో ఇతరులు ఎలా ఉండాలని భావిస్తానో, నేను ఇతరుల విషయంలో అలాగే ఉండాలి. నా విషయంలో ఇతరులు ఎలా ప్రవర్తించ కూడదని నేను ఆశిస్తానో, నేను ఇతరుల విషయంలో అలా ప్రవర్తించకుండా జీవించాలి. ఇదే ధర్మస్పృహ. ధర్మమార్గము. ధర్మాన్ని ఎట్టి పరిస్థితుల లోను మానవులు అతిక్రమించ కూడదు.

దారి తప్పిన వారిని శిక్షించేందుకు, లేదా సంస్కరించేందుకు చట్టా లున్నాయి. దారి తప్పిన మనిషి చట్టాన్ని కూడా తప్పించుకొనే ప్రయత్నం చేస్తాడు. మనిషి చట్టం కళ్ళు కప్పి తప్పించు కోవచ్చు. కానీ, ధర్మం, దైవం కళ్ళు కప్పలేడు అంటూ మతం రంగ ప్రవేశం చేస్తుంది.





మానవులు ప్రపంచంలో స్థూలంగా కర్మలను ఆచరిస్తారు. కర్మాచరణానికి ముందు కర్మ చేయాలి అనే భావం మనస్సులో ఉంటుంది. భావం అంకురించనిదే కర్మ ఆచరింప బడదు. భావము కూడా కర్మే. మానస కర్మ. స్థూల కర్మకు స్థూల ఫలితం ఎలా ఉంటుందో, భావన అనే సూక్ష్మ కర్మకు సూక్ష్మ ఫలితం ఉంటుంది. ఈ సూక్ష్మ ఫలితాలే పాపపుణ్యాలు.

కర్మలు మానవాధీనాలు. ఫలితాలు దైవాధీనాలు. చట్టాన్ని మనిషి తప్పించు కోవచ్చు. కాని, పాపాన్ని తప్పించుకో లేడు. మానవ నిర్మితమైన చట్టం మనిషికి న్యాయం చేయక పోవచ్చు. కానీ పుణ్యఫలం అతని కొరకు నిరీక్షిస్తూనే ఉంటుంది.

ధర్మం పవిత్రమైంది. ధర్మం దైవానికి ప్రతిరూపము. అర్థకామాలను వాంఛించే వారు ధర్మబద్ధంగా జీవించడం అలవరచు కోవాలి. ధర్మంతో కూడిన కామం, ధర్మబద్ధమైన అర్థం సుఖశాంతుల్ని పెంపొందిస్తాయి.

**ధర్మా౽విరుద్ధో భూతేషు**
***కామో౽స్మి భరతర్షభ! -*** అర్జునా! ధర్మానికి విరుద్ధము కాని కామము నేనే అని గీతాచార్యుడు గీత - విజ్ఞాన యోగంలో చెబుతాడు.

ధర్మము అమృతము వంటిది. అది బ్రతుకుకు జీవం పోసి బ్రతికిస్తుంది. అధర్మం విషం లాంటిది. అది బ్రతుకును విషతుల్యం చేసి అంతం చేస్తుంది.

దుర్యోధనునికి రాజ్యం కావాలి. ఆ మాట కొస్తే, ధర్మరాజుకి రాజ్యం అవసరం లేదా? అదే వాస్తవ మైతే, కురుక్షేత్రం రణరంగ మయ్యే దేనా? రాజ్యం ఇద్దరికీ కావాలి. రాజ్య సుఖాలు కూడా ఇద్దరికీ కావాలి.

'కావాలి' అనే కాంక్ష ఇద్దరిలో ఉంది. కానీ, అదేదో, ధర్మబద్ధం గానే ప్రాప్తించాలి అంటాడు ధర్మరాజు. అధర్మంతో నైనా సరే ప్రాప్తించడమే ముఖ్యం అనుకుంటాడు దుర్యోధనుడు.

అధర్మంతో చరించిన దుర్యోధనుడు తాత్కాలికంగా సుఖించినా, చివరికి దుర్గతిని పొంది శాశ్వతంగా అపకీర్తి పాలయ్యాడు.

ధర్మమార్గాన చరించిన ధర్మరాజు, తాత్కాలికంగా వ్యథ చెందినా, చివరికి సద్గతిని పొంది శాశ్వతంగా కీర్తి మంతుడై శోభించాడు.

అధర్మ పరుడైన దుర్యోధనుణ్ణి అపజయం వాటేసుకుంది
ధర్మమూర్తి యైన ధర్మరాజును విజయం వరించింది.

**యతో ధర్మః తతో కృష్ణః**
**యతో కృష్ణః తతో జయః -** ధర్మ మెక్కడ ఉంటుందో దైవం అక్కడే ఉంటుంది. దైవం ఎక్కడ ఉంటుందో, జయం అక్కడే ఉంటుంది అని మహాభారత సూక్తి. వేదవ్యాస మహర్షోక్తి. మహాత్ము లందరికీ దివ్యస్ఫూర్తి.

ఇంత వరకు మనం చెప్పుకున్న మూడు పురుషార్థాలలో అగ్రస్థానము ధర్మానిదే. ద్వితీయ స్థానం అర్థం కాగా, చివరిది కామం. అందుచేత ధర్మార్థకామాలు అంటాము. అవి త్రివర్గములు.

సాధారణంగా ఈ మూడు పురుషార్థాలే ఎక్కువగా మానవుల్ని ఆకర్షిస్తూ ఉంటాయి. మానవులు కూడా ఎక్కువ శాతం ఈ మూడిటినే అనుసరిస్తూ ఉంటారు.

ఇక నాల్గవ పురుషార్థము మోక్షము. దీనిని వాంఛించే వాడు ముముక్షువు.

ఇది చివరి పురుషార్థము. మోక్ష రూపమైంది. దీనిని అందరూ ఆశ్రయించ లేరు. ధర్మార్థ కామాలలో దాగి ఉన్న పరిమితాలను అర్థం చేసుకున్న వారే పరమ పురుషార్థమైన మోక్షాన్ని ఆశిస్తారు.

కేవలం ధర్మార్థ కామాల పరిధిలో మనిషి సంతృప్తి చెంద లేడు. అతని సమస్య లౌకిక మైంది కాదు. పారమార్థికమై ఉంది. అసంతృప్తిని భరించే స్థితిలో ఏ వ్యక్తీ లేడు. పరిమితాలను సహించే స్థితిలో ఏ మనిషీ లేడు. అభావాన్ని అంగీకరించ లేడు. అజ్ఞానాన్ని భరించ లేడు. దుఃఖాన్ని సహించ లేడు. సర్వానర్థాల నుండి విడిపడా లనేదే అతని కోరిక. ఈ కోర్కెను తీర్చే శక్తి ధర్మార్థ కామాలకు లేదు. ఈ సత్యం అర్థమైన వెంటనే వ్యక్తి నాల్గవ పురుషార్థం వైపు తిరుగుతాడు. అదే మోక్షం. సర్వబంధ వినిర్ముక్త స్వరూపం.

## మోక్షం

మోక్ష మనేది సహజమైన స్వేచ్ఛ. అందరూ కోరుకునే విముక్తి. అందరూ వాంఛించేది ఇదే అయినా, కొందరికి మాత్రమే ఈ విషయం తెలుసు. అయిష్టమైన దానిని ఎవ్వరూ భరించ లేరు. పంజరంలో ఉంచితే పక్షి కూడా యాతన ననుభవిస్తుంది. బయట పడాలని తపన చెందుతుంది. విడుదల కావాలని గిల గిల తన్ను కుంటుంది. పంజరంలో ఉండటం బంధం. విడుదల కావటం మోక్షం.

కారాగృహంలో బంధింప బడిన ఖైది ఏం కోరుకుంటాడు? అతనికి చాలా అవసరాలు ఉండొచ్చు. కానీ అతడి ముఖ్యావసరం, అతడు వాంఛించే ప్రధాన ప్రయోజనం విడుదల మాత్రమే. అదే విముక్తి. అదే మోక్షము.

## ఆత్మానం పాశేభ్యః మోచయతీతి మోక్షః

జీవుని బంధము నుండి విడిపించేది ఏదో, అదే మోక్షము.

బంధము నుండి విడిపడాలి అనే వాంఛ అందరిలో ఉంది. అదే అందరిలో ప్రధాన వాంఛ. జీవు లందరూ ఆశించే ముఖ్య ప్రయోజనం అదే. అందుకే అది పరమ పురుషార్థ మైంది.

ఇంతకీ, మోక్ష మంటే పొందడమా? విడి పడటమా? అనే ప్రశ్న ఈ దశలో ఉదయిస్తుంది. నిజమే. పొందినట్లే అనిపిస్తున్నా, వాస్తవానికి పోగొట్టుకున్నట్లే ఉంది. ఖైది స్వేచ్ఛను పొందినాడు అంటాము. కానీ, యథార్థానికి అతడు బంధము నుండి విడి పడ్డాడు. అదే విముక్తి. మోక్షం కూడా అలాగే కనిపిస్తూ ఉంది.

బంధము ఏదో కాదు. దుఃఖాన్ని కలిగించేది ఏదైనా బంధమే. అందుకనే, బంధాన్ని ఎవ్వరూ భరించ లేరు. దుఃఖాన్ని కలిగించే బంధము నుండి విడి పడాలని కోరుకుంటారు. అదే మోక్షేచ్ఛ. విముక్తిని అభిలషించే ప్రగాఢ వాంఛ. దుఃఖం నుండి, అసంతృప్తి నుండి శాశ్వతంగా విడి పడాలనే ఆశ. ఏకైక ఆకాంక్ష.

## దుఃఖాదీనాం మోక్షణం అవసానం మోక్షః

దుఃఖాదుల యొక్క వినాశమే మోక్షము.

దుఃఖాన్ని కలిగించేది బంధమైతే, సుఖాన్ని కలిగించేది మోక్షము. అదే బంధ విముక్తి. అసంతృప్తి బంధమైతే, అసంతృప్తి నుండి శాశ్వతంగా విడిపించి నిత్యతృప్తిని ప్రసాదించేది మోక్షము. అదే అందరూ ఆశించేది.

## తృప్తః భవిష్యామి

నేను తృప్తిని పొందాలి. తృప్తుడనై ఉండాలి. ఇదే అందరి అభిలాష. కానీ, నేను తృప్తి చెందాలి అని ఎవరైతే అంటున్నారో, వారు ఎవరైనా సరే, ప్రస్తుతం అసంతృప్తిలో ఉన్నారని అర్థము. అంతేకాదు. అసంతృప్తిని భరించ లేక దాని నుండి విముక్తిని పొందాలని కోరుకుంటున్నారని భావం.





అసంతృప్తి వలన కలిగే దుఃఖాన్ని మనిషి భరించలేక పోతున్నాడు. ఇదే బంధము. దాని నుండి విడుదల పొందాలని యత్నిస్తున్నాడు. అదే మోక్షము.

## అసంతృప్తి

మనిషికి ఎన్ని ఉన్నా, ఎంత ఉన్నా, ఎందరున్నా, వాటితో పాటు ఏదో లేదు అనేది కూడా ఉంటుంది. అదే అసంతృప్తి. ఆంతర్యంలో ఏదో అసౌకర్యం. అసంపూర్ణత. దానిని హాయిగా, ఆనందంగా భరించ గలిగితే ఏ సమస్య ఉండదు. అసంతృప్తిని మనిషి క్షణ కాలం కూడా భరించలేక పోతున్నాడు. కారాగృహం నుండి విడుదల పొందాలని ఖైదీ ఎలా తపిస్తున్నాడో, అసంతృప్తి నుండి, దుఃఖం నుండి విడిపడాలని ప్రతి మనిషి అలా పరితపిస్తున్నాడు.

## కిం అస్మాభిః దీనైః కరణీయం?

ఈ దీన స్థితి నుండి బయట పడటానికి మేము ఏమి చేయాలి? అని అందరూ ఆవేదన చెందు తున్నారు. ఈ వెలితి తొలగే మార్గ మేదో తెలియక అలమటిస్తున్నారు.

ఇదొక విచిత్రమైన సమస్య. వింత సమస్య. తృప్తి ఎక్కడుందో అర్థం గాని సమస్య. ఎవరూ ఎవరినీ తృప్తి పరచలేని ఈ జగత్తులో తృప్తిని పొందాలని జల్లెడ చేత పట్టుకొని గాలిస్తున్నాం. ప్రయత్నాలు విస్తరిస్తున్నాయే గాని ఫలితాలు వెలుగు చూడటం లేదు. వెలితి . . వెలితి . . వెలితి. ఎప్పుడూ ఇదే పరిస్థితి. ఎవరి దైనా ఇదే గతి.

ఏది ఉన్నా వెలితే. ఏది లేకపోయినా వెలితే.
ఎవరు ఉన్నా వెలితే. ఎవరు లేకపోయినా వెలితే.
ఇక్కడున్నా వెలితే. అక్కడున్నా వెలితే.
ఇప్పుడైనా వెలితే. అప్పుడైనా వెలితే.
అనుకూలంలో వెలితే. ప్రతికూలంలో వెలితే.

ప్రయత్నించి లేని దానిని పొందుతాము. లేని దానిని పొందుతామే గాని 'లేదు' అనే దానిని పోగొట్టుకోలేము. 'లేదు' అనేదే మనస్సులో ఉన్నప్పుడు, ఏది ఉండి మాత్రం ఏమి ప్రయోజనం? అందుకే అందరూ అసంతృప్తితో అలమటిస్తూ ఉన్నారు. భాగ్యా లొస్తే తృప్తిగా జీవించ వచ్చు అనుకుంటారు పేదలు. బాధలు తీరితే సుఖంగా బ్రతకవచ్చు అనుకుంటారు ధనికులు. ఎవరికి ఏదుందో, ఏది లేదో తెలియదు గాని, అసంతృప్తి మాత్రం అందరికీ ఉంది. ఆవేదన అందరికీ ఉంది. అశాంతి అందరికీ ఉంది.

## సుఖప్రాప్తి

### ఇష్టప్రాప్తి అనిష్ట నివారణ చికీర్షా
### స్వాభావికా సర్వ ప్రాణిషు దృష్టత్వాత్

ఇష్టమైన దానిని పొందడము, అయిష్టమైన దానిని విడిచి పెట్టడము అనే కోరిక సర్వ ప్రాణులలో సహజంగా కనిపిస్తూ ఉంటుంది. ఇష్టమైన దేదో అది సుఖ మని, అయిష్ట మైనది అసుఖం అని అందరూ భావిస్తుంటారు.

మనం ఈ ప్రపంచంలో దేనిని ఆశించినా, అది సుఖ మని భావించి దానిని కోరుకోవడం లేదు. అది సుఖ హేతువు అని భావించి దానిని పొందు తున్నాము. ఏది సుఖహేతువు అని భావించి మనం ఆశించి పొందుతామో, అది సుఖ కారణం కాదు అని తెలియగానే ఆ క్షణం లోనే దానిని త్యజిస్తాము.

సుఖం అనేది ఒక వస్తువు కాదు. సుఖ మనేది వస్తువే అయితే, ఆ వస్తువు అందరికీ సుఖా న్నిచ్చేదై ఉండాలి. అలాంటి వస్తు వేదీ ప్రపంచంలో గోచరించడం లేదు.

సుఖ మనేది కాలం కాదు. ప్రపంచంలో సమయాలు తెలుస్తున్నాయే గాని, ఏవి సుఖ సమయాలో తెలియడం లేదు. ఆనంద కాలాలు ఎంత అన్వేషించినా అంతు పట్టడం లేదు. రాహువు ఎక్కడున్నాడో తెలుస్తున్నాడు కనుక రాహుకాలం ఉంది. సుఖ మెక్కడుందో తెలియడం లేదు కనుక సుఖ కాలం తెలిసి రావడం లేదు.

సుఖ మనేది ప్రదేశమూ కాదు. సుఖం ఇక్కడ లేక పోవచ్చు. అలాగని, అక్కడుంది అని చెప్పడానికి ఆధారాలు లేవు. ఎక్కడి కెళ్ళినా, ఏ ప్రదేశాన్ని చేరినా అన్నీ ఎండమావులే. అందుకనే ఆరాధనాస్థలాలు ఆదాయ కేంద్రాలుగా మారిపోతూ ఉంటే, ఆశ్రమ ప్రదేశాలు ఆవేదనా నిలయాలుగా గోచరిస్తున్నాయి.

సుఖ మనేది సన్నివేశమూ కాదు. ప్రపంచంలో సంఘటనలు, సన్నివేశాలు ఉన్నాయి. సుఖ సన్నివేశాలు లేవు. ఒకే సన్నివేశం కొందరికి సుఖాన్ని, కొందరికి దుఃఖాన్ని పంచడానికి కూడా కారణం సుఖం సన్నివేశానికి సంబంధించింది కాక పోవటమే.

ఇంతకీ ఏది సుఖం? ఎక్కడుంది?
ఏది సుఖ కారణం? అదెక్కడుంది?



## ప్రయత్నాలు - ఫలితాలు

**అన్తవత్తు ఫలం తేషాం**
**తద్భవ త్యల్ప మేధసామ్**

వివేకం అల్పంగా ఉండేవారు
పొందే ఫలం కూడా స్వల్పం గానే ఉంటుంది.

ప్రియమైన వస్తువులో సుఖం ఉంటుంది. కానీ, ఏది మనకు ప్రియవస్తువో మనకే అర్థం కావడం లేదు. ఇక సుఖపడే దేముంటుంది? ఒక కాలంలో ప్రియ మైనది మరొక కాలంలో ప్రియంగా లేదు. ఒక ప్రదేశంలో ప్రియంగా అగుపించింది, మరొక ప్రదేశంలో ప్రియంగా అగుపించదు.

యత్నించి, శ్రమించి మనం ఏవో ఏవో పొందు తున్నాము. ప్రయత్నించి, పరిశ్రమించి ఏవో ఏవో పోగొట్టు కుంటున్నాము. మన యత్నంలో ఏదైనా రావచ్చు; సుఖం మాత్రం రాదు. మన ప్రయత్నం వల్ల ఏదైనా పోవచ్చు; దుఃఖం మాత్రం పోదు.

ఒకవేళ ఎక్కడైనా, ఎప్పుడైనా సుఖం కొద్దో గొప్పో ప్రాప్తించినా, అది దుఃఖమిశ్రితం గానే ఉంటుంది. దుఃఖాలు తెలియని సుఖాలు ప్రపంచంలో లేవు. నష్టాలు తెలియని లాభాలు కాగడా పెట్టి వెతికినా కనిపించవు.

నిజం చెప్పాలంటే, లాభాల ముసుగులో
వచ్చే వన్నీ నష్టాలే.
రాబట్టుకొనే వన్నీ పోగొట్టు కొనేందుకే
వాటేసుకునే వన్నీ కాటేసి పోయేందుకే.

వచ్చేవి ఏవయినా పోయేందుకే వస్తాయి
ఉన్నవి ఏవయినా పోయేందుకే ఉంటాయి.

అన్నీ పోతున్నాయి. అందరూ పోతున్నారు. తల్లిదండ్రులు పోతున్నారు. బిడ్డలు పోతున్నారు. భార్యలు భర్తల్ని పోగొట్టు కుంటున్నారు. భర్తలు భార్యల్ని పోగొట్టు కుంటున్నారు. ఉద్యోగాలు ఊడి పోతున్నాయి.





పదవులు పారి పోతున్నాయి. ధనం ఖర్చై పోతూ ఉంది. ఆరోగ్యం క్షీణించి పోతూ ఉంది. పళ్ళు ఊడి పోతున్నాయి. వెంట్రుకలు రాలి పోతున్నాయి. చూపు మారి పోతోంది. వినికిడి జారి పోతోంది. ఆయుష్షు కారి పోతోంది.

పరిశ్రమించి పొందిన వాటిని
ఎంత శ్రమించినా నిలుపుకోలేక పోతున్నాము.

ప్రయత్నించి పోగొట్టుకున్న వాటిని
తిరిగి రాకుండా ఆపు చేయలే కున్నాము.

పొందినవి సుఖాలే అయితే, అవి ఉన్నప్పుడు మనం సుఖంగా ఉండాలి. పోయినవి దుఃఖాలే అయితే, అవి పోగానే దుఃఖం కూడా దూరం కావాలి. కానీ, రెండూ జరగడం లేదు.

మన ప్రయత్నాలతో ఎలాగూ సుఖపడలేక పోతున్నాం. పోనీ, ఇతరుల కారణంగా నైనా సుఖపడే అవకాశం ఉందా? ఇది మరీ దారుణం! మన సుఖం పరులపై ఆధారపడి ఉండే దయితే, మన సుఖాన్ని నిర్ణయించే వారు పరు లవుతారు. అదే నిజమైతే, మనం సుఖపడట మనేది కుందేటి కొమ్మే.



## ప్రియ వస్తువు - సుఖ స్థానం

**అస్మాకం అప్రత్యక్ష మపి**
**చిరంతనానాం ప్రత్యక్షమ్**

మనకు స్పష్టం కాని సత్యము
మన పూర్వీకులకు సుస్పష్టము.
ఇది శంకలకు తావు లేని బాట
కారణం, ఇది శ్రీ ఆదిశంకరుల మాట.

ఏది ప్రియమో, ఏది సుఖమో, ఏది ప్రియ వస్తువో, ఏది సుఖ స్థానమో తెలియక తికమక పడుతున్నాం. 'మన' అనే దానిలో సుఖ ముందా? మనలో సుఖముందా? మనమే సుఖమా? లేక సుఖమే మనమా?

'నేను ఇప్పుడు సుఖంగా లేను' అంటే, ఈ పరిస్థితికి ముందు సుఖంగా ఉన్నాను అని భావము.

'నేను ఇప్పుడు సుఖంగా ఉన్నాను' అంటే, ఈ పరిస్థితికి ముందు సుఖంగా లేను, సుఖాన్ని ఆశించే వాడుగా ఉన్నాను అని అర్థం.

దీనిని బట్టి చూస్తే, 'నేను సుఖ పడుతున్నాను', 'నేను సుఖ పడ్డాను' అనే వాక్యాలు సుఖం చుట్టు తిరుగుతూ ఉన్నాయే గాని నిత్యసుఖానికి సంబంధించి మాత్రం లేవు. సుఖస్థానం తెలిసినవి కానే కావు.

ఒక కారణంగా, ఒక సమయంలో కలిగే సుఖం నిత్యసుఖం కాదు. దానిని నైమిత్తిక సుఖం అంటారు. సుఖానికి నిమిత్తం ఉంది కనుక, నిమిత్తం దూరమైతే సుఖం జారి పోతుంది. అలాంటి సుఖం కూడా సుఖమే. కానీ, అది అల్పసుఖం. అనిత్య సుఖం. నిత్యసుఖం మాత్రం కానే కాదు.

**నిమిత్తాపాయే నైమిత్తి కాపాయః**
**ఛత్రోపాయే ఛాయోపాయః**

సుఖ కారణం పోతే సుఖం పోతుంది.
గొడుగు దూరమైతే నీడ దూర మవుతుంది.

లేకుండా వచ్చి కలిసేది, ఉండి లేకుండా పోయేది నిత్యసుఖం కాదు. అనిత్య సుఖ మేదైనా, అప్రియంగా మారేదే. అప్రియ మైనది నిత్య సుఖస్థానం కాలేదు. కనుక నిత్య సుఖము, నిత్య ప్రియత్వము అనే మోక్షము ప్రయత్నాల పరిధి లోనిది కాదు. కర్మఫలం కాబోదు.

**కర్తవ్యేన సాధ్యశ్చేత్**
**మోక్షః అభ్యుపగమ్యతే**
**అనిత్య ఏవస్యాత్ !**

కర్మ ద్వారా సాధించే ఫలితమే మోక్ష మయ్యేటట్లైతే, అట్టి మోక్షము కూడా అనిత్యమే అవుతుంది అన్నారు బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీ శంకరులు.

ఇంతకీ, ఏది ప్రియవస్తువు?
ఎక్కడ సుఖ స్థానము?

కర్మఫలంగా ప్రాప్తించేది ఏదీ ప్రియవస్తువు కాదు. పరిమితంగా ఉండేది ఏదీ సుఖస్థానము కాదు.

ప్రియవస్తువు ఏదో అది ఏ పరిస్థితుల లోను అప్రియం కాకూడదు. అప్పుడే అది ప్రియవస్తువు అవుతుంది.

అప్రియంగా మారకుండా సదా ప్రియంగా ఉండేది ఏదైనా ఉందేమో ఆలోచించండి. దానిని కనిపెట్ట గలిగితే అదే నిత్యసుఖం కనుక, సుఖస్థానాన్ని కూడా కనిపెట్టిన వాళ్ళ మవుతాము.

ఎవరికి ఏది ప్రియమో, ఏది అప్రియమో నాకు తెలియదు. నీకు ఏది ఇష్టమో, ఏది అయిష్టమో నేను చెప్పలేను. నీకు నీవు సదా ఇష్టమే అని మాత్రం చెప్పగలను. నీకు నీవు ఎప్పుడూ అయిష్టుడివి కావు అని భేరీ మ్రోగించి మరీ చెప్పగలను. నీకు నీవు ఎలా ఇష్టమో, నాకు నేను అలా ఇష్టము. నీకు నీవు ఎలా ప్రియమో, నాకు నేను అలా ప్రియము.

**కదాచిన్నాహం అప్రియః**

నాకు నేను ఎప్పుడూ అప్రియం కాను.

ఇంకే ముంది? దొరికి పోయింది చిరునామా. ప్రియవస్తువు ఏదో తెలిసి పోయింది. సుఖ స్థాన మెక్కడో అర్థమై పోయింది.

ప్రియవస్తువు ఏదో కాదు, నీవే. సుఖస్థానం ఎక్కడో లేదు, నీవే. అది నీవే **(తత్త్వమసి)** ప్రియవస్తువు నీవే అని తెలియక పోవడం చేత, అది ఎక్కడో ఉందని స్తనశల్య పరీక్ష చేస్తూ ప్రపంచ మంతా గాలించి మరీ అన్వేషించావు.

ప్రియత్వము అనేది వస్తువుకు సంబంధించింది కాదు. సుఖస్థాన మనేది దృశ్య ప్రపంచం కానే కాదు అని తేలి పోయింది. దృశ్య విషయ మంతా నిషేధింప బడిన తరువాత, ఇక ప్రియవస్తువుగా ఒక్కటే మిగిలింది. అదే నీవు. **విషయి.** నీవే ప్రియ వస్తువు. నీవు నీకు ప్రియం కనుకనే ఏవైనా నీకు ప్రియంగా గోచరిస్తున్నాయి.

**ఆత్మ నస్తు కామాయ**
**సర్వం ప్రియం భవతి**

ఏది నీకు ప్రియంగా గోచరించినా ప్రియత్వానికి హేతువు నీవే. ఇది అర్థమైతే, ఇంకెక్కడి అసంతృప్తి? అర్థం కాకపోతే ఎలా వస్తుంది తృప్తి?

తెలియనంత వరకు లేనట్లే ఉంది. తెలియగానే లేని దెప్పుడు? అని ఆశ్చర్యం కలుగుతోంది.





చరణము : **కట్టినాను నీ కొరకే**
**పూలగూడు నా మదిలో**
**వచ్చెద వని ఎదురు చూచితిని**
**వచ్చి ఉంటివని ఎరుగ నైతిని**
పల్లవి : **నీ చరిత పాడుకోనా!**
**మనసార వేడుకోనా!**
అనుపల్లవి : **నా శ్రమలు తీరిపోగా**
**తొలి భ్రమలు పారిపోగా ॥ నీ చరిత ॥**

అని చైతన్య రవళి నినదించింది ఇక్కడే. అక్కడే బ్రహ్మమును లేదా మోక్షమును పొందాలి అన్నది ఉపనిషత్తు **(అత్ర బ్రహ్మ సమశ్నుతే).**

## ఉన్నది - తెలియనిది

**ఆనందాబ్ధిః యత్పరః**
**సోऽ హమస్మి**

'ఏది ఆనంద సాగరమో
అది నేనే' అన్నది ఉపనిషత్తు.

ఆనంద స్వరూపమైన ఆత్మయే సుఖహేతువు అనేది తెలియని కారణంగా, అనాత్మ విషయాలైన వస్తువులను సుఖహేతువులుగా భావించి వాటిని ప్రియ వస్తువులుగా స్వీకరిస్తున్నాం. ప్రియం గాని వాటిని ప్రియంగా భావించడానికి కారణము ప్రియ వస్తువైన ఆత్మ తెలియక పోవడమే. ఆత్మ తెలియడం లేదు అంటే, ఆత్మ లేదని అర్థమా? లేనిది అయితే, తెలియడం లేదు అని ఎలా చెప్పగలం? కనుక, ఆత్మ ఉన్నదే; తెలియకుండా ఉన్నది.

ఉండి తెలియక పోవడం అజ్ఞానము. అదే బంధము.
ఉన్నది ఉన్నట్లు తెలియడం జ్ఞానము. అదే మోక్షము.
తెలిసీ తెలియని తనము ముముక్షుత్వము. మోక్షేచ్ఛకు కారణము.

నీవే ఆత్మ. నీవే సుఖం. నీవు సుఖించ డానికి ఏదీ అవసరం లేదు. కోరికలు తీర నవసరం లేదు. కోరికలు తీరడం వల్ల కాదు సుఖం కలిగేది; కోరికలు లేని వాడుగా ఉండటం వల్ల.

కోరిక మనస్సులో కదలక ముందు నువ్వు సుఖం గానే ఉన్నావు. కోరిక తీరిన తరువాత మళ్ళీ సుఖంగా కనిపిస్తున్నావు. ఎక్కడ కోరిక లేకుండా నీవు నీవుగా ఉన్నావో, అక్కడే నువ్వు సుఖంగా ఉన్నావు. నీవు సుఖరూప మైన ఆత్మవు అనడానికి ఇదొక ఆధారము.

అలాగే, గాఢనిద్రలో నువ్వు సుఖానుభూతిలో ఉన్నావు. కారణ మేమిటి? అక్కడ కోరిక తీరడం కాదు; కోరిక లేకపోవడం. అమనస్కం కావడం. నీ స్వరూపాన్ని, స్వరూపానందాన్ని భగ్నం చేసే కోరికలు, సంకల్పాలు లేనపుడు నీవు సుఖానుభూతిని పొందుతున్నావు. అదే స్వరూపానుభూతి. అది ఉన్నదే కాని లేనిది కాదు. ఉన్నదే కాని, ఉన్నట్లు తెలియకుండా ఉంది. కనుక ఏదో లేకపోవడం బంధ కారణము కాదు. ఉన్నది తెలియక పోవడమే బంధ హేతువు. తెలియక పోవడం అజ్ఞానము. అజ్ఞానమే బంధము. అజ్ఞానము బంధ మైనందున జ్ఞానమే మోక్షము.

కనుక, సమస్య ప్రపంచానికి సంబంధించింది కాదు. సమస్య వ్యక్తికి సంబంధించింది. వ్యక్తి మీదనే కేంద్రీకృతమై ఉంది. తానేమిటో తనకు తెలియక పోవడము సమస్య. అదే బంధము. తానేమిటో తనకు తెలియడమే పరిష్కారము. అదే మోక్షము.

మనిషికి సమస్య లేదు.
మనిషే నిజానికి సమస్య.

## సమస్య ఎక్కడుందో
## పరిష్కారం అక్కడే ఉంది

పరిష్కార మేమిటో అర్థం కానంత వరకు సమస్య సమస్య గానే ఉంటుంది. వాస్తవానికి పరిష్కారం లేని సమస్య అంటూ ఉండదు. సమస్య అనేది ఉంది అంటే, దానికి సంబంధించిన పరిష్కారము కూడా ఉంటుంది. అదేమిటో మనకు తెలియ నపుడు సమస్య ఒక్కటే ఉంటుంది. తెలిసిన మరుక్షణాన సమస్య, పరిష్కారము రెండూ లేకుండా పోతాయి.

సమస్యను బట్టే పరిష్కారం ఉంటుంది. సమస్య యొక్క స్వభావాన్ని బట్టే పరిష్కారము యొక్క స్వరూపము తెలుస్తూ ఉంటుంది.

కొన్ని సమస్యలకు పరిష్కారాలు సమస్యలకు బాహ్యంలో ఉంటాయి. కొన్ని సమస్యలకు పరిష్కారాలు సమస్యల లోనే దాగి ఉంటాయి.

దప్పిక సమస్యగా ఉందనుకోండి. దాహం తీర్చుకోవడమే పరిష్కారము. దప్పిక మనలో ఉంది. కానీ, పరిష్కారం బాహ్యంలో ఉంది. దాహాన్ని తీర్చే నీళ్ళు మనలో లేవు. మనకు బాహ్యంలో ఉన్నాయి. ఇదొక రకమైన సమస్యా పరిష్కారము.

మరొక సమస్య ఉంది. ఆ సమస్యకు పరిష్కారం బాహ్యంలో కాకుండా సమస్య తోనే ముడిపడి ఉంది. ముడి ఉన్నంత వరకు సమస్య ఉంటుంది. ముడి విప్పితే పరిష్కారం ఉంటుంది. సమస్య అదృశ్యం అవుతుంది. సందేహం అంతటితో అంత మౌతుంది.

**భిద్యతే హృదయ గ్రంథిః**
**ఛిద్యన్తే సర్వ సంశయాః**

హృదయ ముడి విడి పోతే
సంశయాలు పారి పోతాయి.
ముడి ఉందని చెప్పిన ముండకమే
ముడిని విప్పి లేదని చూపింది.

పొడుపు కథలలో చిక్కుముడులు వేసి, సరదాగా సమస్యలను పరిష్కరించుకొనే ప్రక్రియ మనకు తెలుసు. వాటిలో సమస్య లోనే పరిష్కారం నిగూఢంగా ఉంటుంది. విప్పితేనే గుట్టు బయట పడుతుంది.

**కా శీతల వాహినీ గంగా?**

*గంగ ఎక్కడ ప్రవహిస్తూ ఉంది?*
*అనేది ప్రశ్న రూపంలో సమస్య.*





**కాశీ తల వాహినీ గంగా !**

*గంగ కాశిలో ప్రవహిస్తూ ఉంది*
*అనేది సమాధాన రూపంలో పరిష్కారము.*

ఇంతకీ, మన సమస్యకు పరిష్కారం బాహ్యంలో ఉందా? లేక, అది కేవలం అంతరాలాప మేనా?

మన సమస్య బాహ్యానికి సంబంధించింది కాదు. కనుక, దానికి పరిష్కారము బాహ్యంలో లేదు. బంధము అనేది వ్యక్తిపై కేంద్రీకృతమై ఉంది. కనుక ఎక్కడ సమస్య ఉందో, అక్కడే పరిష్కార ముంది.

మనిషికి సమస్య లేదు. మనిషే సమస్య.
మనిషి సమస్యకు మనిషే పరిష్కారము.

## తానే సమస్య - తానే పరిష్కారము

చిదంబరంలో నటరాజ స్వామి క్షేత్రపాలకుడు. ఆర్ద్రా దర్శనం చాలా విశిష్టమైన దని అక్కడ భావిస్తారు. ఆర్ద్ర అనేది నక్షత్రము పేరు అని మనకు తెలుసు. ఆర్ద్ర అంటే తడిసింది అని కూడా అర్థము.

ఆర్ద్రాదర్శనము మార్గశీర్షంలో పూర్ణిమ నాడు వస్తుంది. అది మంచు ఎక్కువగా కురిసే సమయం. కనుక చలి అధికంగా ఉంటుంది. చలి అధికంగా ఉండే ఆ రోజు, శివభక్తులు బ్రహ్మముహూర్త కాలంలో స్నానం చేసి, 'శివశివ' అంటూ వెళ్ళి నటరాజస్వామిని దర్శిస్తారు. విశేషమైన ఆర్ద్రా దర్శనంలో పులకరించి పరవశిస్తారు. ఒకవేళ భక్తులు పులకరించకుండానే పరవశించినా, చలి పని గట్టుకొని మరీ వారిని పులకరింప చేస్తుంది.

ఆర్ద్రా దర్శన సందర్భమును పురస్కరించుకొని ఒక కవి చమత్కరించిన అందమైన అద్భుతమైన శ్లోకం ఒకటుంది. ప్రస్తుతం మనం చర్చిస్తున్న 'సమస్య, పరిష్కారము ఒక్కచోటే' అనే అంశాన్ని ఈ శ్లోకం సోదాహరణంగా వర్ణించి వివరిస్తుంది.

**శ్లో॥ మౌళౌ గంగా శశాంకౌ కరచరణ తలే శీతలాంగా భుజంగాః**
**వామే భాగే దయార్ద్ర హిమగిరి దుహితా చందనం సర్వగాత్రే**
**ఇత్థం శీతం ప్రభూతం కనక సభా నాథ! సోఢుం క్వ శక్తిః ?**
**చిత్తే నిర్వేద తప్తే యది భవతి న తే నిత్య వాసో మదీయే ॥**

అది పరమేశ్వరుని విభూతి యైన మార్గశీర్షం ( **మాసానాం మార్గశీర్షోహం** - *గీత ; 10 వ అ - 35 వ శ్లో*). బ్రహ్మ ముహూర్త కాలం. చీకటి తెరలు తొలగ లేదు. మంచు దట్టంగా కురుస్తోంది. చలి పులిలా వణికిస్తోంది. చిదంబరేశ్వరుని దర్శించాలని ఒక భక్తుడు ఆలయం లోకి భక్తితో ప్రవేశించాడు. దుర్భరమైన చలిని భరించలేక పోతున్నాడు. ప్రార్థనా మంత్రాలు ఉచ్చరిస్తూ ఉంటే, పదాలు పైకి వినిపించడం లేదు. పదాల శబ్దాలు కటకట మనే దంత ఘోషల మధ్య మరుగున పడి పోతున్నాయి. ఎలాగో శక్తిని కూడ గట్టుకొని పై శ్లోకాన్ని ఆ భక్తుడు అతి కష్టం మీద పలికాడు. శ్లోకం లోని మొదటి మూడు పాదాలు సమస్యను చక్కగా చూపెడుతూ ఉంటే, నాల్గవ పాదము పరిష్కారాన్ని దర్శింప చేస్తూ ఉంది. అపూర్వము, ఆశ్చర్యకరమైన ఈ శ్లోక భావాన్ని చూద్దాం. చిదంబర క్షేత్రపాలకుడైన చంద్రమౌళీశ్వర స్వామిని తన హృదయ సింహాసనముపై ఆసీనుణ్ణి చేసి, స్వామిని దర్శిస్తూ కనక సభాపతిని వర్ణించడం ప్రారంభించాడు ఒక భక్తుడు.

పరమేశ్వరా! నీ సిగ జల, పుష్ప శోభతో ప్రకాశిస్తోంది. గంగమ్మ చల్లగా నిన్ను అభిషేకిస్తూ ఉంటే, చంద్రుడు సిగ పువ్వై శోభిస్తున్నాడు **( మౌళౌ గంగా శశాంకౌ )**.

నటరాజా! నీ హస్తపాదాలను చల్లని, మెత్తని పాములు ఆభరణాల వలె చుట్టుకొని ఉన్నాయి **( కరచరణ తలే శీతలాంగాః భుజంగాః )**.

పార్వతీశా! నీ ఎడమ పార్శ్వ మంతా హిమవంతుని తనయ, దయ గల చల్లని మా తల్లి హైమావతి పెనవేసుకొని ఉంది **( వామే భాగే దయార్ద్ర హిమగిరి దుహితా )**.

హే చంద్రచూడా! నీ దేహ మంతా చల్లని చందనపు పూతలే **( చందనం సర్వ గాత్రే )**.

హే త్రినేత్రధారీ! సాంబశివా! ప్రభూతమైన ఈ శీతాన్ని ఎలా సహిస్తున్నావు? దుర్భరమైన ఈ చలువను ఓర్చుకొనే శక్తి నీ కెలా వచ్చింది **( ఇత్థం శీతం ప్రభూతం కనక సభానాథ! సోఢుం క్వ శక్తిః )**?

ప్రభో! మహేశ్వరా! తాపాలతో, పరితాపాలతో నిరంతరము సలసల కాగే నా హృదయమే కదా నీకు నిత్య నివాస స్థానము! **( నిత్య తప్తే నిర్వేద తప్తే మదీయ చిత్తే తే నిత్యవాసః )**.

భక్తవత్సలా! భవహరా! కాకపోతే, నా హృదయంలో నువ్వు లేకపోతే **( యది న భవతి )** దుర్భరమైన ఆ శీతాన్ని సహించే శక్తి **( సోఢుం శక్తిః )** నీ కెక్కడిది **( క్వ )**?

ఇదీ శ్లోక భావం.

మాసం మార్గశీర్షం. హిమంతో మహి కప్పబడి ఉంది. బాహ్యంలో ప్రభూతమైన చలి. దానికి తోడు సిగపై చల్లని గంగమ్మ. మరో వైపు చలువల చంద్రుడు. ఎంత దుర్భరమైన చలి! అదలా ఉంచితే, కరచరణాలకు చుట్టుకొని ఉన్న చల్లని పాములు కాటు వేయక పోయినా, దానికి ఏ మాత్రం తీసిపోకుండా జివ్వు మనిపిస్తూ ఉన్నాయి. ఇక వామ ఎక్కడుందో చూడండి! వామ భాగంలో చేరి పోయింది. తండ్రి హిమవంతుని తడి నంతా ఒడి గట్టుకొని, కైలాసంలో కుడిపాదము ముందు పెట్టి ప్రవేశించిందే గాని, ఎడమ పార్శ్వ మంతా నేనే నని పెనిమిటిని పెనవేసుకొని అర్ధాంగి శబ్దానికి అర్థం చెప్పింది. ఈ చల్లని మహాశక్తిని ఎలా భరిస్తున్నాడో!

ఇది చాల దన్నట్లు, మధ్యే మధ్యే, పై నున్న ధారాపాత్ర నుండి అప్రయత్నంగా పైన పడుతున్న చల్లని ఉదకము. ఇక అర్చకులు ఊరకుంటారా! ఒడలంతా చందనం పట్టిస్తూ శీతలోపచారాలతో చలించి పోతుంటారు.

ఇంత చలిని ఎవరు భరిస్తారు?
ఇంత శీతాన్ని ఎలా భరిస్తారు? ఇదీ సమస్య. ఇక్కడికి శ్లోకం మూడు పాదాలు పూర్తి అయ్యాయి.

ఏం చెబుతాడు బాహ్యం నుండి చల్లని శివుడు?
లో నుండే అసలు గుట్టును మెల్లగా విప్పుతున్నాడు.

పలికేది గోపన్నే అయినా,
పలికించిన వాడు రామన్నట.
ఇక్కడా అంతే.

గుట్టపై నున్న వాడు గుండె గుహలో గుసగుస మన్నాడు.
గుట్టు వినిన వాడు గుర్తులు పట్టిస్తున్నాడు.







సర్వేశ్వరా! సర్వాత్మా!
నా హృదయం తాపాలకు నిలయము. పరితాపాలకు ఆలయము. నా గుండె అంతా గుబులే. అంతా దుఃఖాగ్నే. మోహ వ్యామోహాల శోకాగ్నే. వాటి మధ్యలో నన్ను ఉద్ధరించేందుకు చేరిపోయావా? **( ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి** - గీత; 18 వ అ - 61 వ శ్లో ). మహాదుఃఖంతో సలసల కాగుతున్న నా హృదయంలో చలి కాచుకుంటున్నావా, చల్లని తండ్రీ! కాచుకో! ఇదే నీ చలికి చక్కని పరిష్కారము. నన్ను కాచేందుకు, బ్రోచేందుకు, చల్లగా చూచేందుకు ఏకైక తరుణోపాయము.

అర్థమైందా! దుఃఖ మనే సమస్య ఎక్కడుందో, దానికి పరిష్కారమైన ముక్తేశ్వరుడు కూడా అక్కడే, మూల స్థానేశ్వరుడుగా ఒదిగి ఉన్నాడు. సమస్య ఉన్న చోటే పరిష్కార ముంది. హృదయం లోనే సమస్య. హృదయం లోనే పరిష్కారము.

## ఆత్మ - పరమాత్మ

**ఆవయో రంతరం న విద్యతే**
**త్వమే వాహం అహమేవ త్వం**

మనిద్దరికీ భేదం లేనే లేదు
నీవే నేను. నేనే నీవు.

పరమాత్మ హృదయం లోనే కాచుకొంటూ ఉన్నాడు. చలి కాచుకొంటూ ఉన్నాడు. నువ్వెక్కడున్నావు? హృదయం లోనే. పరమేశ్వరుడు ఎక్కడున్నాడు? హృదయం లోనే. ఇద్దరూ హృదయం లోనే ఎలా ఉన్నారు? ఒక్కరు గానే ఉన్నారా, లేక ఇద్దరుగా ఉన్నారా? నువ్వు పరమాత్మ కన్నా వేరుగా ఉన్నావా?

పరమాత్మ నీ కన్నా వేరని నువ్వు భావించ వచ్చు. కానీ, నువ్వు తన కన్నా వేరని పరమాత్మ అంగీకరించడు. మనిద్దరికీ **( ఆవయోః )** భేదం లేనే లేదు **( అంతరం న విద్యతే )**. నీవే నేను **( త్వమే వాహం )**. నేనే నీవు **( అహమేవ త్వం )** అని ఉపనిషద్వాణిని నీకు వినిపిస్తున్నాడు. అదే మహానారాయణోపనిషత్తు.

నారాయణుడు, నరుడు ఒక్కచోటే ఉన్నారు. కృష్ణార్జునులు ఒకే రథంలో ఉన్నారు. జీవేశ్వరు లిరువురూ శరీర మనే రథం లోనే ఉన్నారు **( శరీరం రథ మేవ** - కఠోపనిషత్తు ).

నారాయణమూర్తిని వైకుంఠానికి పరిమితం చేసి నువ్వు అవనిపై అలమటించ డానికి సిద్ధ పడవచ్చు. నారాయణమూర్తి నీకు దూరంగా ఉండ లేడు. నువ్వు వైకుంఠం పోలేవు కనుక, ఆయనే వచ్చి నీ హృదయంలో ఒదిగి పోయాడు. కాచుకుంటూ ఉండి పోయాడు. ఎక్కడ నారాయణు డుంటే అదే వైకుంఠము. నిన్ను విడిచి ఉండ లేని నారాయణుడు మనిద్దరికీ అంతరం లేదంటూ నీ ఆంతర్యం లోనే అలరారు తున్నాడు.

నారాయణుడు అనంతశయనుడు. నీ హృదయమే పాలకడలి అయింది. అనంతశక్తి స్వరూపుడు నీలో పవ్వళించి ఉన్నాడు. ఇప్పుడు చెప్పు. నువ్వు శక్తిహీనుడవా? బలహీనుడవా? నారాయణుడు నీలో ఉన్నాడు. సర్వశక్తి నీ లోనే ఉంది. అనంతమైన నీలో అనంతశక్తి ఉంది.

## అనంత చైతన్యము

నిన్ను నేను ఎత్తుకోలేను. నన్ను ఎత్తుకొని నువ్వు నడవ లేవు. కానీ, ఎంత ఎత్తైన మనిషైనా, ఎన్ని కిలోల బరువున్నా, తనను తాను తేలికగా మోసుకొని పోతూ ఉంటాడు. ఈ శక్తి ఎక్కడిది? అంత పెద్ద దేహాన్ని జీవితాంతం మోసే దెవరు? ఎంత పెద్ద దేహమైనా అనంతశక్తి ముందు ఆవగింజే.

ఈ అనంతశక్తి చైతన్యము బరువు లెత్తే ఏనుగులో ఉంది. బాధించే దోమ లోనూ ఉంది. ఈదే తిమింగలంలో ఉంది. ఎగిరే ఈగ లోనూ ఉంది. అది చాలా తేలికైంది. అందుకే ఎగర గలుగుతోంది. చాలా బరువైంది కూడా. అందుకే పర్వతంలా కదలకుండా ఉంటుంది. అణువు అదే. మహత్తూ అదే. దీని వైభవాన్నే వేదం వర్ణించింది. దీని ప్రాభవాన్నే ఋషులు కీర్తించారు.

**అణోరణీయాన్ మహతో మహీయాన్**
**ఆత్మస్య జన్తోః నిహితో గుహాయామ్ ।**

అణువు కంటే సూక్ష్మమైంది. మహత్తు కంటే మహత్తర మైంది
సమస్త ప్రాణుల హృదయాలలో అదే దాగి ఉంది.

అణువులు జడరూపాలని, దుర్భేద్యములని పూర్వం విశ్వసించే వాళ్ళం. అణువులు ఛేదింప బడతాయని మనకు ఈ రోజు తెలుసు. అంతేకాదు, జడంగా కనిపించే అణువులో అనంతశక్తి నిండి ఉందని కూడా తెలుసుకున్నాం.

అణువు లోని మాయను తొలగించి మహిమను వ్యక్తం చేశారు ఆధునిక శాస్త్రవేత్తలు. మనిషి లోని మాయను తొలగించి మహిమను దర్శింప చేశారు సనాతన మహర్షులు. ప్రతి ఒక్కరిలో అనంతశక్తి చైతన్యము ఉందని సశాస్త్రీయంగా, సహేతుకంగా ప్రబోధించారు. నీలో అది ఉండటం కాదు; నీవే అది అని తేల్చి చెప్పారు.

అనంతాలు రెండు ఉంటాయా? రెండు అనంతాలు ఉంటే, రెండూ అంతమై పోతాయి కదా! అంత మయ్యేది ఎలా అనంత మవుతుంది?

అనంతము ఏకమే గాని, రెండు కాలేదు. అది అద్వయము. అదే పరమాత్మ. మరి ప్రపంచము? ప్రపంచమే కాదు; ప్రపంచము, నువ్వు, నేను, సమస్తమూ అనంత నారాయణుడే. ఇదే శాస్త్ర తాత్పర్యము. అఖండార్థ బోధ.

**స య ఏషోఽణి మైత దాత్మ్య మిదం సర్వమ్**
**తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో ! ఇతి**

నాయనా! శ్వేతకేతూ! ఈ విధంగా ఏది చైతన్య స్వరూపమో (**ఏషః యః**), ఆ సత్య స్వరూపము (**సః**) సమస్త ప్రపంచ బీజరూపమై సూక్ష్మంగా భాసిస్తోంది (**అణిమా**).

ఈ దృశ్యమాన జగత్తంతా (**ఇదం సర్వం**) ఆత్మ స్వరూపం వల్లనే అలరారుతోంది (**ఏతదాత్మ్యం**). అదియే ఆత్మ (**సః ఆత్మా**).

ఆ పరమాత్మ స్వరూపము (**తత్**) నీవు (**త్వం**) అయి ఉన్నావు (**అసి**) అని బోధించాడు ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలక మహర్షి.

ప్రపంచ మంతా పరమాత్మ చేత పూర్ణమై ఉంది. పరమాత్మే సత్యము. ఆ సత్యమే ఆత్మ. అదే నీవు. ఇదే అఖండార్థ బోధ. అద్వైత జ్ఞానబోధ. ప్రపంచము, జీవుడు, ఈశ్వరుడు అభిన్నులే అనే అమృతబోధ.

**యత్పరం బ్రహ్మ సర్వాత్మా**
**విశ్వస్యాయతనం మహత్**

సర్వులకు ఆత్మ యైన పరమాత్మ
విశ్వానికి సర్వాధారమై ఉన్నాడు.

ఈ సత్యం మనకు తెలుసా? తెలియదు. అయితే తెలియాలి. తెలుసుకోవాలి. అదే తెలియ దగింది (**వేదితవ్యం**). దానిని తెలుసుకున్న తరువాత పొంద వలసింది మరొకటి ఉంటుందా?





మరి, అలాంటి అనంత చైతన్యాన్ని క్రొత్తగా పొందే అవకాశం ఉందా? అది క్రొత్తగా పుడుతుందా? అలా పుట్టేది అనంత మవుతుందా? అనంత మైనది ఉంటే, అది లేని కాల మంటూ ఉంటుందా? లేని ప్రదేశం ఉంటుందా? అలాంటి సద్వస్తువు సాధ్యవస్తు వెలా అవుతుంది? నిత్యవస్తువు సిద్ధవస్తువే గాని సాధ్యవస్తువు కాలేదు. నేడు లేకుండా రేపు కలిగేది సాధ్యవస్తువు. నేడు లేకుండా రేపు కలిగేది మరునాడు మళ్ళీ లేకుండా పోయేదే కదా! అలాంటిది అనంత మెలా అవుతుంది? కనుక, మోక్షము క్రొత్తగా వచ్చేది కాదు. ఉన్నదే. సిద్ధ వస్తువుగా ఉన్నదే.

అయితే, ముక్తి మన కున్నదే. మనం ముక్తుల మయ్యే ఉన్నాము. ఇది అర్థం గాక ముక్తి కొరకు యత్నిస్తున్నాము. మనం ముక్తులమే అయినప్పుడు బంధ మెలా వచ్చింది? ముక్త వస్తువుకు బంధం ఉండే అవకాశమే లేదు. బంధం లేని దానికి బంధం ఉన్నట్లు తెలుస్తూ ఉంది. అదే మన సమస్య.

నువ్వు ఉన్నావా, లేదా? ఉన్నావు. ఆత్మ ఎవరు? నువ్వే. ఇక తెలియని దేముంది? ఇక ఆత్మను పొందడ మేమిటి? ఎలా పొందుతావు? లేని దానిని పొందవచ్చు. ఉన్న దానిని పొందే దేమిటి? ఒకవేళ ఉన్నది తెలియక పోతే తెలుసుకోవాలి. ఏమని? ఆత్మను పొందేది లేదని. ఆత్మను పోగొట్టుకొన్నదీ లేదని. అది సదా ఉన్నదే నని, సిద్ధమే నని, ప్రసిద్ధమే నని. ఆత్మ ఎప్పుడూ అప్రసిద్ధం కాదు అన్నారు శ్రీశంకరులు (**న హ్యాత్మా నామ కస్యచిత్ అప్రసిద్ధః** - గీతాభాష్యము ).

## ఆత్మ విచారము

మనకు ఏం కావాలి? మోక్షము కావాలి. మోక్షము అంటే ఏమిటి? బంధము నుండి విడి పడటమే మోక్షము. బాగుంది. ఇంతకీ బంధ మెవరికి? మనకు బంధ మున్నట్లేనా? బంధము ఉంది అనుకుందాం. మరి ఆ బంధం సత్యంగా ఉన్నదా, లేకనే ఉన్నట్లున్నదా? ముందు ఈ విషయం నిర్ణయం కావాలి.

బంధము సత్యమే అయితే, సత్యము అంటేనే అన్ని కాలాలలో ఉండేది కనుక, బంధము మన కెన్నడూ దూరం కాదు. అది నిత్యబంధమై ఉంటుంది. దానిని తొలగించడం సాధ్యం కాదు. కనుక, మనం ఆశించే మోక్షం ప్రాప్తించే అవకాశమే లేదు.

ఒకవేళ బంధము అసత్యమే అయితే, అసత్యము అంటే లేనిదే కనుక, లేనిది పోనవసరం లేదు. మోక్షము ఉన్నట్లే. ఇక ప్రయత్న మెందుకు?

అలా గాక, బంధము లేనిదే అయినా, ఉన్నట్లు గోచరించే టప్పుడు (**రజ్జు సర్పవత్** - త్రాడులో పాము లాగా ), అట్టి బంధము అర్థం చేసుకో దగిందే గాని, ప్రయత్నంతో దూరం చేసుకో వలసింది కాదు. అలా అర్థం చేసుకోవడమే విచారము. ఆత్మ విషయంలో, లేదా మోక్షం విషయంలో విచారమే ప్రధాన కర్తవ్యము (**అతః విచారః కర్తవ్యః**).

**అతో విచారః కర్తవ్యో**
**జిజ్ఞాసో రాత్మ వస్తునః**

ఆత్మవిచార మొక్కటే
ముముక్షువు కర్తవ్యము.

బంధంలో ఉన్నట్లు భావించ డానికి బంధము ఉండ నవసరం లేదు. బంధ మున్నదనే భావన చాలు. ఒక విధంగా చెప్పాలంటే ఈ భావనే బంధము. భావ బంధము. అదే భవబంధము.

నేను బంధంలో ఉన్నానా?
నాకు బంధ మనేది ఉందా? - అని ప్రశ్నించుకొని విచారిస్తే, ఆత్మ వైన నీకు బంధము లేనే లేదని తెలిసి పోతుంది. బంధము భావన అయినపుడు, అట్టి బంధాన్ని నిర్మూలించే మోక్షము కూడా భావనే అవుతుంది. భావ బంధానికి భావ మోక్షమే పరిష్కార మవుతుంది.

**బంధ మోక్ష విహీనోస్మి**
**శుద్ధం బ్రహ్మాస్మి సోస్మ్యహం!**

బంధమోక్షాలు లేని వాణ్ణి
శుద్ధ బ్రహ్మ స్వరూపుణ్ణి అన్నది ఉపనిషత్తు.

అర్థమైందా? బంధము కల్పించు కున్నదే. కరిపించు కున్నదే. తగిలించు కున్నదే. తొలగించుకుంటే పోతుంది.

అజ్ఞానమే బంధము కనుక, జ్ఞానమే మోక్షము. తానేమిటో, తన స్వరూప మేమిటో తెలియక పోవడము అజ్ఞాన మైతే, తానేమిటో, తన స్వరూప మేమిటో తెలియడమే జ్ఞానము. ఆత్మజ్ఞానము. విచారము ద్వారా లభ్యమయ్యే స్వరూప జ్ఞానము.

**మోక్షం జ్ఞానరూపంలో ఉంది**
**జ్ఞానం కలిగితే మోక్షం సిద్ధిస్తుంది.**

### ఆత్మజ్ఞానము

**జ్ఞానా దేవ తు కైవల్యమ్**

జ్ఞానము ద్వారానే మోక్షము సిద్ధిస్తుంది. మోక్షము అనేది ఉన్నదే గాని లేనిది కాదు. ఏదైనా ఒకటి ఉంది అంటే, దానికి సంబంధించిన జ్ఞానము కూడా ఉంటుంది. అదే ఇక్కడ జ్ఞానము అనబడుతూ ఉంది. ఆ జ్ఞానమే ఆత్మజ్ఞానము.

జ్ఞానం ఎలా కలుగుతుంది? ప్రమాణం ద్వారానే కలుగుతుంది. 'ప్రమ' అంటే జ్ఞానము. జ్ఞానమును కలిగించేది ప్రమాణం **(ప్రమాకరణం ప్రమాణం).** ప్రమాణం ఉంటేనే జ్ఞానం కలుగుతుంది. ఆత్మజ్ఞానము విషయంలో శాస్త్రము ప్రమాణము. శాస్త్రము అంటే వేదము.

ఆత్మ ఏదో కాదు; మన స్వరూపమే. కనుక ఆత్మను పొందడ మనేది లేదు. ఆత్మ ఉన్నదే. కానీ, ఉన్నట్లు తెలియనిది. చీకట్లో ఉన్న వస్తువు లేనిది కాదు. ఉన్నట్లు తెలియనిది. వెలుగు రాగానే ఉన్నట్లు తెలుస్తుంది. అలాగే జ్ఞానం కలిగితే ఆత్మ ఉన్నట్లు తెలుస్తుంది.

మరి, ఆత్మను తెలుసుకొనే వాడెవరు? తెలియని వాడే కదూ? తాను ఆత్మ అని తెలియని వాడే. మరి తాను ఆత్మ కాదని నిర్ణయించుకున్న వాడు తనకు తానుగా తానే ఆత్మ అని ఎలా తెలుసుకుంటాడు? తనకు తానుగా తెలుసు కోలేని దానిని శాస్త్రం ద్వారానే గ్రహించాలి. ఇక్కడే శాస్త్రం ప్రమాణ మైంది.

**యత్తు స్వతః అప్రాప్తం**
**తత్ శాస్త్రేణ బోధితవ్యం.**

తనకు తానుగా పొందలేని జ్ఞానమును
శాస్త్ర ప్రమాణం ద్వారానే పొందాలి.



మనము అన్వేషించే సదాత్మ మనమే అయి నందున, అది ఇంద్రియ మనోబుద్ధులకు గాని, ప్రత్యక్ష అనుమానాది ప్రమాణాలకు గాని అందదు. అట్టి దానిని శబ్ద ప్రమాణము ద్వారానే గ్రహించాలి. ఇక్కడే వేదశాస్త్రము ప్రమాణ మైంది.

**శ్రుతి శ్చ నః ప్రమాణం అతీంద్రియ విషయ విజ్ఞానోత్పత్తౌ**

మన ఇంద్రియ మనోబుద్ధులకు అందని సత్య విషయాన్ని గ్రహించడానికి వేదాలే ప్రమాణము అన్నారు బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి.

ఆత్మ ఉంది. కాని, తెలియకుండా ఉంది. ఇదియే ఆత్మ అజ్ఞానము. ఆత్మజ్ఞానము కలిగితే ఆత్మ అజ్ఞానము నశిస్తుంది **( ఆత్మజ్ఞానేన ఆత్మ అజ్ఞానం నశ్యతి ).** ఆత్మజ్ఞానమును పొందిన వాడు తానే ఆత్మ అని తెలుసుకుంటాడు **( ఆత్మవిత్ పరం ఆప్నోతి ).** ఈ విధంగా ప్రమాణం జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది.

### ఆచార్యవాన్ పురుషో వేద

శాస్త్రము ఎప్పుడైతే ప్రమాణ మైందో, అధ్యయనం తక్షణ కర్తవ్య మైంది. మరి శాస్త్రాన్ని మనమే అధ్యయనం చేస్తే సరిపోతుందా? సరిపోదు.

జ్ఞానము ఏదైనా, దానిని పొందే పద్ధతి ఒకటి ఉంటుంది. అలా పొంది నపుడే జ్ఞానం ప్రాప్తిస్తుంది. దీనినే శాస్త్ర పరిభాషలో 'బోధనా విధి' అంటారు.

మనకు మనంగా కారు నడపడం నేర్చుకో లేము. మనకు మనంగా కంప్యూటర్‌ను తెలుసుకో లేము. మరొకరి సహాయం లేకుండా సైకిల్ కూడా త్రొక్క లేము. ఈత కొట్టడం అభ్యసించ లేము. సామాన్య విషయాలే ఇలా ఉన్నాయి. ఇక ఆత్మజ్ఞానం ఎవరి సహాయం లేకుండా సిద్ధిస్తుందా?

అయితే, ఇక్కడ మనకు సహకరించే వ్యక్తి మన లాంటి వాడే అయితే ఉపయోగం లేదు. జ్ఞానం కలిగిన వాడై ఉండాలి. కేవలం జ్ఞానం ఉంటే చాలదు. తన కున్న జ్ఞానాన్ని ఇతరులకు అందించ గలిగే విధానం కూడా తెలిసిన వాడై ఉండాలి. తెలిసి బోధించి నపుడే వినే వాడి బుద్ధి నిండుతుంది. తెలిసే లాగా బోధిస్తేనే వినే వాడి బుద్ధి పండుతుంది. అలా బోధించడమే సంప్రదాయము. సాంప్రదాయక బోధ అంది నపుడే జ్ఞానం ప్రాప్తిస్తుంది.
సంప్రదాయం తెలిసి బోధించే వ్యక్తిని గురువు అంటారు.

మనది వేద సంస్కృతి. మనది వేద సంప్రదాయం. ఈ సంప్రదాయాన్ని ఋషులు, గురువులు కాపాడుకుంటూ వచ్చారు.

వేదాన్ని ఋషులు సృష్టించ లేదు.
వేదాన్ని బోధించే సంప్రదాయాన్ని సృష్టించారు.

**ఋషిభిః న ప్రమాణ కర్తారః**
**ఋషిభిః సంప్రదాయ కర్తారః**

ఋషులు ప్రమాణకర్తలు కారు
ఋషులు సంప్రదాయ కర్తలు.

జ్ఞానం సృష్టింప బడేది కాదు. అందించ బడేది. వెలిగే దీపము మరొక దీపాన్ని వెలిగించినట్లు, జ్ఞానం కలిగిన గురువు మరొకరికి జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. గురువు లభించిన వారికే జ్ఞానము ప్రాప్తిస్తుంది.

**ఆచార్యవాన్ పురుషో వేద**

ఆచార్యుడు ఎవరికి లభిస్తాడో
వారికే జ్ఞానం కలుగుతుంది.

## ప్రమాణ ప్రమేయ సంబంధము

మనకు మోక్షం కావాలి. మోక్షం జ్ఞానరూపంలో ఉంది అని గ్రహించాము. జ్ఞానము కలిగితే మోక్షం ప్రాప్తిస్తుంది. జ్ఞానమును శాస్త్రం అందిస్తుంది. ఇదే ప్రమాణ ప్రమేయ సంబంధము. ఆత్మ ప్రమేయము; శాస్త్రము ప్రమాణము. ప్రమాణమైన శాస్త్రం ద్వారా ప్రమేయమైన ఆత్మకు సంబంధించిన జ్ఞానం కలుగుతుంది.

దీనినే ప్రతిపాదక ప్రతిపాద్య సంబంధం అని కూడా అంటారు. ఆత్మ ప్రతిపాదింప బడుతోంది కనుక ఆత్మ ప్రతిపాద్యము. శాస్త్రం ప్రతిపాదించి తెలియ చేస్తోంది కనుక శాస్త్రం ప్రతిపాదకం. నీవే ఆత్మవు. నీవు ఆత్మవని నీకు అర్థమయ్యేలా చేస్తుంది శాస్త్రము. ఇదే ప్రమాణ వైభవము.

రజ్జు జ్ఞానము కలిగిన తరువాత సర్పభ్రాంతి ఎలా లేదో, అలాగే ఆత్మజ్ఞానము కలిగిన తరువాత, అజ్ఞానము, అజ్ఞాన జనిత సంసారము అదృశ్య మవుతున్నాయి. అవిద్యా నివృత్తియే విద్య యొక్క ప్రయోజనం. అజ్ఞాన నివృత్తియే జ్ఞానం యొక్క ఫలం.

**బ్రహ్మ విద్యాయాః అవిద్యా నివృత్తిః**
**తతశ్చ ఆత్యంతిక సంసార అభావః**

ఆత్మజ్ఞానము, లేదా బ్రహ్మజ్ఞానము
అవిద్యను అంతం చేస్తుంది.
సమూలంగా సంసారాన్ని నశింప చేస్తుంది.

జ్ఞాన మనేది బుద్ధి నుండి బుద్ధికి అందుతుంది. కనుక శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన గురువు జ్ఞానజ్యోతియై మన హృదయంలో జ్ఞానదీపాన్ని వెలిగిస్తాడు. అదియే ఆత్మజ్ఞాన జ్యోతి. అజ్ఞాన అంధకారాన్ని అదృశ్యం చేసే అఖండాత్మ జ్యోతి. గు అంటే చీకటి. రు అంటే దానిని పోగొట్టే వెలుగు. అదే గురువు శబ్దార్థము. బంధము, మోక్షము, జ్ఞానము, శాస్త్రము, ఆచార్యుడు - అన్నీ సమగ్రంగా విశ్లేషించుకొని చెప్పుకున్నాం. ఈ దశలో అవగాహన క్రమబద్ధంగా ఉండేలా చూసుకోవాలి. ఇది చాలా ప్రధానమైన విషయం.

**మోక్షాయ జ్ఞాన ప్రవృత్తిః**
**జ్ఞానాయ శాస్త్ర పఠనం**
**గురూప సదనం శాస్త్ర పఠనం !**

మనకు మోక్షం కావాలి. మోక్ష మనేది వస్తువు కాదు; సన్నివేశం కాదు; దేశంలో ఉండదు; కాలంలో తెలియదు. మోక్షం జ్ఞానరూపంలో ఉంది.

జ్ఞానం స్వప్రయత్నంతో సిద్ధించదు. అది ప్రమాణ విషయం. ప్రమాతే ప్రమేయం అనే సత్యం ప్రమాణం లోనే దర్శనీయ మవుతుంది. అదే శాస్త్ర ప్రమాణం. అద్దంలో ముఖదర్శన మైనట్లు శాస్త్రంలో ఆత్మదర్శన మవుతుంది **(ముకురే ముఖ దర్శనవత్ శాస్త్రే ఆత్మదర్శనం).** అద్దానికి అభిముఖంగా వెళ్ళడం అద్దాన్ని దర్శించడానికి కాదు. మన ముఖాన్ని దర్శించడానికి. శాస్త్ర దర్పణాన్ని దర్శించడం కూడా కేవలం శాస్త్ర పఠనానికే కాదు, స్వాత్మ దర్శనానికి.





సంప్రదాయ విదుడైన ఆచార్యుని సన్నిధిలో శ్రవణం చేసి నపుడే ప్రమాణం ఫలిస్తుంది. కనుక, ఆత్మజ్ఞాన ప్రాప్తి కొరకు ఆచార్యుని తప్పక ఆశ్రయించాలి.

ఇదీ క్రమము.
బంధము తొలగాలంటే, మోక్షమును పొందాలి. మోక్షం రావాలంటే జ్ఞానం కలగాలి. జ్ఞానం కలగాలంటే శాస్త్రమును ప్రమాణంగా గ్రహించాలి. శాస్త్రాధ్యయనం గురుసన్నిధి లోనే జరగాలి. ఇదీ సారభూతమైన విషయము.

## వేద ప్రమాణము

వేదములు ప్రామాణికాలైన ప్రాచీన జ్ఞాన భాండాగారము. **విద జానే**- దీని చేత తెలుసుకుంటారు కనుక ఇది వేదము **( వేదః ).**

వేదాలను శ్రుతులు అని కూడా అంటారు. శ్రుతులు అంటే వినిపించేవి. **శ్రూయతే అనేన ఇతి శ్రుతిః**- దేని చేత జ్ఞానము వినపడు తుందో అది శ్రుతి.

శ్రుతులైన వేదాలను ఆమ్నాయాలు అని కూడా అంటారు. **ఆమ్నాయతే పారంపర్యేణ ఇతి ఆమ్నాయః** - పారంపర్యంగా అభ్యసింప బడేది కనుక వేదము ఆమ్నాయము **( మ్నా అభ్యాసే ).**

వేదాలు అపౌరుషేయాలు. పురుషుల చేత రచింప బడేవి పౌరుషేయాలు. అలా కాకుండా స్వతస్సిద్ధ మైనవి, భగవత్స్వరూపంగా విరాజిల్లేవి అపౌరుషేయాలు.

వేదాలన్నీ ప్రాచీన సంస్కృత భాషలో ఉన్నాయి. అందుచేత, ఆధునిక సంస్కృతాధ్యాపకులు, భాషావేత్తలు వేదార్థాన్ని గ్రహించడానికి వేదన చెందుతూ ఉంటారు.

వేద వాఙ్మయాన్ని యథావత్ అర్థం చేసుకోవడానికి అనుకూలంగా యాస్కాచార్యుల వారు **'నిరుక్తము'** అనే సంస్కృత నిఘంటువును రచించారు. నిరుక్తము వేదాంగాలైన ఆరింటిలో ఒకటి. వర్ణాగమ విపర్యయాదుల్ని నిశ్చయించి చెబుతుంది కనుక అది నిరుక్తము **( నిశ్చయేన ఉక్తం నిరుక్తమ్ ).**

నిరుక్తమును ఆధారం చేసుకొనే భాష్యకారులు వేదాలను వ్యాఖ్యానించారు. వేదాలను వ్యాఖ్యానించిన వారు స్వల్ప సంఖ్యలో ఉన్నారు. వారిలో కూడా పాక్షికంగా వ్యాఖ్యానించిన వారే గాని పూర్ణంగా విశదీకరించిన వారు అరుదు. వేదాన్ని వ్యాఖ్యానించిన సంప్రదాయ విదులలో మాధవాచార్యులు, సాయనాచార్యులు ముఖ్యులు. మాధవాచార్యులే సన్యాసాశ్రమాన్ని స్వీకరించిన తరువాత విద్యారణ్యస్వామిగా వాసి కెక్కారు. **'వేదాంత పంచదశి'** లాంటి ప్రముఖమైన అద్వైత గ్రంథాలను రచించారు.

ఏ తల్లి కన్నదో - అని తరచుగా మహాత్ములను జనులు శ్లాఘిస్తూ ఉండటం మనం వింటూ ఉంటాము. వేదానికి భాష్యాన్ని అందించిన మాధవ సాయనులు ఒక్క తల్లి బిడ్డలు కావడం, ఇద్దరు సోదరులు అనితర సాధ్యమైన వేదభాష్యాన్ని అందించడం గొప్ప విశేషము. ఆ బిడ్డలను కన్న మహాతల్లి ఎవరో, ఆమె జన్మ ధన్యమైంది. మాధవ సాయనులే కాకుండా ఉద్భటాచార్యులు కూడా రచించారని చెబుతారు. మాధవ సాయనుల భాష్యం లాగా వారిది అంత ప్రాచుర్యాన్ని పొందలేక పోయింది.

మ్యాక్స్‌ముల్లర్ అనే పాశ్చాత్యుడు కూడా సంస్కృత భాషను అభ్యసించి, వేదానికి, ముఖ్యంగా ఋగ్వేదానికి భాష్యాన్ని అందించాడు. ఆయన సంప్రదాయ గాడిలో పడని పాశ్చాత్యుడు. కనుక ఆయన భాష్యం కూడా అలాగే ఉంటుంది. కాకపోతే, ఒక పాశ్చాత్యుడు సంస్కృత భాషను అభ్యసించి, సంప్రదాయవిదుల భాష్యం లాగే,

జ్ఞానాసక్తితో వేదాన్ని పఠించడమే కాకుండా, దానిని వ్యాఖ్యానించడం అనేది అద్భుతమైన విషయము; ప్రశంసనీయము.

**ప్రమాణ వైభవము**

ప్రపంచము దృశ్యము. కార్యరూపము. ప్రత్యక్ష అనుమానాది ప్రమాణాల చేత అనుభవానికి అందుతుంది. ఈ కార్యరూప ప్రపంచానికి కారణమైన పరమాత్మ ప్రత్యక్షాది ప్రమాణాలకు అందే వాడు కాడు.

కనుక, పరమాత్మ జ్ఞానప్రాప్తికి మరొక ప్రమాణము అవసరమై ఉంది. అదే శబ్ద ప్రమాణం. వేద ప్రమాణం. **ప్రమాకరణం ప్రమాణం -** ప్రమ అంటే జ్ఞానము. ప్రమను కలిగించేది కనుక వేదము ప్రమాణము.

**వస్తు ప్రతిపాదనం తత్పరత్వం**
**సిద్ధం శాస్త్రాణామ్ !**

సత్య వస్తువును ప్రతిపాదించడమే గాక, ఆ సత్యవస్తు స్వరూపాన్నే పరమ గమ్యముగా వేదాలు కలిగి ఉన్నాయి అన్నది బృహదారణ్యకోపనిషత్తు *(1 - 3 -1)*. అందుచేతనే వేదం ప్రమాణ వైభవంతో ప్రకాశిస్తూ ఉంది. ప్రమాణ విషయాన్ని సులభంగా తీసుకోవడానికి అవకాశము లేదు. ప్రమాణ విషయము బుద్ధికి చిక్కని దైనపుడు, జ్ఞానం ప్రాప్తించడము దుస్సాధ్య మవుతుంది.

ప్రపంచం లోని శబ్దాది విషయ జ్ఞానాన్ని శ్రోత్రాది ఇంద్రియాల ద్వారా మనం తెలుసుకుంటున్నాం. చెవులు శబ్దాలను వింటాయి; రూపాలను చూడలేవు. కళ్ళు రూపాలను చూస్తాయి; శబ్దాలను వినలేవు. ముక్కు వాసన చూస్తుంది, రూపాన్ని చూడలేదు. ఇంద్రియాలు తమ తమ విషయాలను గ్రహించడములో శక్తివంతంగా ఉండటమే గాక, అలా గ్రహించ డానికి మరొక దానిని ఆశ్రయించ కుండా స్వశక్తి మీదనే ఆధారపడి ఉన్నాయి. ప్రమాణం అనే విషయాన్ని కూడా ఇలాగే అర్థం చేసుకోవాలి.

**స్వ విషయ శూరాణాం హి**
**ప్రమాణాని శ్రోత్రాదివత్**

శబ్దాలను ఆలకించడంలో చెవులు ఎలా శక్తివంత మైన ప్రమాణమై ఉన్నవో, అలాగే ఏ ప్రమాణ మైనా తత్సంబంధ విషయము నందు శక్తివంతమైన జ్ఞానసాధన గానే ఉంటుంది అన్నది ఉపనిషత్తు.

శబ్దం విషయంలో చెవి, రూపం విషయంలో కన్ను, రుచి విషయంలో నాలుక ఎలా స్వతః ప్రమాణాలై ఉన్నవో (వాటి వెనుక మనస్సు ఉంది కనుక), అలాగే జ్ఞానం విషయంలో, పరమాత్మజ్ఞానం విషయంలో, ముందు వెనుక, కుడి ఎడమ, పైన క్రింద, లోపల బయట, ఎవరి అవసరం లేకుండా, దేని అవసరము రాకుండా, వేదము స్వప్రమాణమై శోభిస్తోంది.

**వేదస్య హి నిరపేక్షం**
**స్వార్థే ప్రామాణ్యం**
**రవేరివ రూప విషయే**

రూపాలను ప్రకాశింప చేయడానికి సూర్యునికి మరొకరి సహాయము అవసరమా? స్వయంగా తన ప్రకాశము తోనే ప్రపంచాన్ని సూర్యుడు ప్రకాశింప చేయ గలడు. రూపాలను సూర్యుడు ప్రకాశింప చేసి వాటి విషయంలో ప్రమాణ మైనట్లు, పరమాత్మకు సంబంధించిన జ్ఞానం విషయంలో వేదాలు మరో సహాయం వైపు చూడకుండా స్వప్రమాణమై శోభిస్తున్నాయి అన్నారు బ్రహ్మసూత్ర భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి *( 2 - 1 - 1 )*.





వేదాలు ఇలా ప్రమాణమై శోభిస్తున్నాయి కనుకనే వాటిని పరమాత్మ శ్వాసలని అభివర్ణించింది శాస్త్రం **( అస్య మహతో భూతస్య నిశ్శ్వసిత మేతత్ ).** అంతే కాదు. ప్రమాణమై శోభిస్తున్న వేదాన్ని నిరసించిన వారిని, నిరాకరించిన వారిని, వారు ఎంతటి వారైనా నాస్తికులే నని తెగేసి మరీ చెప్పింది **( నాస్తికో వేద నిందకః ).**

**ఆశ్రయ స్థానము**

భారతీయ తాత్త్విక దర్శనా లన్నిటికీ వేదాలే మూలం అని చెప్పవచ్చు. న్యాయ, వైశేషిక, సాంఖ్య, యోగ, మీమాంసాది షడ్దర్శనా లన్నిటికీ వేదాలే ఆధారము. తత్త్వమును బోధించే వాటిని దర్శనాలు అంటారు **( దృశ్యతే అనేన ఇతి దర్శనమ్ - దర్శ్యతే తత్త్వ మనేన ఇతి దర్శనమ్ ).** దేని వలన చూడ బడుతుందో అది దర్శనము.

ఇంతకీ చూడ బడేది ఏదై ఉండాలి? ఏది దర్శనీయమై ఉండాలి?

నే నెవరు? నా స్వరూప మేమిటి?
నేను క్షేత్రమా? క్షేత్రజ్ఞ స్వరూపమా?
ఈ జగత్తేమిటి? దీనికి కారణ ముందా?
ఇది సృష్టి యేనా? సృష్టికర్త ఎక్కడున్నాడు?
సృష్టికి సృష్టికర్తకు ఉన్న సంబంధ మేమిటి?

ఈ విధమైన ప్రశ్న లన్నిటికీ సూటిగా, సుస్పష్టంగా సమాధానం చెప్పగలిగే దేదో అది దర్శనము. ఇక్కడే కొన్ని దర్శనాలు, అవి ఎంత గొప్పవి అయినా, వాటి కర్తలు మహాత్ములే అయినా, వారి వాక్యాలు జ్ఞానపూరితాలు గానే కనిపించినా, అవి ప్రమాణం కాలేక పోయాయి.

వేదము ఇక్కడే ప్రమాణ శోభతో కనిపిస్తుంది. ఏ వాక్యాన్నైనా ప్రమాణంగా గ్రహించాలి అంటే, అది పూర్ణమైన, ఫలప్రదమైన జ్ఞానరూపమై ఉండాలి. ఇదే ప్రమాణ విషయంలో ఉపనిషత్తుల ఏకవాక్యత **( నిశ్చిత ఫలవత్ విజ్ఞానో త్పాదకమ్ వాక్యం ప్రమాణమ్ -** బృహదారణ్యక భాష్యం ; *1 - 4 - 7* ).

చతుర్విధ పురుషార్థములలో ప్రశస్త మైనది, పరమ పురుషార్థ మని చెప్పబడింది మోక్షమే అని ముందు గానే మనం చెప్పుకున్నాం. మోక్షమే పరమ పురుషార్థ మని దర్శనాచార్యు లందరూ అంగీకరిస్తారు **( దర్శనాంత రేషు మోక్ష స్వరూపమ్ ).** కాకపోతే ఏది మోక్షము? మోక్ష మంటే ఏమిటి? అనే విషయం లోనే వైరుధ్యాలు గోచరిస్తాయి.

పరమ పురుషార్థ మైన మోక్షం విషయాన్ని నిర్ణయించడంలో వేదాంతర్గత మైన ఉపనిషత్తులు వస్తు నిర్ధారణ చేసి, ప్రమాణమై శోభిస్తున్నాయి. అంతేకాదు. ధర్మార్థ కామ పురుషార్థాలనే త్రివర్గములను సాధించుకొనే ఉపాయాలను తెలియ చేయడంలో కూడా వేదాలు ప్రమాణాలై శోభిస్తున్నాయి.

**పురుషా ర్థోపదేశత్వాత్ శ్రుతీనామ్ !**

సమస్త పురుషార్థాలను సాధించుకొనే విషయంలో శ్రుతులు ప్రామాణికంగా మార్గాలను తెలియ చేస్తున్నాయి అన్నారు తైత్తిరీ యోపనిష ద్భాష్యంలో శ్రీ శంకరాచార్యస్వామి. సాధ్యరూప మోక్షమే గాక, సాధన రూప విషయాలను కూడా వేదము ప్రామాణికంగా అందించింది. కర్మోపాసనలను వివరించింది. **'ఓం నమశ్శివాయ'** అనే పంచాక్షరీ మహామంత్రము, **'ఓం నమో నారాయణాయ'** అనే అష్టాక్షరీ మహామంత్రం కూడా వేదంలో ప్రమాణ రూపంలో భాసిస్తున్నాయి.

కనుక ప్రమను, అనగా జ్ఞానమును పొందుటకు వేదమే ప్రమాణము అనేది అర్థ మైందని భావిస్తాను. మరి, వేదము ప్రమాణ మైనపుడు వేదాన్నే కదా ఆశ్రయించాలి? భగవద్గీత ఎందుకు? భగవద్గీత ప్రమాణమా? అప్రమాణమా?

## గీతా శాస్త్రము - సర్వశాస్త్ర సారము

సర్వధర్మ స్వరూపమై, పంచమ వేదమని ప్రస్తుతింప బడిన మహాభారత మనే విశాలమైన ఆకాశంలో, దివ్యంగా విలసిల్లుతూ, అద్వైత పీయూషాన్ని అవిరళంగా వర్షించిన అమృత మేఘమాలిక శ్రీమద్భగవద్గీత.

'గీత' అంటే గానం చేయబడేది లేదా పాడ బడేది అని అర్థము ( గీయత ఇతి గీతమ్. 'గై శబ్దే' ). ఇక్కడ బోధింప బడింది; ఉపదేశింప బడింది అని భావించాలి. 'భగవద్గీత' అంటే భగవంతుని చేత ఉపదేశింప బడిన గీత, లేదా జ్ఞానము.

జ్ఞానము అంటే ఆత్మజ్ఞానము, లేదా బ్రహ్మజ్ఞానము అని అర్థము. ఉపనిషత్తు అంటే కూడా జ్ఞాన మనే అర్థం. ఉపనిషత్తు అనేది గ్రంథ నామము కాదు, గ్రంథ విషయము. ఉపనిషత్తు అంటే బ్రహ్మవిద్య అని అర్థము (ఉపనిష ద్విషయం ఉపనిష దేవ ).

గీతకు ఉపనిషత్తు అనే పేరు కూడా ఉంది. అలా చూచి నపుడు 'గీత' అంటే భగవంతుని చేత చెప్పబడిన ఉపనిషత్తు అని భావించ వచ్చు. కనుక, గీత అంటే ఉపనిషత్తు అనే పేరు కలిగిన బ్రహ్మవిద్య ( గీతోపనిష న్నామ్నీం బ్రహ్మవిద్యాం ) అని అర్థము.

గీత, ఉపనిషత్తులు రెండూ ఏకవాక్యతను ప్రసాదిస్తున్నాయి. అంటే, ఒకే అర్థాన్ని అందిస్తూ పరమార్థాన్ని ముందుంచు తున్నాయి.

జ్ఞానాత్ మోక్ష ఇతి ఏషోఽర్థః
నిశ్చితో గీతాసు సర్వోపనిషత్సు చ ।

జ్ఞానము వల్లనే మోక్షము ప్రాప్తిస్తుంది
ఇదే గీత, ఉపనిషత్తుల తుది నిర్ణయము
అని శ్రీ శంకరుల గీతాభాష్యము.



యత్ర స్థితం బ్రహ్మజ్ఞానే
వేదశాస్త్ర సునిశ్చితమ్ ।

వేదము నిశ్చయించిన బ్రహ్మజ్ఞానము
గీత యందు సుప్రతిష్ఠము
అని స్కాందపురాణము.

గీత, ఉపనిషత్తులు ఒకే విషయాన్ని ప్రతిపాదిస్తూ ఉన్నందున గీత ఏదో కాదు; ఉపనిషత్తే. గీతలో చెప్పబడిన జ్ఞాన మంతా ఉపనిషత్ జ్ఞానమే. ప్రతి అధ్యాయాన్ని ఒక ఉపనిషత్తు అని చెప్పుకోవచ్చు. ప్రతి శ్లోకము ఒక ఉపనిషత్తే. ఉపనిష న్మంత్రాలు కొన్ని గీతలో యథాతథంగా కూడా ఉన్నాయి. అందుకే నేమో, గీత లోని ప్రతి అధ్యాయం చివర ఉన్న సంకల్ప వాక్యంలో, శ్రీమద్భగవద్గీతాసు ఉపనిషత్సు అని బహువచనాన్ని ప్రయోగించడం జరిగింది. గీతను గీతలు అని, ఉపనిషత్తును ఉపనిషత్తులు అని బహువచన ప్రయోగంతో పలకడం చేత, గీతా శ్లోకాలన్నీ ఉపనిష ద్రూపాలే; ఉపనిషత్సారాలే అని అర్థమవుతూ ఉంది.

అలా కాకుండా, 'ఉపనిషత్సు' అనే పదాన్ని 'ఉపనిషత్తులలో' అని అర్థం చెప్పుకున్నా, గీత ఉపనిషత్తుల లోని జ్ఞానాన్నే ప్రసాదిస్తూ ఉంది అని భావించ వచ్చు. ఉపనిషత్తు, గీత అనే రెండు పదాలు స్త్రీ లింగ పదాలే అనేది కూడా గమనార్హం. ఇంకా చెప్పాలి అంటే, గీత సర్వశాస్త్ర స్వరూపిణి ( సర్వ శాస్త్ర మయీ గీతా ).





## గీత వేద స్వరూపము

వేదము అంటే జ్ఞానము అని తెలుసుకున్నాము. ఏ జ్ఞానము? అనే ప్రశ్నకు ఈశ్వర జ్ఞానము అనేది సమాధానము. ఈశ్వరుడు, ఈశ్వర జ్ఞానము రెండు కావు. ఒక్కటే. వేదము, వేదనారాయణుడు వేరు కాదు. ఒక్కటే. వేదమే తన స్వరూపంగా కల వాడు వేదనారాయణుడు ( వేదరూపత్వాత్ వేదః ). వేదరూపంలో ఉన్నాడు కనుక ఆయనే వేదము.

వేదము తెలిస్తే, వేద్యుడైన నారాయణమూర్తి కూడా తెలిసినట్లే. వేదనారాయణుని తెలుసుకోవడానికి వేదము తప్ప మరొక మార్గం లేదు.

విష్ణుసహస్రనామం నారాయణమూర్తిని వేదాంగః ( వి.స.నా - 130 వ నామం ) అని కీర్తించింది. వేదములు అంగాలుగా కలిగిన వాడు కనుక వేదనారాయణుడు వేదాంగు డయ్యాడు ( వేదా అంగ భూతాః యస్య సః వేదాంగః ).

వేదములు అంగాలు అయితే భగవంతుడు అంగి అవుతాడు. అంగిని ఎలా తెలుసుకుంటాము? అంగాల ద్వారానే తెలుసుకుంటాము. కనుక, వేదము తెలిస్తే వేద నారాయణుడు తెలిసినట్లే. భగవంతుని విషయంలో వేదము అలా ప్రమాణమై శోభిస్తోంది.

భగవంతుని విషయంలో వేదము ఎలా ప్రమాణ మైందో, వేదసారమైన భగవద్గీత కూడా అలాగే ప్రమాణమైంది.

వేదాలలో ప్రథమ వేదమైన ఋగ్వేదము లోని మంత్రాలను ఋక్కులు అంటారు. ఋగ్వేదము పవిత్రమైన అగ్నిదేవుని స్తుతితో ప్రారంభ మవుతుంది.

అగ్ని మీళే పురోహితం ।
యజ్ఞస్య దేవ మృతిజమ్
హోతారం రత్నధావతమ్ ।

ఇది ప్రథమ వేదమైన ఋగ్వేదంలో ప్రథమ ఋక్కు కావడం చేత బహుశ సృష్టి లోని స్తోత్రా లన్నిటిలో ఇదే ప్రథమం కావచ్చు. ప్రథమ స్తుతి అక్షరాలలో ప్రథమాక్షర మైన 'అ' కారంతో ప్రారంభం కావడం గమనార్హం.

అక్షరాణాం అకారోఽస్మి - అక్షరాలలో నేను అకారాన్ని అన్నాడు భగవానుడు గీతలో ( 10 వ అ - 33 వ శ్లో ). వేదానికి ఆది అక్షరమైన ఆదినారాయణుడు గీతాచార్యుడే. కనుక, గీత వేదస్వరూపమే. వేదసారమే.

ఇక రెండవది వేదాలలో ఉన్నత మైనది అని భావించే స్వర ప్రధానమైన సామవేదం. సామగాన లోలుడైన శ్రీకృష్ణ పరమాత్మ వేదానాం సామవేదోఽస్మి - వేదాలలో నేను సామవేదాన్ని అంటూ సామవేదాన్ని తన విభూతిగా అభివర్ణించాడు ( గీత ; 10 వ అ - 22 వ శ్లో ).

త్రయీ వేద్యం - మూడు వేదాలు తానే అనే అద్భుత సత్యాన్ని ఆవిష్కరిస్తూ, ఋక్సామ యజురేవ చ (గీత ; 9 వ అ - 17 వ శ్లో ) ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అన్నీ తానే నంటూ తన వేద స్వరూపాన్ని భగవంతుడు గీతలో దర్శింప చేశాడు. ఏ దివ్యాత్మని జ్ఞానము అపౌరుషేయ మైన శ్రుతులలో ప్రకాశిస్తూ ఉందో, ఆ ఉత్కృష్ట మైన జ్ఞానమే 'భగవద్గీత' అనే స్మృతి రూపంలో శోభిస్తూ ఉంది. గీతా వైభవాన్ని స్తుతిస్తూ భగవానుడైన శ్రీకృష్ణుడు అర్జునునికి ఏమి బోధించాడో వైష్ణవీయ తంత్రసారము నుండి విందాం.



గీతా మే హృదయం పార్థ
గీతా మే సార ముత్తమమ్
గీతా మే జ్ఞాన మత్యుగ్రం
గీతా మే జ్ఞాన మవ్యయమ్ !

అర్జునా! గీతే నా హృదయము
గీతే నా మహోన్నత స్వరూపము
గీతా జ్ఞానమే నా తేజము
అదే నా అక్షయ వైభవము.

## గీతా సరోజము

జన్మజన్మలుగా మనిషి పేర్చుకుంటూ వస్తున్న నొసటి రాతలను తుడిపేందుకు భారతీయ తత్త్వ సాహిత్యంలో అనేక గీతలు ఆవిర్భవించాయి. వాటి వాటి ప్రత్యేకతలను అవి ప్రదర్శించుకుంటూ జ్ఞానాన్ని వితరణ చేశాయి.

గణేశగీత, గురుగీత, హంసగీత
అవధూతగీత, శివగీత, వసిష్ఠగీత
దేవీగీత, ఋభుగీత, అష్టావక్రగీత
బ్రహ్మగీత, భిక్షుగీత, హనుమద్గీత
పరాశరగీత, రామగీత, జీవన్ముక్తగీత

ఓహ్! ఎన్నని? ఇలా చెప్పుకుంటూ పోతే శతాధికం గానే ఉంటాయి. గతంలో రామగీత, అవధూత గీత, జీవన్ముక్త గీత, గురుగీతలకు నేను రచించిన వ్యాఖ్యానాలను ఆశ్రమం విడుదల చేసింది. గీతలను పరిచయం చేస్తూ, ప్రాచుర్యం కల్పించాలని సుమారు పద్దెనిమిది గీతలను ఎన్నుకొని, వాటిలో ముఖ్య శ్లోకాలను ఎంపిక చేసి, వాటిపై సంక్షేపంగా వ్యాఖ్యానించి, **'సర్వగీతార్థ చంద్రిక'** అనే ఒక చిన్ని పుస్తకాన్ని పాతికేళ్ళ క్రితం మేమే విడుదల చేశాము. దానిని పునః ముద్రించ లేదు. కనుక ప్రతులు ప్రస్తుతం లభ్యం కావు.

గీతలు ఎన్ని ఉన్నా, 'గీత' అనగానే స్మృతిలో మెదిలేది భగవద్గీత ఒక్కటే. అదే గీతా మహాత్మ్యము.

సరోవరం నుండి ఏవేవో పుడుతాయి. ఎన్నెన్నో పుడుతాయి. అన్నీ సరస్సు నుండి పుట్టినవే. కానీ, 'సరోజం' అనగానే సరస్సు నుండి ఉద్భవించినవి ఏవీ గోచరించకుండా కమలమే కళ్ళ ముందు కనిపిస్తుంది. మనస్సును మురిపిస్తుంది.

గీత లెన్నున్నా, 'గీత' అనే నామం భగవద్గీతనే బుద్ధిలో నిలుపుతుంది. భగవద్గీత పేరు వినని వారిని, భగవద్గీత తత్త్వాన్ని పూర్ణంగా తెలిసిన వారిని వ్రేళ్ళపై లెక్కెట్ట వచ్చు. అదే భగవద్గీతా వైభవము.

## నిష్ఠాద్వయం

వేద ప్రతిపాదితమైన నిష్ఠాద్వయాన్ని ధర్మద్వయము అని కూడా అంటారు. ఇదే వేదోక్త ధర్మం. మొదటిది ప్రవృత్తి రూపమైన కర్మనిష్ఠ ; రెండవది నివృత్తి రూపమైన జ్ఞాననిష్ఠ. ప్రపంచ మనుగడకు ఈ ధర్మద్వయమే కారణము. ఈ నిష్ఠాద్వయం ప్రాణులకు అభ్యుదయాన్ని, నిశ్శ్రేయసాన్ని ప్రసాదిస్తాయి. ప్రవృత్తి లక్షణమైన కర్మనిష్ఠ అభ్యుదయాన్ని అందిస్తే, నివృత్తి లక్షణమైన జ్ఞాననిష్ఠ సాక్షాత్తు నిశ్శ్రేయసమును అనుగ్రహించి ఆశీర్వదిస్తుంది.



మరి, భగవద్గీత వేద స్వరూపమని, ఉపనిషత్సార మని చెప్పుకున్నాం కదా! అలాంటప్పుడు, ఉపనిష త్ప్రతిపాదిత మైన విషయాన్నే భగవద్గీత కూడా బోధించాలి. ప్రసక్తానుప్రసక్తంగా అనేక విషయాలను అనివార్యంగా చర్చించినా, కేంద్ర విషయం నుండి ప్రక్కకు తప్పుకో కూడదు. అప్పుడే వేదం లాగా గీత కూడా ప్రమాణమై శోభిస్తుంది. ఆ విషయంలో గీత సఫలీకృత మైంది. వైదిక మైన నిష్ఠాద్వయ రూపమైన ధర్మద్వయాన్నే భగవంతుడు కేంద్ర విషయంగా తీసుకొని భగవద్గీతలో బోధించాడు.

వైదికం హి ధర్మ ద్వయమ్ అర్జునాయ
శోకమోహ మహోదధౌ నిమగ్నాయ ఉపదిదేశ !

శోక మోహ రూప మహాసముద్రంలో మునిగి పోయిన అర్జునునికి వేదోక్త ధర్మమైన రెండు ధర్మాలను భగవంతుడు గీతలో ఉపదేశించాడు.

ఈ బోధ వల్ల భగవంతునికి ఏమి ప్రయోజనము?
గీతను బోధించి పరమేశ్వరుడు ఏమి సాధించాడు?

ప్రయోజన మనుద్దిశ్య
న మందో పి ప్రవర్తతే !

ప్రయోజనం లేని కార్యాన్ని అప్రయోజకుడు కూడా చేయడు. మరి, భగవంతుని బోధ వెనుక ప్రయోజన మేమిటి?

ప్రయోజనం లేని కార్యాలు విజ్ఞులు ఆచరించరు.
అలాగని తనకూ ప్రయోజనం అవసర మైతే ఆయన భగవంతుడు కాలేడు.

నిజమే. తాను చేసిన ప్రబోధ కార్యము ప్రయోజనంతో కూడుకొని ఉంది కనుక, తన విజ్ఞతకు లోపం రాదు. కానీ, ఆ ప్రయోజనము తన కొరకు కానందున ఆయన పూర్ణత్వానికి కూడా భంగం లేదు.

తన కంటూ ఏ ప్రయోజనం అవసరం లేకపోయినా (స్వప్రయోజన అభావేపి) సర్వ ప్రాణులను అనుగ్రహించాలనే కాంక్షతో (భూతాను జిఘృక్షయా) వేదోక్త మైన ధర్మద్వయాన్ని భగవంతుడు గీతలో బోధించాడు.

## ప్రవృత్తి - నివృత్తి

వేదాంత శాస్త్రాని కైనా, గీతాశాస్త్రాని కైనా మోక్షమే పరమ ప్రయోజనము. అదే నిశ్శ్రేయసము. సంసారము, దానికి కారణమైన అజ్ఞానము సమూలంగా నశించడమే మోక్షము (నిశ్శ్రేయసమ్, సహేతుకస్య సంసారస్య అత్యన్త ఉపరమ లక్షణమ్ ).

వేదోక్తమైన ధర్మద్వయమే ప్రవృత్తి నివృత్తులు. ఏమి చెయ్యాలో చెప్పేది ప్రవృత్తి. ఎలా ఉండాలో చెప్పేది నివృత్తి. ప్రవృత్తి కర్మమార్గము. నివృత్తి జ్ఞానమార్గము. విధి విధానాలు, కర్మోపాసనల ద్వారా జ్ఞానానికి సిద్ధం చేసే ప్రవృత్తి లక్షణ ధర్మం కర్మమార్గము. జ్ఞానమును ప్రసాదించి స్వరూప స్థితిలో నిలిపే నివృత్తి లక్షణ ధర్మం జ్ఞానమార్గము. ఈ రెండే వేదము ప్రతిపాదించే ధర్మద్వయం.

మోక్షము కర్మఫలం కాదు. కర్మ అనిత్యం. అనిత్యమైన కర్మకు ప్రాప్తించే కర్మఫలం కూడా అనిత్యమే. కనుక అనిత్యమైన కర్మ ద్వారా నిత్యమైన ఆత్మను పొందడం అసంభవం (న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్ ). జ్ఞానం వల్లనే మోక్షం సిద్ధిస్తుంది. జ్ఞానం గురువు ద్వారానే ప్రాప్తిస్తుంది. గురువు ప్రసాదించే జ్ఞానాన్ని గ్రహించడానికి బుద్ధి శుద్ధి పడి ఉండాలి. ఈ చిత్తశుద్ధి కర్మయోగం వల్ల సిద్ధిస్తుంది. కర్మయోగము ద్వారా శుద్ధిపడిన తరువాత

ముముక్షువు జ్ఞాననిష్ఠకు అర్హు డవుతాడు **(కర్మజా సిద్ధిః జ్ఞాననిష్ఠా యోగ్యతా లక్షణా).** మోక్షం జ్ఞానరూపంలో ఉంది కనుక ఆత్మజ్ఞానాన్ని పొంది ముక్తు డవుతాడు. శోకాన్ని దాటి పోతాడు **(తరతి శోక మాత్మవిత్ - ఛాందోగ్యోపనిషత్).**

వేద ప్రతిపాదితమై నిష్ఠాద్వయంగా చెప్పబడుతున్న ప్రవృత్తి నివృత్తి మార్గాలనే గీత కూడా బోధిస్తూ ఉంది. ఉపాయమైన కర్మయోగమును సాధనగా, ఉపేయమైన జ్ఞానయోగమును సాధ్యముగా నిర్ణయిస్తూ నిష్ఠా ద్వయాన్ని గీత బోధిస్తూ ఉంది.

## గీతా వ్యాఖ్యానాలు - శ్రీ శంకర భాష్యము

భగవద్గీతపై అనేక వ్యాఖ్యానాలు వెలువడ్డాయి. ఇంకా వెలువడు తున్నాయి. ఈ భాష్యాలలో ప్రముఖ మైనది, ప్రాచీన మైనది శ్రీ ఆదిశంకరాచార్యస్వామి రచించిన భాష్యము.

శ్రీ శంకరులకు పూర్వము కూడా భగవద్గీతకు వ్యాఖ్యానము వ్రాసిన వారు ఉన్నారు. అవి గీతా హృదయాన్ని ఆవిష్కరించ గలిగి ఉంటే, శ్రీ శంకరులు గీతకు భాష్యం వ్రాసి ఉండే వారు కారు.

వాస్తవం చెప్పాలంటే, అవి యథావత్ గీతా హృదయాన్ని ఆవిష్కరించక పోగా, వక్ర భాష్యాన్ని కూడా వినిపించాయి. అందుచేత ఆచార్యుల వారు గీతాభాష్యానికి శ్రీకారం చుట్ట వలసి వచ్చింది.

ఆచార్యుల వారికి పూర్వము బోధాయనుడు అనే వ్యక్తి గీతకు వ్యాఖ్యానము రచించాడు. అతనిని వృత్తికారుడు అని కూడా అంటారు. అతడు జ్ఞానకర్మ సముచ్చయ వాదాన్ని ప్రతిపాదించాడు.

ప్రవృత్తి నివృత్తులను గూర్చి ఇప్పుడే మనం సంక్షేపంగా చెప్పుకున్నాం. గ్రంథంలో మున్ముందు సహేతుక మైన తర్కంతో విస్తారంగా చర్చించడం మీరు చూస్తారు.

ప్రస్తుతం మనం చూచి నంత వరకు కర్మయోగ, జ్ఞానయోగాల మధ్య సాధన సాధ్య సంబంధాన్ని చూశాం. ఉపాయ ఉపేయ సంబంధంగా అర్థం చేసుకున్నాం. జ్ఞానం ద్వారానే మోక్షం ప్రాప్తిస్తుంది. మోక్షానికి జ్ఞానమే సాధనం **(జ్ఞాన మేవ సాధనం).** జ్ఞానప్రాప్తికి అంతఃకరణ శుద్ధి అవసరం కనుక, దానికి కర్మయోగము సహకరిస్తుంది. ఉపకరిస్తుంది. ఇదీ ఉన్న విషయం.

వృత్తికారుడు ప్రతిపాదించే జ్ఞానకర్మ సముచ్చయము విచిత్రమైన వాదము. కర్మ, జ్ఞానము కలిసే మోక్షాన్ని ఇస్తాయి అనేది బోధాయనుని అభిప్రాయము. జ్ఞానకర్మలు రెండిటిని ఒకే మనిషి ఒకే కాలంలో ఆచరించడం సాధ్య పడదు. కారణం, అవి గతి - స్థితుల వలె పరస్పర విరుద్ధ మైనవి.

ఒకే కాలంలో ఒకే వ్యక్తి నడవాలి - నడవకుండా నిలబడాలి (గతి - స్థితి) అంటే సాధ్యమేనా? ఇంత అశాస్త్రీయ మైన విషయం వృత్తికారుడికి వంట బట్టింది. పోనీ, అది అతని అభిప్రాయం అని సరిపెట్టు కుందాము అంటే, అదే గీతాహృదయ మని వ్యాఖ్యానిస్తూ, గీతకు జ్ఞానకర్మ సముచ్చయ వాదాన్ని అంట గట్టాడు. వృత్తికారుని మతాన్ని గీతాభాష్యంలో అనేక చోట్ల నామ ప్రసక్తి లేకుండా ఆచార్యుల వారు నిశితంగా ఖండించారు.

**తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థ**
**సార సంగ్రహ భూతమ్ దుర్విజ్ఞేయార్థం**

ఈ గీతాశాస్త్రము సమస్త వేదార్థ సార సంగ్రహ భూతమై ఉన్నందున, దాని అర్థాన్ని యథావత్ గ్రహించడం సులభసాధ్యం కాదు. చాలా కష్టమైన కార్యము అంటూ భాష్య పీఠిక లోనే ఆచార్యులు వ్యాఖ్యానించారు.





నేను ముందుగానే తెలియ చేసినట్లు, పూర్వ వ్యాఖ్యానాలు ఉండగా, మళ్ళీ ఆచార్యుల వారు భాష్యాన్ని ఎందుకు రచించారు? అనేది పూర్వపక్షము.

వ్యాఖ్యానాలు ఉండినా, అవి విరుద్ధ భావాలను వ్యక్తం చేయడం వల్ల, వాటిని పఠించే వారు విరుద్ధ భావాలను గ్రహించడమే గాక, ఆ విరుద్ధ భావాలు గీత లోనే ఉన్నాయని కొందరు అంటూ ఉండటం వినిన ఆచార్యులు, ఈ విరుద్ధార్థ గ్రహణాన్ని నివారించి, స్పష్టమైన అర్థాన్ని ఋజుమార్గంలో అందించ డానికి భాష్యాన్ని వ్రాయవలసి వచ్చింది అని స్వయంగా చెప్పడం జరిగింది **( అహం వివేకతః అర్థ నిర్ధారణార్థం సంక్షేపతః వివరణం కరిష్యామి ).**

## ఆప్త ప్రణీతము

గ్రంథ విషయము విస్పష్టంగా, సులభగ్రాహ్యంగా ఉంటే, దానిని వ్యాఖ్యానించ నవసరం లేదు. మూల గ్రంథము లోని విషయాన్ని గ్రహించడం దుస్సాధ్య మైనపుడే దానికి వ్యాఖ్యానము అవసరమై ఉంటుంది.

మూలానికి వ్యాఖ్యానము తోడై నపుడు విషయం స్పష్టమై సులభగ్రాహ్యం కావాలి. అలా విషయాన్ని సులభ తరం చేసే విధంగా వ్యాఖ్యానించా లంటే వ్యాఖ్యాత ఆప్తుడై ఉండాలి. అతని వ్యాఖ్యానము ఆప్తప్రణీతంగా ఉండాలి.

ఆప్తుడు అంటే యథార్థమును వచించు వాడు అని అర్థము. ప్రామాణికుడు అని భావము. ప్రమాణ విషయాన్ని విడిచి పెట్టకుండా, అప్రమాణ విషయాలను జోడించకుండా విషయాన్ని ఉన్నదున్నట్లు సుస్పష్టంగా అందించ గలిగే వాడు ఆప్తుడు. అట్టివాడు రచించే వ్యాఖ్యానమును ఆప్త ప్రణీతము అంటారు.

వ్యాఖ్యానము ప్రామాణికంగా ఉన్నప్పుడే అది ఆప్త ప్రణీత మవుతుంది. అలా ప్రామాణికంగా ఉండాలి అంటే, అది పంచ లక్షణాయుతంగా ఉండాలి.

**పదచ్ఛేదః పదార్థోక్తిః**
**విగ్రహో వాక్య యోజనా।**
**ఆక్షేపస్య సమాధానం**
**వ్యాఖ్యానం పంచలక్షణమ్।**

ప్రామాణిక మైన వ్యాఖ్యానమునకు అయిదు లక్షణాలు ఉండాలి. (1) పదచ్ఛేదము, అంటే పదములను విడగొట్టడము (2) పదార్థోక్తి, అంటే పదముల యొక్క అర్థమును చెప్పడము. (3) విగ్రహము, అంటే సమాసగత పదాలను విడదీసి అర్థము చెప్పడము (4) వాక్యయోజనము, అంటే వాక్యానికి సుస్పష్టంగా అర్థం చెప్పడము (5) ఆక్షేపస్య సమాధానం, అంటే ఆక్షేపానికి సమాధానం చెప్పడము. ఈ అయిదు లక్షణాలు ఉన్నప్పుడే వ్యాఖ్యానము ప్రామాణిక మవుతుంది. అట్టి వ్యాఖ్యానమునే ఆప్త ప్రణీతముగా విజ్ఞులు గ్రహిస్తారు.

ఇక భగవద్గీత విషయానికి వస్తే, మూలగ్రంథము సమస్త వేదార్థ సార సంగ్రహభూత మైనందున, అది దుర్విజ్ఞేయమై కష్టసాధ్యంగా ఉన్నందున వ్యాఖ్యాన యోగ్యమై ఉంది.

శ్రీ శంకరులకు పూర్వులైన వ్యాఖ్యానకర్తలు భగవద్గీతను వ్యాఖ్యానించి ఉన్నప్పటికీ, ఆచార్యులు భాష్యాన్ని అందించారు అంటే, పూర్వ వ్యాఖ్యానాలు పంచ లక్షణాయుతంగా లేవా? వ్యాఖ్యాన లక్షణాలను విస్మరించాయా? కాదు. వారు కూడా వ్యాఖ్యాన లక్షణాలను అనుసరించే వ్యాఖ్యానించారు. ఈ విషయాన్ని భాష్యంలో శ్రీ శంకరులే అంగీకరించారు. అయినా, ఆచార్యుల వారు భాష్యం వ్రాయవలసి వచ్చింది. కారణ మేమిటో భాష్య పలుకు ల్లోనే విందాం.

**తదిదం గీతాశాస్త్రం సమస్త వేదార్థ సార సంగ్రహ భూతం దుర్విజ్ఞేయార్థం। తదర్థా విష్కరణాయ అనేకైః వివృత పద పదార్థ వాక్యార్థ న్యాయ మపి అత్యన్త విరుద్ధ అనేకార్థత్వేన లౌకికైః గృహ్యమానం ఉపలభ్య అహం వివేకతః అర్థ నిర్ధారణార్థం సంక్షేపతః వివరణం కరిష్యామి !**

'సమస్త వేదార్థ సార సంగ్రహ భూతమైన గీతాశాస్త్రం యొక్క అర్థాన్ని యథావత్ గ్రహించడం సులభమైన విషయం కాదు; పైగా చాలా కష్టతరం కూడా. అందుచేత, పంచ లక్షణ వ్యాఖ్యాన న్యాయాన్ని అనుసరిస్తూ, పదచ్ఛేదము, పదార్థోక్తి, విగ్రహము, వాక్యార్థము (వాక్య సమన్వయము), ఆక్షేపమునకు సమాధానమును ఇస్తూ కొంత మంది వ్యాఖ్యానించి ఉన్నారు. అయినప్పటికీ, ఆ వ్యాఖ్యానాలు విరుద్ధమైన అనేక అర్థాలతో కూడి ఉన్నందున, అజ్ఞానులు ఆ విరుద్ధమైన అర్థాలను గ్రహించి, గీత లోని భావాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయి అని చెప్పుకుంటూ ఉండటం విని, ఏ విధమైన వైరుధ్యానికి అవకాశం ఇవ్వకుండా విషయాన్ని సుస్పష్టం చేయడానికి సంక్షేపంగా వివరిస్తూ వ్యాఖ్యానిస్తాను' అని ఉపోద్ఘాతం లోనే స్పృశించారు.

## స్వాభిప్రాయం

మూల విషయానికి సంబంధించిన అర్థాన్ని సుస్పష్టం చేయడం లోనే వ్యాఖ్యాన ప్రాధాన్యత ఉంటుంది. ఎవరైనా **మార్జారీ** అన్న పదానికి ఆడపిల్లి అనే అర్థాన్ని గ్రహించకుండా, **శునీ** అంటూ ఆడకుక్క అని అర్థం చెప్పారనుకోండి, ఇక ఆ తరువాత, 'మార్జారీ, అంటే ఆడపిల్లి విశ్వాసం కలది, ఇంటిని కాపలా కాస్తుంది, గొప్ప ఆఘ్రాణ శక్తి కలది' అంటూ అప్రస్తుత అనర్థ వ్యాఖ్యానాన్ని అందించడం జరుగుతుంది.

ఇక్కడే శ్రీ శంకర భాష్యము ఆప్తప్రణీతమై అలరారుతోంది. గీత లోని మూలాన్ని ఎక్కడి కక్కడ పద బంధాలను విడగొట్టి, సంప్రదాయ గాడిలో నిలిచి, అర్థాన్ని సుస్పష్టం చేయడంలో శ్రీ శంకరులు అనితర సాధ్యమైన అసమాన ప్రతిభను ప్రదర్శించారు.

బుధులు విభేదించి మరో విధంగా భావించరనే విశ్వాసంతో నా మనస్సు లోని మాట చెబుతున్నా!

భాష్యకారులుగా ఆచార్యుల వారి వైభవాన్ని
తిలకించి పులకించి పరవశించాలంటే,

కదలి కెరటాల వలె ఎగసి పడే
వాదనల వీణానాద విలసనములతో,
ప్రచండ డిండిమ ధ్వనుల వలె చిందు లేసే
సశాస్త్రీయ సిద్ధాంత భేరీ నినాదాలతో,
అలౌకిక వాగ్విభూతి వినిపించే
నేపథ్య సంగీత ఝురులకు అనుగుణంగా
తర్క వేదికపై గీర్వాణ సుందరాంగి ప్రదర్శించే
ప్రతిభా వైశిష్ట్య నాట్యకళా వైభవాన్ని
అవలోకించా లనుకుంటే,

పున్నమి జాబిల్లి పాలవెల్లిపై వెన్నెల నారబోసినట్లు
ప్రసన్న గంభీరమై శోభించే గీతాభాష్యం కన్నా,







ఆచార్యుల వారి ఉపనిష ద్భాష్యాలను,
ముఖ్యంగా సూత్ర భాష్యాన్ని దర్శించాలి. పఠించాలి.

జ్ఞాన మార్తాండులైన ఆచార్యుల వాగ్వైభవ వేడికి
సంశయ జలనిధులు ఇంకిపోతూ ఉండటాన్ని మనం
కళ్లారా చూడవచ్చు.



సర్వశాస్త్ర జ్ఞాన వైదుష్యం
అసమాన ప్రతిభా పాండిత్యం - అనే రెండు రెక్కలతో
ఆ పరమహంస వేదాంత గగన వీధులలో
చిత్ర విచిత్రంగా విహరిస్తూ ఉంటే,
దర్శించి తరించే బుద్ధిని చూచి
కళ్ళు కలత చెంది ఈర్ష్య పడతాయి.
హృదయం అమృత జ్ఞాన రస తరంగిత మవుతుంది.

## అనుబంధము - అనుగ్రహము

సంప్రదాయ ప్రవర్తక ఆచార్య శ్రేష్ఠులైన శ్రీ శంకర భగవత్పాదులు ధర్మద్వయ రూపంతో శోభించే గీతాశాస్త్రం మోక్షమునే ముఖ్య ప్రయోజనంగా కలిగి, వాసుదేవ పరబ్రహ్మమును ప్రధానంగా ప్రతిపాదిస్తూ ఉన్నందున, గీతా శాస్త్రం యొక్క యథార్థ జ్ఞానం కలిగితే సర్వ పురుషార్థములు మానవాళికి సిద్ధిస్తా యనే సత్య సంకల్పంతో గీతకు వ్యాఖ్యానాన్ని అందిస్తున్నట్లు భాష్య ఉపక్రమణిక అంతిమ వాక్యంలో తమ మనస్సు లోని మాటను స్పష్టం చేశారు.

**యతః తదర్థే విజ్ఞాతే సమస్త పురుషార్థ సిద్ధిః**
**ఇత్యతః తద్వివరణే యత్నః క్రియతే మయా!**

గీతాశాస్త్ర జ్ఞానము సమస్త పురుషార్థ సిద్ధిప్రదం
ఆ కారణంగా సాగిన ప్రయత్నమే నా ఈ వివరణం - అన్నారు ఆచార్యులు.

మోక్ష ప్రయోజనము ప్రధానమైంది కనుక, సంప్రదాయమును అనుసరించి గీతాశాస్త్రము అనుబంధ చతుష్టయముతో శోభించాలి. విషయ ప్రయోజన సంబంధాధికారులను కలిగి ఉండాలి. అప్పుడే శాస్త్రము వ్యాఖ్యాన యోగ్య మవుతుంది.

**విషయము :-** ప్రతిపాద్య విషయము వాసుదేవు డనే పేరు గల పరబ్రహ్మము. పరబ్రహ్మమే అభిధేయము లేదా విషయము **( వాసుదేవాఖ్యం పరంబ్రహ్మ అభిధేయ భూతం).**

**సంబంధము :-** మోక్ష రూపమైన ఫలానికి, గీతాశాస్త్రానికి ధర్మద్వయం ద్వారా (ప్రవృత్తి నివృత్తి రూప కర్మజ్ఞానాలకు) సాధ్యసాధన సంబంధం ఉక్తం. అదే విషయ విషయి భావ సంబంధము.

**అధికారి :-** పరమ పురుషార్థమైన మోక్షమును అర్థించు జిజ్ఞాసువు అధికారి. అతడే ముముక్షువు.

**ప్రయోజనము :-** గీతా శాస్త్రమునకు మోక్షమే సాక్షాత్తు ప్రయోజనము.

ఈ విధంగా విషయ, ప్రయోజన, సంబంధాధికారులను అనుబంధ చతుష్టయముగా కలిగి ఉన్నందున గీతా శాస్త్రము సంప్రదాయ సిద్ధమై వ్యాఖ్యాన యోగ్యతను సంతరించు కున్నది.

## గీతా వ్యాఖ్యానాలు

భగవద్గీతా వ్యాఖ్యానాలలో శ్రీ ఆదిశంకరాచార్యస్వామి వారి భాష్యమే ప్రాచీన మైనది, ప్రముఖ మైనది అని ఇప్పటికే చెప్పుకున్నాం. ఆచార్యుల వారి మార్గమును అనుసరిస్తూ, వారి తరువాత అనేక భాష్య వ్యాఖ్యానాలు వెలుగు చూశాయి. అలాగే, ఆచార్యుల వారి మార్గముతో విభేదిస్తూ మరి కొన్ని వ్యాఖ్యానాలు వచ్చాయి.

రెండవ కోవకు చెందినవి నా బుద్ధికి రుచించ నందున నేను వాటిని ప్రస్తావించడం లేదు. ఆచార్యుల వారి బాటలో నడచినవి, ఆచార్యుల వారి భాష్యంతో విభేదించనివి, ముఖ్యంగా నన్ను ప్రభావితం చేసిన కొన్ని వ్యాఖ్యానాలను సంక్షేపంగా వివరిస్తాను. ఇవన్నీ సంస్కృత వ్యాఖ్యానాలే.

### (1) గీతా తాత్పర్య బోధిని

ఇది భగవద్గీతకు సుందరమైన, సరళమైన సంస్కృత వ్యాఖ్యానము. వ్యాఖ్యాత శ్రీ శంకరానంద యతీంద్రులు. వీరు వేదాంత పంచదశి, అనుభూతి ప్రకాశిక మొదలైన అద్వైత గ్రంథములను రచించిన శ్రీ విద్యారణ్యస్వామి వారి గురుదేవులు.

శ్రీ శంకరానంద మునీంద్రులు 'గీతా తాత్పర్యబోధిని' వ్యాఖ్యానమును ఆరంభిస్తూ చేసిన గురు దేవతా స్తోత్రములలో స్వగురు స్తుతిని బట్టి చూస్తే వీరు ఆనందాత్మ సరస్వతీ స్వాముల వారి శిష్యులని తెలుస్తూ ఉంది.

భక్త్యా ప్రణమ్య స్వగురుం
ఆనందాత్మ సరస్వతీమ్ !
క్రియతే శ్రీమద్భగవ
ద్గీతా తాత్పర్య బోధినీ ॥

మద్గురువరేణ్యు లైన శ్రీ ఆనందాత్మ సరస్వతికి భక్తితో ప్రణామము లర్పించి, శ్రీమద్భగవద్గీతకు 'గీతా తాత్పర్య బోధిని' అనే వ్యాఖ్యానాన్ని రచిస్తున్నాను అని ప్రార్థనా శ్లోకంలో స్తుతించారు.

'గీతా తాత్పర్యబోధిని' రచయిత లైన శ్రీ శంకరానంద యతివరేణ్యులు అద్వైత సంప్రదాయక ప్రవర్తక గురువు లైన ప్రముఖులలో ఒకరు. 'గీతా తాత్పర్యబోధిని' వ్యాఖ్యానమునే గాక, వేదాంత ప్రపంచానికి సుపరిచిత మైన 'ఆత్మపురాణము'ను రచించిన గ్రంథకర్త కూడా వీరే.

వీరి గీతా వ్యాఖ్యాన మంతా అద్వైతపరం గానే సాగుతుంది. సుప్రసిద్ధమైన ఈ వ్యాఖ్యానము అనితర సాధ్యంగా భాసిస్తుంది. కానీ, వీరికి జ్ఞానము నందే అభిలాష మెండు. భక్తి విషయంలో వైరుధ్యము లేకపోయినా, ఆసక్తిని మాత్రం పెద్దగా ప్రదర్శించరు.

### (2) గూఢార్థ దీపిక

సుప్రసిద్ధ మైన గీతా వ్యాఖ్యానములలో 'గూఢార్థ దీపిక' కూడా విశిష్ట మైనదిగా కీర్తింప బడింది. దీని వ్యాఖ్యాత శ్రీమధుసూదన సరస్వతీ స్వాముల వారు.

శ్రీ శంకరాచార్యస్వామి భాష్యమును అనుసరిస్తూ వీరి వ్యాఖ్యానము సాగుతుంది. వేదము ఎలా కాండ త్రయాత్మకంగా ఉందో, భగవద్గీత కూడా కర్మ, భక్తి, జ్ఞాన క్రమంలో కాండత్రయాత్మకంగా శోభిస్తూ,





వేదమునకు ప్రతిరూపమై భాసిస్తూ ఉందని వ్యాఖ్యానించారు. శ్రీ శంకరానందుల వారు భక్తిని స్పృశించకుండా జ్ఞానపరం గానే వ్యాఖ్యను నడుపుతారు. మధుసూదన సరస్వతి భక్తిని స్పృశించకుండా వ్యాఖ్యానాన్ని సాగించ లేరు. ఇదే వీరిరువురి వ్యాఖ్యానములలో మనకు స్పష్టంగా కనిపించే అంతరము.

'అద్వైత సిద్ధి' అనే అద్భుతమైన అద్వైత గ్రంథము శ్రీ మధుసూదన సరస్వతుల వారి కృతియే. వీరు గొప్ప కృష్ణ భక్తులు. వీరిలో భక్తి జ్ఞానాలు అపూర్వ సమ్మేళనంగా కనిపిస్తాయి.

### (3) సుబోధినీ వ్యాఖ్య

ఇది శ్రీధరస్వామి రచించిన వ్యాఖ్యానము. భక్తి భావ బంధురమైన శ్రీధరుని 'సుబోధినీ' వ్యాఖ్య ప్రసన్నంగా సాగింది. భాష్యకారుల అభిప్రాయాలతో పాటు, భాష్య వ్యాఖ్యాతల భావాలను కూడా బౌదల దాల్చి గీతా వ్యాఖ్యానమును కొనసాగిస్తున్నట్లు శ్రీధరస్వామి ఉపక్రమణిక లోనే తెలియ చేశారు. లక్ష్మీ సమేతుడైన శ్రీమహావిష్ణువును, పార్వతీనాథు డైన విశ్వేశ్వరుని భక్తితో నమస్కరించి, ఆ విధమైన భక్తి చేత ప్రేరితుడై సుబోధినీ గీతా వ్యాఖ్యానమును రచిస్తున్నట్లు ప్రార్థనా శ్లోకాల లోనే తెలిపి, శివకేశవుల మధ్య అభేదమే దర్శనీయ మని స్పష్టం చేశారు.

భక్తి వలన భగవ దనుగ్రహం ప్రాప్తిస్తుందని, భగవ దనుగ్రహము చేత కలిగిన ఆత్మజ్ఞానము వలన సుఖంగా బంధ విముక్తి, మోక్షప్రాప్తి కలుగుతుం దని, ఇదే గీతార్థ సంగ్రహ మని తన అభిప్రాయాన్ని సుబోధినీ వ్యాఖ్యానంలో ఒక్క శ్లోకం లోనే తేట పరిచారు.

భగవ ద్భక్తి యుక్తస్య
త త్ప్రసాదా దాత్మబోధతః
సుఖం బంధ విముక్తిః స్యాత్
ఇతి గీతార్థ సంగ్రహః

భగవద్భక్తి కల వానికి భగవ దనుగ్రహముచే ప్రాప్తించిన ఆత్మజ్ఞానం వల్ల సుఖంగా బంధ విముక్తి కలుగుతుంది అనేది గీతార్థ సంగ్రహము. ఇది శ్రీధరస్వామి అభిప్రాయము.

### (4) భారత భావ దీపము

శివాద్వైతు లైన శ్రీ నీలకంఠాచార్యుల వారు రచించిన గీతా వ్యాఖ్యానమును 'భారత భావదీపము' అంటారు. ప్రామాణికంగా సాగిన వీరి వ్యాఖ్యానము భావగర్భితంగా సాగడమే గాక, అవసరాన్ని దృష్టిలో ఉంచుకొని నిర్హేతుక సిద్ధాంతాలను సున్నితంగా తిరస్కరిస్తూ కూడా సాగుతుంది.

రెండవ అధ్యాయం - పదమూడవ శ్లోకం దేహినోஉస్మిన్ యథా దేహే అనే శ్లోకం పై వ్యాఖ్యానిస్తూ,

వ్యావృత్తేభ్యోஉనువృత్తం
భిన్నం కుసుమేభ్యస్సూత్ర మివ,

పరస్పరం భిన్నమైన పుష్పముల యందు అనువృత్త మైన దారము పువ్వుల కన్నా వేరు అయినట్లు, దేహాంతర ప్రాప్తిః - స్థూల శరీరం కన్నా వేరైనట్టి స్థూలానుకారు లగునట్టి సూక్ష్మ దేహములు జీవునికి సంభవిస్తాయి అనే విషయాన్ని విస్తరించి చెబుతూ, అనిత్యములు, అవిభువులు అయిన శరీరాదులకు ఆత్మత్వము సంభవించడం అసంభవం కనుక చార్వాకాది మతాలు నిరస్తములు అని నిర్ధారణ చేస్తారు.

## (5) పరమార్థ ప్రపాఖ్య

దైవజ్ఞ పండిత సూరి రచించిన గీతా వ్యాఖ్యానమే 'పరమార్థ ప్రపాఖ్య'. వీరు కృష్ణ భక్తులు. తమ గురువైన చతుర్వేద స్వామి నుండి గ్రహించిన జ్ఞాన ప్రసాదమును ప్రామాణికంగా అందించాలనే కుతూహలంతో గీతా వ్యాఖ్యానమును రచిస్తున్నట్లు, ఈ వ్యాఖ్యానము అల్పజ్ఞులైన వారికి కూడా ఆనందాన్ని ప్రసాదిస్తుంది అని వాగ్దానం చేశారు.

భగవ దనుగ్రహము నందు వీరికి అచంచల మైన విశ్వాసము. సముద్రాన్ని పుడిసిట పట్టే శక్తి అగస్త్య మహర్షికి, భూమాతను పడగలపై నిలిపే శక్తి ఆదిశేషునికి, దహించే శక్తి అగ్నికి, వర్షించే శక్తి మేఘానికి, ప్రకాశించే శక్తి సూర్యునికి, వీచే శక్తి వాయుదేవునికి ఏ లోకాతీత శక్తి స్వరూపుడైన శ్రీకృష్ణుడు అనుగ్రహించాడో, ఆ దివ్యాత్ము డైన యశోదా కిశోరుడే తనలో అంతర్యామిగా అతి సమీపమున సర్వోత్కర్షముగా ప్రకాశిస్తూ, తన చేత గీతా వ్యాఖ్యానాన్ని వ్రాయిస్తున్నాడు అని నివేదించు కున్నారు దైవజ్ఞ పండిత సూరి. గీతా వ్యాఖ్యానాలలో 'పరమార్థ ప్రపాఖ్య' కూడా తన కంటూ ఒక స్థానాన్ని పదిలం చేసుకుంది.

ఇవన్నీ అద్వైత పరంగా సాగిన వ్యాఖ్యానాలే. ఇవే గాక, మరెన్నో, ఎన్నెన్నో చెప్పుకో దగిన గీతా వ్యాఖ్యానాలు అసంఖ్యాకంగా ఉన్నాయి.

ఆచార్యుల వారి భాష్యానికి, ఆచార్యుల వారి శిష్యులలో ఒకరైన ఆనందగిరి ఒక టీకను రచించారు. ఇది శ్రీశంకర భాష్యానికి వివరణములా సాగింది. అదే 'గీతాభాష్య వివేచనము' అనే ఆనందగిరి టీక.

అలాగే శ్రీ మధుసూదన సరస్వతి రచించిన గద్యాత్మక మైన (వచన రూపమైన) 'గూఢార్థ దీపిక' కు శ్రీసదానంద యతీంద్రుల వారు పద్యాత్మకంగా ఒక వ్యాఖ్యను రచించారు. దానిని 'గీతా భావ ప్రకాశము' అంటారు. దీనిని కేవలం శ్రీకృష్ణ పరమాత్మ చరణకమల సేవనముగా రచించి, భగవదర్పణం చేసినట్లు ఆయన చెప్పు కున్నారు.

గీతా భావ ప్రకాశః
శ్రీ సదానందేన నిర్మితః
శ్రీమత్కృష్ణ పదాంభోజ
సేవా ముద్దిశ్య కేవలమ్ - అని శ్రీకృష్ణుని యందు తనకు గల భక్తిని చాటుకున్నారు.

భగవద్గీతపై వెలువడిన సంస్కృత వ్యాఖ్యానాలలో భాష్యోత్కర్ష దీపిక కూడా ప్రసిద్ధ మైనదే. దీనిని ధనపతి సూరి రచించారు. సర్వ శాస్త్ర జ్ఞానఫల మైన మోక్షము గీతా భక్తులకు అనాయాసంగా ప్రాప్తిస్తుంది అని ఫలస్తుతిలో శ్లాఘించారు. నిష్కామ కర్మయోగులకు చిత్తశుద్ధి ఫలం కాగా, తత్త్వ జ్ఞానాధికారికి అన్యాపేక్ష లేని కేవల తత్త్వ దర్శనము వలన మోక్షము ప్రాప్తిస్తుందని గీతాశాస్త్రార్థ సారాన్ని ఆవిష్కరించారు.

శ్రీ బెల్లంకొండ రామరాయ కవి రచించినది భాష్యార్క ప్రకాశము. ఇదొక అద్భుత మైన అద్వైత వ్యాఖ్యానము. వీరు సుమారు వంద పాతికేళ్ళ క్రితం గుంటూరు జిల్లా లోని పమిడిపాడులో ఉండే వారట. వీరు ఆచార్యుల వారి వలె తక్కువ కాలం జీవించారు. ముప్పై ఎనిమిది సంవత్సరాలే బ్రతికారు. సుమారు వందకు పైగా సంస్కృతంలో గ్రంథాలు రచించారు. అవన్నీ అద్భుత మైనవే. వీరి పాండిత్య ప్రతిభను గుర్తించిన పండిత ప్రపంచం వీరిని 'అభినవ శంకరులు' అని కీర్తించింది. ముఖ్యంగా వీరి గీతా వ్యాఖ్యానము జటిల మైనప్పటికీ బహు రసవత్తరంగా, ఆసక్తికరంగా ఉంటుంది. వీరు 'భాష్యార్క ప్రకాశము'లో గీతా వ్యాఖ్యానానికి ఎంత ప్రాధాన్యత నిచ్చారో, విశిష్టాద్వైత ఆచార్యులైన శ్రీమద్రామానుజ భాష్యాన్ని నిశితంగా విమర్శించడానికి కూడా





అంతే ప్రాధాన్యత నిచ్చారు. అలాగే శ్రీ వేదాంత దేశికులు అద్వైతం పై లేవనెత్తిన ఆక్షేపణలను కూడా తీవ్ర స్వరంతో ఖండించారు. వీరు గొప్ప రామభక్తులు. హయగ్రీవోపాసకులు.



భగవద్గీతకు భాష్యా లెన్నున్నా
వెల్లువలై వ్యాఖ్యలు దొర్లి వచ్చినా
అధ్యయనాని కైనా, అనుభూతి కైనా
శాంకర భాష్యమే అసమాన ప్రదీపము.

అవి మాటలు కావు, మంత్రాలు
పలుకులు కావు, ప్రమాణాలు
వాక్యాలు కావు, వాగ్దేవి రూపాలు
అనుసరించే వారికి శాంతితీరాలు.

## గీతా దర్శనము

య ఉపనిషత్సు ధర్మాః
తే మయి సన్తు ! తే మయి సన్తు !

ఉపనిషత్తుల అనంత జ్ఞానము తమ హృదయాలలో సుస్థిరంగా ఆవిష్కరింప బడాలని ఎంతో కాలంగా ఎందరు తపించారో,

వారందరి కలల పంటగా, ప్రార్థనల ఫలంగా మహాభారతము పంచమవేదంగా అవతరించింది ( భారతం పంచమో వేదః ). వేద ధర్మాలను, ఉపనిష ద్రహస్యాలను ఒడి గట్టుకొని మరీ అవతరించింది. ఈ మహత్కార్యాన్ని సామాన్యులు సాధించ గలరా? అందుకే సాక్షాత్తు వేదనారాయణమూర్తి వేదవ్యాసుని రూపంలో అవతరించి ఆ మహత్కార్యాన్ని పూర్తి చేశాడు.

కో హ్యన్యః పుండరీకాక్షాత్
మహాభారత కృద్భవేత్ !

పద్మనయనుడైన పరమేశ్వరుడు తప్ప
కాగలడా మరొకడు మహాభారత కర్త?

విశ్వంలోని రూపా లన్నిటినీ మనం రెండు కళ్ళతో చూస్తున్నాము. అలాగే విశ్వనాథుని స్వరూపాన్ని దర్శించ డానికి మహాభారతము రెండు దివ్య చక్షువులతో శోభిస్తూ ఉంది. అందుచేతనే మహాభారత జ్ఞాన కమలము కలిమల హరణమే గాక ముక్తి ప్రదాయకమై అలరారుతోంది (భూయాద్భారత పంకజం కలిమల ప్రధ్వంసి నః శ్రేయసే ! ). మహాభారత జననికి సర్వదర్శన యోగ్యంగా శోభిస్తున్న ఆ నేత్రద్వయం వల్ల భారతము సర్వ శ్రేష్ఠత్వాన్ని సంతరించుకుంటే, సర్వేంద్రియాలలో నేత్రాలే ప్రధానం కనుక, మహోన్నతమైన మహాభారత గ్రంథంలో ఆ నేత్రద్వయం సర్వోన్నతమై శోభిస్తోంది. ఒకటి, భగవద్గీత; రెండు, విష్ణుసహస్రనామం.

భారతం సర్వ శాస్త్రేషు
భారతే గీతికా వరా!
విష్ణోః సహస్ర నామాపి
జ్ఞేయం పాఠ్యం చ తద్ద్వయమ్ !

సర్వ శాస్త్రములలో మహాభారతము శ్రేష్ఠ మైనది. భారతములో భగవద్గీత శ్రేష్ఠ మైనది. అలాగే విష్ణుసహస్రనామం కూడా. ఈ రెండిటిని సర్వులు తెలుసుకోవాలి. పఠించాలి. గీతను అర్థం చేసుకోవాలి. విష్ణుసహస్రనామాన్ని అవగాహనతో పఠించాలి.

**గేయం గీతా నామ సహస్రం**
**ధ్యేయం శ్రీపతి రూప మజస్రమ్ !**

భగవద్గీతను నిత్యము అధ్యయనం చేయాలి. విష్ణుసహస్రనామాన్ని సదా పఠించాలి. ఈ రెండిటి వల్ల ప్రాప్తించే జ్ఞానంతో పరమేశ్వరుని ధ్యానించాలి, దర్శించాలి అని ఆచార్యుల వారి 'భజగోవిందం'.

## విశ్వశాంతి ప్రదాయకం

విశ్వశాంతి నినాదంతో నేటి ప్రపంచం ప్రతిధ్వనిస్తూ ఉంది. అరచి అరచి నోళ్ళు అలసి పోతున్నాయి. పలికి పలికి మాటలు మూగ బోతున్నాయి. అంతా అలజడే. అన్నిచోట్ల అశాంతే. అందరిలో ఆవేదనే. మానవ సమాజ మంతా సమస్యలే. సంఘర్షణలే. విశ్వశాంతి అనేది అరుపులకు చిక్కేది కాదు, అవగాహనకు మాత్రమే దక్కేది.

విశ్వశాంతి వ్యక్తిశాంతిపై ఆధారపడి ఉంది. మనిషికి ఆనందం కావాలి. తృప్తి కావాలి. దేశకాలాలకు పరిమితం కాని ఆనందం కావాలి. అనంతానందం కావాలి. అది లభించే వరకు వ్యక్తికి సమస్యలు తీరవు; సంఘర్షణలు తప్పవు.

కురుక్షేత్రంలో అర్జునుడు శ్రీకృష్ణుని ముందు ఒకనాడు ఈ సమస్యనే ఉంచాడు. రాజ్యసుఖాలు, స్వర్గభోగాలు సైతం అందించలేని నిరవధిక సుఖాన్ని, అనంతానందాన్ని ఆశిస్తూ ప్రశ్నించాడు. మానవు లందరి సమస్య ఇదే కనుక, సర్వమానవాళి తరపున ప్రతినిధిగా అర్జునుడు ప్రశ్నించాడు.

**సర్వలోకాను గ్రహార్థం అర్జునం**
**నిమిత్తీ కృత్య ఆహ భగవాన్ వాసుదేవః**

సర్వ మానవాళిని అనుగ్రహించుటకు అర్జునుని నిమిత్తమాత్రంగా ఉంచుకొని, వాసుదేవ భగవానుడు భగవద్గీతను బోధించాడు.

గీత అర్జునుని సమస్యను పరిష్కరించింది
నీ, నా సమస్యలను కూడా పరిష్కరిస్తుంది
అన్ని కాలాలకు, అందరు వ్యక్తులకు, అన్ని దేశాలకు
ఉపకరించే అమృత సందేశమే శ్రీమద్భగవద్గీత.

భగవద్గీత ఎవరో కొందరికి మాత్రమే ఉపయోగపడే మత గ్రంథము కాదు. సర్వులను అక్కున చేర్చుకొని ఉద్ధరించే అమృత భాండము. అందుకే గీత విశ్వసందేశమై అలరారుతుంటే, గీతాచార్యుడు విశ్వపూజితుడై శోభిస్తున్నాడు.

**సారథ్య మర్జున స్యాదౌ**
**కుర్వన్ గీతామృతం దదౌ,**
**లోక త్రయోపకారాయ**
**తస్మై కృష్ణాత్మనే నమః ॥**





అర్జునుని రథాన్ని నడిపే బాధ్యతను ఒక వైపు నిర్వహిస్తూ, మరో వైపు ముల్లోకాలకు ఉపకారం చేయాలనే సంకల్పంతో గీతామృతాన్ని పంచిన శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కారము.

సమస్యల వలలో చిక్కుకొని సతమత మవుతున్న అర్జునుడు గీతాచార్యుని ఆశ్రయించాడు. గీతను ఆలకించాడు. సర్వ సమస్యల నుండి, సమస్త సందేహాల నుండి విడి పడ్డాడు. సంతుష్టాంతరంగ చిత్తుడై శోభించాడు.

ఎక్కడా ప్రాప్తించని శాంతిని గీత ప్రసాదిస్తుంది
ఎవరూ అందించలేని ఆనందాన్ని గీత అనుగ్రహిస్తుంది
క్షోభను తొలగిస్తుంది. శోభను కలిగిస్తుంది.

## నేటి పరిస్థితి : కాదు, దుస్థితి

గీత అరుదెంచి అయిదు వేల సంవత్సరా లైంది. మన మధ్యకు వచ్చిన గీత మనతో ఉన్నదే గాని మనల్ని విడిచి పెట్టి తిరిగి వెళ్ళ లేదు. గీత మన మధ్యే ఉంది, అయినా ఎందుకనో మన రాతలు మార లేదు.

కల్పతరువు క్రింద ఉన్నవాడు కరువుతో కుమిలి పోవడమా?
అమృత భాండాన్ని ముందు పెట్టుకొని దిక్కులేని చావు చావడమా?
నిజమే మరి! ఏం చేద్దాం!
కళ్ళుండినా గ్రుడ్డితనమే!
చెవు లుండినా చెవిటితనమే!

శబ్దాలంకార సొబగులతో శ్రవణ మనోహరంగా మహిత కవితా విభూతిని వినిపిస్తున్నా, ప్రయత్నంతో గట్టిగా చెవులు మూసుకొనే వాణ్ణి ఎవరు మాత్రం ఎలా తృప్తి పరచ గలరు?

శ్యామసుందరు డైన ఇందిరేశుని సుందర మృదు పదములు కనుల ముందు కదులుతున్నా, కర్కశంగా కళ్ళు మూసుకొనే వాణ్ణి ఎవరు మాత్రం ఎలా కాపాడగలరు?



అన్నీ బాగానే ఉన్నాయి
అల్లుడే మరో విధంగా ఉన్నాడు.

ఆరగించిన వానికి ఆకలి తెలియదు
గీతను అర్థం చేసుకుంటే అశాంతి మిగలదు.

గీత ఎందుకు ఉన్నదో, ఏం చెబుతున్నదో
అర్థం గాక కొందరు పాడై పోయారు.

గీతార్థాన్ని శ్రీ శంకరాది మహాత్ములు
పని గట్టుకొని హృదయాలకు పట్టించినా
అపార్థాలతో, అనుమానాలతో
దారి తప్పి మరి కొందరు పాడై పోయారు.

పాడైన వ్యక్తుల్ని నింపుకున్న సమాజం ఎలా బాగుంటుంది? అదీ పాడై పోతుంది. అలా పాడై పోయిన ప్రపంచమే నేడు అశాంతిని ఆరగిస్తూ, కన్నీళ్ళను పానం చేస్తూ ఉంది. శాంతి కావాలని పరితపిస్తూ ఉంది. స్వస్థత చేకూరాలని ఆరాట పడుతూ ఉంది.



ఎవరు ఎందుకున్నారో ఎవరికీ అర్థం గాని పరిస్థితి
ఎవరు ఎటు పోతున్నారో ఎవరికీ తెలియని దుస్థితి
నిర్హేతుక హింసలే నేటి సమాజంలో నియతి
రాక్షస ప్రవృత్తికే ఎటు చూచినా ప్రపంచంలో పరపతి.

మతి లేని ఆలోచనలు
గతి తెలియని గమనాలు
సుగతి ఎంతకూ కలిసి రాదు
దుర్గతి ఎందుకో దూరం కాదు.

అంతా అపసవ్యమే
అంతటా అస్తవ్యస్తమే.

వ్యాకరణం తెలియని వారు భాషను బోధిస్తారు. వైద్యం తెలియని వారు చికిత్సలు చేస్తారు. రాజ్యాంగము తెలియని వారు పరిపాలిస్తారు. జ్ఞానం లేని వారు బోధలు వినిపిస్తారు.

ఎవరు ఎవరినీ నమ్మరు
ఎవరు ఎవరి నైనా వమ్ము చేస్తారు
సొమ్ము చేసుకోవడమే తెలిసిన పని
ఇదే సర్వులను పాలిస్తున్న శని.

ఈ కారు చీకట్ల మధ్య
ఏదో కాంతిరేఖ మెరుస్తోంది.

మరేదో పనికి శ్రీకారం చుట్ట మంటోంది. అది కేవలం పని కాదు. శనిని తొలగించే పని. మునిని తలపించే పని. ఆ పనితనంలో మునితనం ఉంది. అది మామూలు పని కాదు.

ఆర్తుల, దుఃఖార్తుల
న్యాసుల, జిజ్ఞాసువుల కరకమలాలకు జ్ఞాన కమలాన్ని పట్టించే పని.
వినీతుల, విమల మతుల
ముక్తికాముల, మోక్షప్రియుల నేత్ర ప్రమిదలలో చల్లని జ్ఞానవత్తిని వెలిగించే పని.

అభ్యుదయాన్ని జార విడుచుకున్న సమాజానికి
ప్రశాంతతను పోగొట్టుకున్న మానవాళికి
కనువిప్పును కలిగించే కార్యంలో భాగంగా



కురుక్షేత్రాన్ని ధర్మక్షేత్రంగా దర్శింప చేసేందుకు
మానవ మస్తిష్కాన్ని మహిమాన్వితంగా తీర్చి దిద్దేందుకు

పేదవాడికి పైస లిచ్చినట్లు
అన్నార్తుల ఆకలి తీర్చినట్లు
గ్రహాల గమనాన్ని దారి మళ్ళించి
ఆగ్రహాలను సమర్థతతో నిగ్రహించి







నింగిని నేలకు దించి
వంగిన దయను, క్రుంగిన ధర్మాన్ని
నింగిపై నిండుగా నిలిపి
క్షామాన్ని మరపించి, క్షేమంతో మురిపించి
వైరుధ్యాలను అంతం చేసి, వైభవాలను ఆవిష్కరించేందుకు
అందరి చేతులకు గీతను పట్టించాలి.
గీతా జ్ఞానాన్ని బుద్ధి నిండా నింపాలి.

ఇదే తక్షణ కర్తవ్యం
విశ్వశాంతికి ఏకైక మార్గం.

ఇదే జరిగితే,
సూర్యోదయంతో విశ్వంలో తిమిరాలు తొలగినట్లు, గీతా జ్ఞానోదయంతో సమస్త ఉపద్రవాలు అంతరిస్తాయి. లోకంలో కళ్యాణ శోభ నిండు కుంటుంది.

## చైతన్య భగవద్గీత

ఏనాటి పుణ్యఫలమో
ఏ దివ్యాత్ముని కృపా వీక్షణమో
బాల్యం లోనే నా మనస్సు బాలగోపాలుని బడి కెళ్ళి కూర్చుంది. అక్షరాలు నేర్చింది, పాఠాలు విన్నది అక్కడే. మాట లొచ్చింది, పాట లొచ్చింది ఆ బడి లోనే.

'తండ్రీ! నీవు మహోన్నతమైన తండ్రివి. నేను అర్హత లేని బిడ్డను. ఆశ ఒక్కటే నా ఆస్తి. అదే నా అర్హత. పారిజాత సుమాలను పట్టుకున్న చేతులతో నమస్కరిస్తూ ఉంటాను. తులసీ దళములను పట్టుకున్న హస్తాలను జోడించి వందన మంటూ ఉంటాను. నీ మాట వింటూ బ్రతుకుతాను. నీ భాషను పట్టుకొనే శక్తి లేనివాణ్ణి. నీ భావాన్ని ముట్టుకొనే సామర్థ్యం లేనివాణ్ణి.' ఇదంతా నా చిన్ననాటి వేడుకోలు.

ఆ వేడుకోలు వెన్నుని చరణాల చెంతకు చేరుతుందని, తన వేడుకను ఆవిష్కరించే మహాకార్యంలో నన్ను వాడుకోవడం జరుగుతుందని నేను కలలో కూడా ఊహించ లేదు.

గీత తోనే చెలిమి చేశాను
గీతే నా కలిమి అని భావించాను
మనస్సు పట్టుకోలేక పోయినా
చేతులు గీతను విడిచి పెట్టేవి కావు.



అదొక సుదినం. శుభదినం
భగవద్వాణిపై గురి కుదిరింది
భగవద్గీతపై మది నిలిచింది.

యు ఇమం పరమం గుహ్యం మద్భక్తే ష్వభిధాస్యతి।
భక్తిం మయి పరాం కృత్వా మామే వైష్య త్యసంశయః॥
న చ తస్మా న్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
భవితా న చ మే తస్మా దన్యః ప్రియతరో భువి॥

ఈ గీతాశాస్త్రము అతి రహస్యము. దీనిని నా భక్తులకు ఉపదేశించే వాడు నాకు పరమ భక్తుడు అవుతాడు. నిస్సందేహంగా వాడు నన్నే పొందుతాడు.

అర్జునా! అతని కంటే ప్రియమైన వాడు మానవ ప్రపంచంలో మరొకడు
నేడు లేడు. మున్ముందు ఉండబోడు కూడా.



ఈ రెండు శ్లోకాలు గీతను సమాప్తం చేస్తూ
భగవంతుడు వినిపించిన అమూల్యమైన రత్నాలు
అవే నా పాలిటి రత్నాల గనులు
నన్ను సంపన్నుణ్ణి చేసిన రత్నరాశులు.

**గీతా మే పరమా విద్యా**
**బ్రహ్మరూపా న సంశయః**

భగవద్గీత ఒక్కటే నాకు శ్రేష్ఠమైన జ్ఞానము
గీత పరమేశ్వరుని స్వరూపము. సంశయం లేదు.

అంతే. ముక్కుపచ్చ లారని పూప వయస్సులో బుద్ధిలో భగవంతుని నింపుకొని, ఎవరి కొరకూ ఎదురు చూడకుండా గీతా ప్రచార భారాన్ని భుజాని కెత్తుకున్నాను.

శక్తి ఉండి ఆ కార్యానికి పూనుకోలేదు
భక్తి ఉందనే ధైర్యం వల్ల మానుకోలేదు.

కొండ మోసిన వాడే అండగా నిలిచాడు
సేవా పంటను దండిగా పండించాడు.

త్రికరణ శుద్ధిగా నమ్మి నడిచి నందుకు మాటిచ్చిన వాడు మాటను నిలబెట్టు కున్నాడు. నాలుగు దశాబ్దాలు దేశం నలు చెరగులా గీతను వినిపించే భాగ్యాన్ని అనుగ్రహించాడు. **ధన్యోఽస్మి భగవాన్! ధన్యోఽస్మి**

ఎన్నో గ్రంథాలు వ్రాశారు. గీతను వ్రాయ రెందుకని?
ఎంతో కాలంగా ఇదే భక్తులు నాపై సంధిస్తున్న ప్రశ్న.

వినతిని వినిపిస్తూనే ఉన్నా!
అనతి వస్తే తప్పక వ్రాస్తా! - ఇదే భక్తులకు నే నిచ్చిన సమాధానం.

ఆజ్ఞ అయింది. క్షణం ఆగకుండా శుభారంభం చేశా!
రచన ఊపందు కుంది. చిత్ర విచిత్రంగా, నిత్య నూతనంగా రూపు దిద్దుకుంటూ సాగింది.

అర్జునునికి బాహ్యంలో నిలబడి బోధించిన వాడు
నాకు మాత్రం లోపలే స్థిరపడి గుట్టు విప్పాడు.

తెలిసిందంతా వ్రాయలేక పోయాను. వ్రాయ గలిగిందంతా వ్రాశాను. తెలుసుకోవాలి - తరించాలి అని భావించే పుణ్యాత్ములకు మరొకటి తెలియ నవసరం లేకుండా వ్రాశాను.

శ్రమనే ఆహారంగా
పరిశ్రమనే పానీయంగా
నిరీక్షణే నిద్రగా భావించి







అనంత సహనంతో
నిరంతర మననంతో

విచిత్రంగా కదులుతూ
వినూత్నంగా కలలు కంటూ

నడకను మరచి
పరుగును వలచి

సూర్యుణ్ణి విడిచి
చంద్రుణ్ణి మరచి
దీప జ్వాలకే అంకితమై

కాలం తెలియకుండా
కాళ్ళు మడచి కూర్చుని

మాటలకు ప్రాణం పోస్తూ
వాక్యాలకు వన్నె లద్దుతూ

మది నంతా మాధవుని నింపుకొని
హృది నంతా గీతామాతను నిలుపుకొని

శంకరునికి కింకరుణ్ణై
వంకరలు లేకుండా
శంకలు కదలకుండా

రెండు వేల పుటలను కుప్పపోసి
నాలుగు సంపుటాల లోకి ఎత్తి నింపి
భక్తుల భుజాలకు తగిలిస్తున్నా!
అలా ఋషి ఋణాన్ని తీర్చుకుంటున్నా!

## నివేదన

**తత్తద్వస్తు స్వభావజ్ఞః**
**తత్ఫలం వేత్తి నాపరః,**

ఎవరికి ఏ వస్తు పరిజ్ఞాన ముందో
వారికే దాని ఫలం పూర్ణంగా తెలుస్తుంది.

భగవద్గీత ఏమిటో, ఏం చెబుతూ ఉందో, ఏ ఫలితాన్ని ప్రసాదిస్తూ ఉందో బ్రతుకునే సమర్పించుకొని అర్థం చేసుకున్నాను.

**గీతాసుగీతా కర్తవ్యా**
**కిమన్యైః శాస్త్ర సంగ్రహైః**

ఇతర శాస్త్రాల ప్రసక్తి ఎందుకు?
గీతను చక్కగా పఠిస్తే చాలు.

అనే హితవాక్యం యొక్క ప్రభావ మేమిటో జీవితంలో చూశాను
అందుకే, ఆరు పదులు నిండిన దశలో అనుభవాన్ని రంగరించి వ్రాశాను.

గీతకు ఎన్నో వ్యాఖ్యానాలు వచ్చాయి. వస్తున్నాయి. వస్తూనే ఉంటాయి.
ఎవరు ఎందుకు వ్రాశారో, వ్రాస్తున్నారో నాకు తెలియదు.

గీతను ప్రవచించడం వేరు. గీతను రచించడం వేరు
గీతను బోధించే వాళ్ళందరూ గీతను వ్రాయలేరు.

వినే వారికి అర్థమయ్యే లాగా బోధించడం బోధకు లందరికీ సాధ్యం కాదు
చదివే వారికి అర్థమయ్యే లాగా రచించడం కూడా రచయిత లందరికీ సాధ్యం కాదు.

మరొక అడుగు ముందు కేస్తే
గీత అర్థం కాని వాళ్ళు ఎలాగూ గీతను వ్రాయలేరు
గీతను అర్థం చేసుకున్న వాళ్ళందరూ కూడా గీతను వ్రాయ గలరని చెప్పలేము.

అందుచేతనే,
భగవద్గీతకు ఎన్ని వ్యాఖ్యానాలు వచ్చినా
వ్యాఖ్యానం అనగానే, శ్రీ శంకర భాష్యమే మనస్సులో మెదులుతుంది
అదే ప్రసన్నము. అదే గంభీరము. ప్రసన్న గంభీరము.

కొందరికి కొన్ని వ్యాఖ్యానాలు బాగుంటాయి
కొందరికి కొన్ని వ్యాఖ్యానాలు బాగుండవు
కొందరికి ఏవైనా బాగుంటాయి
కొందరికి బాగున్నవే బాగుంటాయి.

ఏది బాగు? ఏది ఓగు?
తెలిపి చెప్ప గలిగే దెవరు?

బాగు పడాలనే దృఢదీక్ష కలవారు
బాగేమిటో తెలుసు కుంటారు.

బాగును గ్రహించిన వారే
ఇతరులకు బాగును అనుగ్రహించ గలరు.

**తాదృశానాం దశాం తాం తాం**
**తాదృశా ఏవ జానతే!**

అలాంటి వారి స్థితిని
అలాంటి వారే తెలుసుకుంటారు.



## ఇది చైతన్య భగవద్గీత

నాకు తపః ఫలం
మీకు పుణ్య ఫలం





ఏదో సాదాగా చదివి ప్రక్కన పెట్టే గ్రంథం కాదు
అప్పుడప్పుడు, అక్కడక్కడ కొన్ని కొన్ని పుటలు ఎన్నుకొని చదివేది అసలే కాదు.

సాంతము సాదరంగా అధ్యయనం చేయవలసిన గ్రంథము
బుద్ధితో పాటు భక్తిని తోడు చేసుకొని చదువ వలసిన గ్రంథము.



*భక్తి రేవ ఏనం గమయతి*
*భక్తి రేవ ఏనం దర్శయతి*
*భక్తి వశః పురుషః*

భక్తి చేయి పట్టుకొని భగవంతుని వద్దకు నడిపిస్తుంది
భక్తి కళ్ళు తెరిపించి భగవంతుని చూపిస్తుంది
ఎందుకనో తెలుసా? భగవంతుడు భక్తికి వశుడు.

ఎవరి ఇంట్లో ఏదుందో, ఏది లేదో
నాకు మాత్రం ఏం తెలుసు?

## అన్ని ఇళ్ళల్లో గీత ఉండాలి

భగవంతుని దర్శించ డానికి ఆలయానికి వెళ్ళాలి. దేవాలయానికి వెళ్ళాలి
గీత మీ గృహంలో ఉంటే, మీ గృహమే గీతా మందిర మవుతుంది
గోవిందుడు గీత లోనే ఉన్నందున గోవింద మందిర మవుతుంది.

*గీతాశ్రయోఽ హం తిష్ఠామి*
*గీతా మే చోత్తమం గృహమ్!*

నేను గీతను ఆశ్రయించుకొని ఉంటాను. గీతే నా నివాస స్థానము
ఇది ఎవరో ఎవరికో చెప్పింది కాదు. భర్త భార్యకు చెప్పింది
అడిగింది ధరణి. తన చిరునామా ఎక్కడో చెప్పింది ధరణీపతి.
ఇది వరాహపురాణం లోని వార్త.

భూదేవి ప్రశ్నించింది అంటే భూలోక వాసు లందరి పక్షాన ప్రశ్నించిందని అర్థము
భూదేవికి చిరునామా నందించాడు అంటే భూలోక వాసు లందరికీ అందించాడని అర్థము.

గీత మన ఇంట్లో ఉంటే చాలు
మన ఇంటికి రమ్మని అచ్యుతుని ఆహ్వానించ నవసరం లేదు
మనందరము అచ్యుతుని ఇంటి లోనే ఆనందంగా ఉంటాము.



## గృహమే గుడి

గోవిందుని దర్శించాలని భావించే భక్తులకు
ఎన్ని గుళ్ళని నిర్మించ గలను?
గూళ్ళనే గుడులుగా మారిస్తే
ఎలా ఉంటుందని ఆలోచించాను.

ఇలా ఉంటుంది అనిపించింది
అదే చైతన్య భగవద్గీత.



## సర్వం సఫలం - సర్వం సంపూర్ణం

నా ఆశయం నెరవేరింది. నా ఏకైక వాంఛ తీరి పోయింది
నా బ్రతుకు సఫల మైంది. పురుషార్థం సిద్ధించింది.

చాలు. చాలు. చాలు.
భగవ దారాధన సమాప్త మైంది
భక్తులకు ప్రసాదం ప్రాప్తించింది.

మహాకృతి మహోజ్జ్వలంగా సమాప్త మైంది
కృతి కర్త ఎవరు? కృతి భర్త ఎవరు?

కృతి భర్త నేను కాదని మీకే తెలుసు
కృతి కర్తను నేను అనేది మీ భావన
కాదని చెప్పేందుకే చివరగా ఈ పాడి మాటలు.

కర్తను కాను అంటే పనిముట్టును అనుకుంటా రేమో!
పనిముట్టును కానే కాను; పనిని ముట్టుకున్నాను. అంతే.

### కర్తా బహిః అకర్తా_న్తః

బాహ్యానికి కర్తగా కనిపిస్తున్నా
ఆంతర్యంలో అకర్త గానే ఉన్నా!

కృతి భర్తే కృతి కర్త
కృతజ్ఞత చెప్పే ధైర్యం లేదు
ఐదు పది చేసి తల వంచుతున్నా!
అలాగే ఉంటావని విన్నవించు కుంటున్నా!
కృతార్థుణ్ణయ్యా నని వినమ్రుణ్ణై పలుకుతున్నా!

### మనసైన మాట

శతాధిక గ్రంథాలను ప్రచురించే అదృష్టానికి నోచుకుంది సుందర చైతన్యాశ్రమం. ఎంతో కాలంగా సర్వులూ ఎదురు చూచిన గ్రంథం చైతన్య భగవద్గీత కూడా ఎదలను అలరించేందుకు ఆవిర్భవించింది. ఎందరో ఎన్నో విధాలుగా ఈ కార్యక్రమాలలో వారి వారి సేవలను అందించి తృప్తి చెందారు. అందరికీ ఆశ్రమం ఋణపడి ఉంటుంది.

ఇక ప్రస్తుత విషయం
చైతన్య భగవద్గీత.

రెండు వేల పుటల గ్రంథాన్ని అచ్చు తప్పులు దిద్దుతూ, సవరించి సరి చేయడం సాధారణమైన కార్యం కాదు. బహు భారమైన ఈ కార్యాన్ని భుజాని కెత్తుకొని, రాత్రనక పగలనక ఓర్పుతో, నేర్పుతో నిర్వహించిన ఆశ్రమ





కమిటీ సభ్యురాలు శ్రీమతి సి.పద్మా మోహనరావు సేవలను మరచి చైతన్య భగవద్గీతా గ్రంథాన్ని నేను ఊహించ లేను. ఆమె కుటుంబ సభ్యు లందరినీ వాసుదేవ భగవానుడు సర్వదా బ్రోచు గాక! వారందరికీ నా వాత్సల్యపూర్వక ఆశీస్సులు.

ఈ గ్రంథమును దివారాత్రములు కంప్యూటర్‌కు అతుక్కుపోయి డి.టి.పి. చేసిన చి॥ కృష్ణప్రసాద్‌కు,
గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించిన చి॥ నాగబాబుకు నా ప్రేమ పూర్వక ఆశీస్సులు.

బాల్యం లోనే కదిలిన ప్రస్థానము. నాపై ఎందరి ప్రభావ ముందో నాకే తెలియదు. బాల్యం లోనే విశేషంగా గ్రంథ పఠనం చేశాను. అవి ఎంత గానో నన్ను ఉత్తేజ పరచాయి. ఎందరో మహాత్ముల జీవితాలు, బోధలు నన్ను ప్రభావితం చేశాయి. తనదైన శైలిలో సమాజం కూడా తన వంతు పాత్రను తాను నిర్వహించింది. విశేష గ్రంథ పరిచయం, అశేష జన సంసర్గం కలవాణ్ణి. పేరు పేరున ఎందరికి కృతజ్ఞతలు చెప్పేది? ఎన్ని గ్రంథాలను ఉటంకించేది? ఎలాగూ ఉండనే ఉంది మూలమంత్రం, 'అందరికీ వందనాలు'. దాని తోనే ప్రస్తుతానికి సరిపెట్టు కుంటున్నా.

చివరగా మీ అందరికీ
నా మనసైన మాట.

ఇలాంటి గ్రంథాలు అరుదుగా ఉంటాయి. దొరికి నపుడే దోచుకోవాలి. హృదయంలో దాచుకోవాలి. జీవించి నంత కాలం తోడుగా ఉండ వలసిన గ్రంథము. పుస్తకాన్ని పుస్తకంగా ఉంచకుండా, శ్రమించి మస్తకానికి పట్టించండి.

మన వద్ద ఉన్నది మనది కాదు
మన మనస్సు కెక్కిందే మనది.

సద్భావన సత్కార్యాన్ని రూపొందిస్తుంది
సత్కార్యం సత్ఫలితాన్ని ప్రసాదిస్తుంది.

పుణ్య ఫల విశేషంగా తీర్థపు గిన్నె పూజారి చేతికి వచ్చినట్లు, చైతన్య భగవద్గీత గ్రంథాన్ని అందించే అదృష్టం మమ్మల్ని వరించింది.

ఈ గ్రంథం మీది. మీతో ఉండ వలసింది
మీరు కొనండి. మరి కొందరి చేత కొనిపించండి.

మీరు శ్రద్ధతో చదవండి. ఇతరుల చేత చదివించండి
కానుకగా ఎవరి కైనా సమర్పిస్తారా? ఇంతకు మించిన అమూల్యమైన రత్నం ఎక్కడ దొరుకుతుంది?

సర్వేజనాః సుఖినో భవన్తు!

ప్రణవ ప్రేమలతో
గీతామాత సేవలో

ఆశ్రమం
16-12-2009

ॐ స్వామి సుందర చైతన్యానంద

# గీతా మాహాత్మ్యము

శ్లో॥ యత్ర గీతా విచారశ్చ
పఠనం పాఠనం శ్రుతమ్ ।
తత్రాహం నిశ్చితం పృథ్వి
నివసామి సదైవ హి ॥ 1

భూలక్ష్మీ! గీతా విచారము, గీతాధ్యయనము, గీతా ప్రవచనము, గీతా శ్రవణము - ఇవి ఎక్కడ జరుగుతూ ఉంటాయో అక్కడ నేను సదా నిశ్చయంగా ఉంటాను.

శ్లో॥ గీతాశ్రయోఽహం తిష్ఠామి
గీతా మే చోత్తమం గృహమ్ ।
గీతా జ్ఞాన ముపాశ్రిత్య
త్రీన్లోకా న్పాలయా మ్యహమ్ ॥ 2

గీత నాకు ఆశ్రయము. గీత నా దివ్యమైన మందిరము. భూదేవీ! గీతా జ్ఞానమును అనుసరించే నేను ముల్లోకాలను పాలిస్తూ ఉంటాను.

శ్లో॥ గీతా మే పరమా విద్యా
బ్రహ్మరూపా న సంశయః ।
అర్ధమాత్రాక్షరా నిత్యా
స్వనిర్వాచ్య పదాత్మికా ॥ 3

గీత నా ఉత్కృష్టమైన జ్ఞానము. అది బ్రహ్మస్వరూప జ్ఞానము. ఈ విషయంలో సందేహం వద్దు. అది అమాత్రా ప్రణవ స్వరూపము. అక్షరము; నిత్యము; అనిర్వాచ్యము.

శ్లో॥ చిదానన్దేన కృష్ణేన
ప్రోక్తా స్వముఖ తోఽర్జునమ్ ।
వేదత్రయీ పరానన్దా
తత్త్వార్థ జ్ఞాన మంజసా ॥ 4

చిదానందమూర్తి శ్రీకృష్ణ పరమాత్మ గీతను స్వయంగా అర్జునునికి బోధించాడు. గీత వేద స్వరూపము. పరమానంద రూపము. ఆశ్రయించిన వారికి తత్త్వసారాన్ని అనుగ్రహిస్తుంది.





శ్లో॥ గీతా శాస్త్ర మిదం పుణ్యం
యః పఠేత్ ప్రయతః పుమాన్ ।
విష్ణోః పద మవాప్నోతి
భయశోకాది వర్జితః ॥ 5

గీతాశాస్త్రము పుణ్యప్రదము. గీతాశాస్త్రమును శ్రద్ధతో అధ్యయనం చేయు వాడు భయశోకాలు తెలియని విష్ణుపదమును పొందుతాడు.

శ్లో॥ మల నిర్మోచనం పుంసాం
జల స్నానం దినే దినే ।
సకృ ద్గీతామ్భసి స్నానం
సంసార మల నాశనమ్ ॥ 6

నిత్యము జల స్నానం చేసే వారికి దేహ మాలిన్యము తొలగుతుంది. గీతా జ్ఞానజలంలో ఒక్కసారి మునిగితే చాలు. సంసార మాలిన్య మంతా తొలగి పోతుంది.

శ్లో॥ యః శృణోతి చ గీతార్థం
కీర్తయ త్యేవ యః పరమ్ ।
శ్రావయేచ్చ పరార్థం వై
స ప్రయాతి పరంపదమ్ ॥ 7

గీతార్థమును శ్రవణము చేయువాడు, దానిని ఇతరులకు వర్ణించి చెప్పేవాడు, గీత లోని మహోన్నతమైన భావాలను పరులకు వినిపించు వాడు పరమాత్మను పొందుతాడు.

శ్లో॥ సోపా నాష్టాదశై రేవ
భక్తి ముక్తి సముచ్ఛ్రితైః ।
క్రమశః చిత్తశుద్ధిః స్యాత్
ప్రేమ భక్త్యాది కర్మసు ॥ 8

గీతాశాస్త్రము భక్తి దాయకము, ముక్తి ప్రదాయకము. పద్దెనిమిది అధ్యాయములనే సోపానముల ద్వారా ప్రేమ, భక్తి మార్గాలలో పయనించే వారికి చిత్తశుద్ధి ప్రాప్తిస్తుంది.

శ్లో॥ యే శృణ్వన్తి పఠన్త్యేవ
గీతాశాస్త్ర మహర్నిశమ్ ।
న తే వై మానుషా జ్ఞేయా
దేవ రూపా న సంశయః ॥ 9

గీతాశాస్త్రాన్ని అహర్నిశము శ్రవణం చేసే వారిని, అధ్యయనం చేసే వారిని మానవులని భావించ కూడదు. వారు మానవ రూపంలో ఉన్న దేవతలే. ఈ విషయంలో సందేహము లేదు.

శ్లో॥ భారతామృత సర్వస్వం
విష్ణో ర్వక్త్రా ద్వినిస్సృతమ్ ।
గీతా గంగోదకం పీత్వా
పునర్జన్మ న విద్యతే ॥ 10

విష్ణుదేవుని ముఖము నుండి వెలువడిన గీతాశాస్త్రము భారతామృత సర్వస్వము. గీతా గంగోదకాన్ని పానం చేసే వారికి పునర్జన్మ ప్రాప్తించదు *(మోక్షం సిద్ధిస్తుంది).*

శ్లో॥ శత పుస్తక దానం చ
గీతాయాః ప్రకరోతి యః ।
స యాతి బ్రహ్మసదనం
పునరావృత్తి దుర్లభమ్ ॥ 11

వంద గీతా పుస్తకాలను వితరణ చేయువాడు పునర్జన్మ లేని బ్రహ్మపదమును పొందుతాడు *(జ్ఞానదాన ప్రాశస్త్యమును తెలియ చెప్పడమే ప్రధాన విషయం).*

శ్లో॥ ఏత న్మాహాత్మ్య సంయుక్తం
గీతాపాఠం కరోతి యః ।
శ్రద్ధయా యః శృణో త్యేవ
పరమాం గతి మాప్నుయాత్ ॥ 12

ఈ మహాత్మ్యమును తెలుసుకొని గీతను అధ్యయనము చేయువాడు ఉత్కృష్టమైన గతిని పొందుతాడు.





# చైతన్య భగవద్గీత

## ధ్యాన శ్లోకములు



### గీతా ధ్యానము

శ్లో॥ ఓం పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్ ।
అద్వై తామృత వర్షిణీం భగవతీ మష్టాద శాధ్యాయినీ
మంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్ ॥ 1

| | | | |
|---|---|---|---|
| ఓం | = ఓం | అద్వైతామృత వర్షిణీం | = అద్వైత సుధను వర్షించునది |
| భగవతా | = భగవంతుడైన | అష్టాదశాధ్యాయినీం | = పదునెనిమిది అధ్యాయాలు కలది |
| నారాయణేన | = నారాయణునిచే | భవద్వేషిణీం | = సంసార జీవనమును రూపు మాపునది |
| స్వయం | = స్వయముగా | | |
| పార్థాయ | = అర్జునుని కొరకు | భగవతీం | = భగవ త్స్వరూపిణి |
| ప్రతిబోధితాం | = బోధింప బడినది | అంబ | = అమ్మా |
| పురాణమునినా | = సనాతన మహర్షి యైన | భగవద్గీతే | = ఓ భగవద్గీతా! |
| వ్యాసేన | = వ్యాసునిచే | త్వాం | = నిన్ను |
| మధ్యే మహాభారతం | = మహాభారతము యొక్క నడుమ | అను సందధామి | = పదేపదే ధ్యానిస్తున్నాను. |
| గ్రథితాం | = కూర్చబడింది | | |

**ఓం! తల్లీ! భగవతీ! సంసార నాశినీ! అష్టాదశాధ్యాయినీ! అద్వైతామృత వర్షిణీ! సాక్షాత్తు భగవంతుడైన నారాయణమూర్తిచే అర్జునుని కొరకు బోధింప బడిన జననీ! సనాతన మహర్షి శ్రీ వేదవ్యాసమునిచే రచింప బడి, మహాభారతము మధ్య శోభించే భారతీ! భగవద్గీతా మాతా! అమ్మా! నిన్ను పదే పదే ధ్యానిస్తున్నాను.**

### వ్యాఖ్య

**భవము - భవ్యము**

అమ్మా! నేను - నీ బిడ్డను. ముద్దుబిడ్డను కాలేక పోయిన మొద్దును. దద్దమ్మను. గతంలో నీ మాట వినని నేరానికి పాపపు మూటల్ని మోస్తున్నాను. సంసార కారాగృహంలో మగ్గుతున్నాను. స్థిరత్వం లేని ప్రపంచంలో ప్రియత్వానికి అర్థం లేదని గ్రహించలేక పోయాను. బంతి లాగా దొర్లి పోయేది బాల్యం. పక్షిలా ఎగిరి పోతుంది యవ్వనం. వాగులా ముందుకు సాగి జనన మరణ సంసార సాగరంలో పడిపోతుంది వృద్ధాప్యం. తారాడుతూ, జీరాడుతూ జీవు లందరు మృత్యుకూపం లోకి జారి పోయేవారే. వర్షాకాల మేఘం లాగా కలిమి కారి పోయేదే *(అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః).*

ఆపదల మధ్య అల్లాడు తున్నాను. నిరాశతో క్షణక్షణం నీరసించి పోతున్నాను. ఏది చేసినా గండమే ఎదు రవుతోంది. ఏది ఆలోచించినా సుడిగుండమై ముంచేస్తోంది. ఒక వైపు ప్రారబ్ధం గుండెలపై పిడుగులు

పడేస్తోంది. మరో వైపు ప్రాయము పశ్చిమంగా వాలి పోతోంది. అమ్మా! భవద్వేషిణీ! నన్ను భవము నుండి బయట పడేయి తల్లీ! *( భగవద్గీతే భవద్వేషిణీమ్ ).*

**అమ్మ పిలుపు - అయ్య పలుకు**

అమ్మా! నువ్వు తల్లివి. తల్లియే గదా తొల్లి. అందుకే తొలి దండము మళ్ళీ మళ్ళీ నీకే పెడుతున్నాను. తొలుత మళ్ళీ మళ్ళీ నిన్నే స్మరిస్తున్నాను *( త్వాం అనుసందధామి ).* నీ కన్నబిడ్డను. నిన్ను కనే భాగ్యాన్ని ప్రసాదించ మని వేడుకొంటున్నాను. నిన్ను దర్శించుకొనే అదృష్టాన్ని అనుగ్రహించ మని పదే పదే అర్థిస్తున్నాను. ప్రార్థిస్తున్నాను.

చెప్పేవాడు భగవంతుడు. చెప్పబడేది భగవతి. వినిపించే వాడు సమగ్రమైన జ్ఞానస్వరూపుడు. వినపడేది సమగ్ర మైన జ్ఞానము. భగవానుడు భగవతిని భవ్యంగా వినిపిస్తే, భగవతి భగవానుని వైభవాన్ని దివ్యంగా దర్శింప చేస్తూ ఉంది.

తల్లి వైభవాన్ని సంపూర్ణంగా తండ్రి నుండే విన గలం *( భగవతా నారాయణేన ).* తండ్రి ప్రాభవాన్ని సమగ్రంగా తల్లి చెబితేనే అర్థం చేసుకోగలం *( భగవతీం అష్టాదశాధ్యాయినీం అంబ ).*

సర్వమూ వేద నారాయణుడే. వేదము తల్లి. నారాయణుడు తండ్రి. వేదము, నారాయణుడు వేరు కారు. ఈశ్వరుడు, ఈశ్వర జ్ఞానము వేరు కాదు. ఈశ్వరుడు జ్ఞానస్వరూపుడు. జ్ఞానము ఈశ్వరమయము. కనుక వేదము, వేదనారాయణుడు వేరు కారు. ఒక్కరే. రెండు కాని ఒక్క సత్యమై భాసిస్తున్నారు. అది ద్వైతం కాదు. అద్వైతం. ద్వైతం మృతం. అద్వైతం అమృతం. అమృతం మరణాన్ని దూరం చేస్తుంది. వేదమాత కురిపించే అద్వైతామృతం జనన మరణాలను మాయం చేస్తుంది *( అద్వైతామృత వర్షిణీం ).*

అమ్మా! అందుకే నిన్ను మళ్ళీ మళ్ళీ స్మరిస్తున్నాను. అమ్మ పిలుపుకై నిరీక్షిస్తున్నాను. అయ్య పలుకుకై ఎదురు చూస్తున్నాను. ఎద నిండా తల్లిదండ్రుల్ని నిలుపుకొని ప్రార్థిస్తున్నాను. ఒక్క ఒరలో ఇద్దరు ఇమడరు అంటావా! 'తల్లిదండ్రులు' అని రెండుగా వినిపిస్తున్నా, సమాసం ఒక్కటే కదా తల్లీ! తల్లి లేకుండా తండ్రి ఎలా ఉంటాడు? తండ్రి లేకుండా తల్లి ఎలా ఉంటుంది? జ్ఞానం లేకుండా ఈశ్వరుడెలా ఉంటాడు? ఈశ్వరునికి దూరంగా ఈశ్వరజ్ఞానం ఎలా ఉంటుంది? వేదమే నారాయణుడు. నారాయణుడే వేదము. అదే వేదనారాయణ శబ్దము.

అమ్మా! భగవతీ! నా అదృష్టం చూశావా! అమ్మ పిలుపును అందుకుంటున్నా! అదీ అయ్య పలుకులో వినబోతున్నా! ఇరువురు ఒకటే అనే అద్వైత జ్ఞానసుధను పానం చేయబోతున్నా! ఒకరిలో మరొకరిని దర్శించుకొని తృప్తి చెందబోతున్నా! ఒకరి అడుగులో మరొకరు అడుగు వేసుకుంటూ నడిచే మీ అద్భుత చరణాలకు వంగి వంగి వందనాలు అర్పించుకోబోతున్నా! మీ పాదాలలో అద్వైత ముద్రలను చూడబోతున్నా!

అదెలా సాధ్యం అంటావా? మీరు నా తల్లిదండ్రులు కనుక. 'తల్లిదండ్రులు' అనే మాట ద్వంద్వ సమాసము అని కూడా తెలియని మందమతిని కాను లేమ్మా!

ఒక వైపు ద్వంద్వం అంటావు. మరో వైపు ఏక మంటావు. ఏమిటి దంతా? అని ప్రశ్నిస్తున్నావా? మీ ఇద్దరి స్వరూపం అదే నని నాకు తెలిసి పోయింది గామ్మా! ఎలా తెలిసిం దంటావా తల్లీ? తండ్రి చెబితేనే తెలిసింది.

ద్వంద్వ సమాసము నేనే అన్నాడు గోవిందుడు *( ద్వంద్వః సామాసికస్య అహమేవ ).* అమ్మా! ద్వంద్వ సమాసము ఉభయ పద ప్రధానం కదా! రెండు పదాలకు సమానార్థమే కదా! ఈ ద్వంద్వ సమాస రహస్యంతో





మీ ఇద్దరి రహస్యం నాకు తెలిసి పోయింది. అయినా, ద్వంద్వం అనే పదానికి 'రహస్యం' అనే అర్థం కూడా ఉంది కదమ్మా! అంతేకాదు, ఈ రహస్యాన్ని వినిపించిన మువ్వల వాని చరణం కదిలిన శ్లోకం కూడా పదవ అధ్యాయం 33 వ శ్లోకమే. మూడు మూడు కనిపిస్తున్నాయి చూడు. అక్కడ కూడా రెండు గానే కనిపిస్తున్నాయి. రెండైనా, మూడైనా ఒక్కటే అనే సత్యాన్ని వినిపించడమే కదా ఇందులోని రహస్యం!

వేద నారాయణునిలో వేదము, నారాయణుడు కలిసే ఉన్నారు. భగవద్గీతలో భగవంతుడు, భగవతి కలిసే ఉన్నారు. ఒకరు ఉంటే రెండవ వారు ఉన్నట్లే. తెలియని వారికి ఇద్దరూ ఉన్నా లేనట్లే. లేదా ఇద్దరూ వేరుగా ఉన్నట్లే. వేదమాత వేద పురుషునికి దూరంగా ఉంటుందని ఎలా ఊహిస్తారో నా కైతే అర్థం కాదు. గీతను గోవిందునికి ఎలా దూరం చేస్తారో నా బుద్ధి కైతే చిక్కదు. రెండిటిని పట్టుకొని వ్రేలాడే ప్రబుద్ధులకు కనువిప్పు కలిగించాలని అభిప్రాయపడ్డా డేమో కాళిదాస మహాకవి, తన 'రఘువంశం' కావ్యంలో దిలీపుని ధర్మపత్ని సుదక్షిణాదేవి నందినీ ధేనువును అనుసరించి నడుస్తున్న సందర్భంలో ***శ్రుతే రివార్థం స్మృతి రన్వగచ్ఛేత్*** - 'శ్రుతిని అనుసరించే స్మృతి వలె ధేనువును అనుగమిస్తూ ఉంది' అన్నాడు. ఈ సత్యం అర్థమైతే గీతామాత ఎవరో కాదు శ్రుతిమాతే. వాసుదేవుడు ఎవరో కాదు, నారాయణుడే. వేదనారాయణుడే.

**శ్రేష్ఠుడైన శ్రోత**

వినడం ఎవరి కైనా సాధ్యమే. శ్రవణం కొందరికే సొంతం. వినడానికి చెవులుంటే చాలు. శ్రవణానికి మనస్సు తోడు కావాలి. అది కూడా మామూలు మనసు కాదు. సంస్కరింప బడిన మనసై ఉండాలి. శుద్ధి పడిన బుద్ధి మాత్రమే శ్రవణం చేసి సిద్ధిని పొందుతుంది. అలాంటి పవిత్రమైన బుద్ధి గల మహాత్ముడు అర్జునుడు. సాక్షాత్తు నారాయణుడైన వాసుదేవునికి, మహాత్ముడైన అర్జునునికి మధ్య సంవాద రూపంలో సాగిన గీతాబోధను తాను ఆలకించినట్లు సంజయుడు గీతను సమాప్తం చేస్తూ చెబుతాడు. అర్జునుణ్ణి మహాత్ముడని సంజయుడు కీర్తించడమే శ్రోతగా అర్జునుని శ్రేష్ఠత్వానికి అద్దం పడుతూ ఉంది.

అర్జునుడు పుణ్య పురుషుడు. ధర్మాత్ముడు. భగవద్భక్తుడు. అసూయ లేని వాడు. అధర్మాన్ని అంగీకరించని ధీమంతుడు. అట్టి అర్జునుని నిమిత్తంగా చేసుకొని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతను లోకానికి అందించాడు. బోధించింది పార్థుని కొరకే అయినా యావత్ ప్రపంచం లబ్ధిని పొందింది. పొందుతూ ఉంది.

**వ్యాసుని వ్యాసంగము**

నరుడైన అర్జునునికి నారాయణమూర్తి స్వయంగా బోధించిన జ్ఞానబోధను గ్రంథస్థం చెయ్యడం సామాన్యులకు సాధ్యమా? అందుకే నారాయణ స్వరూపుడు, వేద సంస్కర్త అయిన వ్యాస భగవానుడే రచయిత అయ్యాడు. అచ్యుతుని అమర సందేశాన్ని భావి తరాలకు అందించే పవిత్ర కార్యాన్ని భుజాని కెత్తుకున్నాడు. దేహానికి గుండె లాగా మహాభారతం మధ్య భీష్మపర్వంలో గీతా ప్రదీపాన్ని ఉంచాడు ***(వ్యాసేన గ్రథితాం పురాణ మునినా మధ్యే మహాభారతమ్).***

వేదాలు అనంతములు *(అనంతా వై వేదాః).* వేదాలను సులభతరం చెయ్యాలని సంకల్పించి, అనంత మైన వేదాలను నాలుగు భాగాలుగా విభజించి, తమ శిష్యులైన పైల, జైమిని, సుమంత, వైశంపాయనుల సహాయంతో విస్తృత పరచాడు శ్రీ వేదవ్యాస మహర్షి. గహన మైన వేద విషయాలను సామాన్య జనులకు అర్థమయ్యే రీతిలో పద్దెనిమిది పురాణాలను రచించి పురాణముని అయ్యాడు. వాటిని ప్రచారం చెయ్యమని సూత మహర్షిని ఆశీర్వదించాడు.

వేద విజ్ఞాన వ్యాప్తికి పాటు పడిన మహానుభావుడు శ్రీ వేదవ్యాస మహర్షి గీతకు వ్యవహర్త కావడం మన

అదృష్టం. కురుక్షేత్ర పుణ్యభూమిలో వాసుదేవుడు కురిపించిన అద్వైత అమృత ధారలను భగవద్గీత అనే సువర్ణ భాండంలో నింపి, ప్రపంచానికి కడుపారా త్రాగించి, తరింప చేసిన వ్యాసమూర్తికి జగతి జోహారు లర్పిస్తోంది.

*జయతి పరాశర సూనుః సత్యవతీ*
*హృదయ నందనో వ్యాసః*
*యస్యాஉస్య కమల గళితం*
*వాఙ్మయ మమృతం జగత్ పిబతి ॥*

ఏ మహాత్ముని ముఖపద్మము నుండి జాలువారిన వాఙ్మయ పీయూషాన్ని (గీతామృతాన్ని) సమస్త ప్రపంచము పానం చేస్తూ ఉందో, పరాశర పుత్రుడు, సత్యవతీ నందనుడు అయిన అట్టి వ్యాసమహర్షికి జయము! జయము!

పిలిస్తే పలికేది తల్లి. బిడ్డ అవసరాల్ని తీర్చేది తల్లి. గీతామాత కూడా అమ్మ లాగా *(అంబ)* మన ఆర్తనాదాల్ని వింటుంది. అపాయాలను తొలగిస్తుంది. అవసరాలను తీర్చి అక్కున చేర్చుకుంటుంది. భవ సాగరంలో మునిగి పోకుండా రక్షిస్తుంది *(భవద్వేషిణీమ్)*. అమృతత్వాన్ని ప్రసాదిస్తుంది *(అద్వైతామృత వర్షిణీం)*. అందుకే, జన్మ నిచ్చే తల్లులు ఎందరున్నా, జన్మను కడతేర్చే తల్లి గీతామాత ఒక్కతే అనే ప్రగాఢ విశ్వాసంతో, అకుంఠిత భక్తి శ్రద్ధలతో గీతామాతకు పదే పదే నమస్కరిస్తున్నా. ఆమె చరణ కమలాలను అచంచల భక్తితో హృదయంలో ధ్యానిస్తున్నా.

*త్వమేవ సంధ్యా గాయత్రీ*
*సావిత్రీ చ సరస్వతీ*
*గీర్వాణ జ్ఞాన సార రూపిణీ*
*చైతన్య భగవతీ వాగ్దేవి భారతి*
*శారదాం! విశారదాం!*
*నమామి శుభదాం*
*బుద్ధి ప్రదాం శారదాం ॥ శారదాం ॥*

అని గీతామాతను చైతన్యగీతంతో స్తుతిస్తూ, తల్లి పద సరోజాలను హృదయంలో స్థిరంగా నిలుపుకొని ధన్యుల మయ్యెదము గాక!

## వ్యాస స్తుతి

**నమోస్తు తే వ్యాస విశాలబుద్ధే ఫుల్లారవిన్దాయత పత్రనేత్ర ।**
**యేన త్వయా భారత తైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥ 2**

| | | | |
|---|---|---|---|
| వ్యాస | = ఓ వ్యాసమహర్షీ! | జ్ఞానమయః | = జ్ఞానరూపమైన |
| విశాలబుద్ధే | = విశాలమైన బుద్ధి కలవాడా! | ప్రదీపః | = దివ్యదీపము |
| ఫుల్లారవిందాయత పత్ర నేత్ర | = వికసించిన పద్మపురేకుల వంటి కన్నులు కలవాడా! | ప్రజ్వాలితః | = చక్కగా వెలిగించ బడింది |
| యేన | = యే | తే | = నీకు |
| త్వయా | = నీ చేత | నమః అస్తు | = నమస్కారములు |
| భారత తైలపూర్ణః | = మహాభారత మనే తైలముచే నిండిన | | |





**ఓ వ్యాసమహర్షీ! విశాల హృదయా! వికసిత సరసిజ దళ నయనా! మహాభారత మనే తైలమును నింపి దివ్యమైన జ్ఞాన దీపమును వెలిగించావు. నీకు ప్రణామములు.**

**వ్యాఖ్య**

ఆర్షధర్మ సంస్కృతిలో వ్యాసునిది సమున్నత స్థానం. మహర్షులలో అగ్రతాంబూలం ఆయనిదే. అద్భుత ప్రజ్ఞానిధి. అనంత జ్ఞానజ్యోతి. ఆయన విశాలబుద్ధి ప్రపంచా న్నంతా స్పృశించింది. విశ్వమంతా ఆయన బుద్ధిలో ఇమిడి పోయింది. విశ్వ మెంత విశాలమో, ఆ మహాత్ముని హృదయం కూడా అంత విశాలము ***(వ్యాస విశాల బుద్ధే)***.

ఆయన కలానికి హద్దులు లేవు. కవు లందరికీ ఆయన స్ఫూర్తి. కళ లన్నిటికీ ఆయనే దీప్తి. పర్వతాలను పలకరించే టప్పుడు పర్వత మంత ఎత్తు నిలబడతాడు. జంతువుల్ని నిలదీసి భాషిస్తాడు. గువ్వలతో విహరిస్తూ వాటితో గుసగుస లాడుతాడు. నదులతో కలిసి నడుస్తాడు. కాలంతో కరచాలనం చేస్తాడు.

బుద్ధి గల వారు, వారి బుద్ధిని స్వార్థానికి వినియోగించు కుంటారు. బుద్ధి నైపుణ్యంతో వ్యాపారాలు చేసి సంపదలు ఆర్జిస్తారు. ఆస్తుల్ని ప్రోగు చేసుకుంటారు. భాగ్యాలను సంపాదించుకొని భోగాలలో తుల తూగుతారు.

విశాలబుద్ధి గల వ్యాసమహర్షి తన జ్ఞానాన్ని స్వార్థానికి ఉపయోగించుకో లేదు. పరానుగ్రహార్థం వినియోగించాడు. లోక సంగ్రహానికి ఉపయోగించాడు. ఆర్తుల కన్నీళ్ళు తుడిచాడు. పగిలిన హృదయాలను అతికించాడు. అజ్ఞానులను ఉద్ధరించాడు. సమాజాన్ని విజ్ఞాన తోరణాలతో అలంకరించాడు.

వేద కమలాన్ని వికసింప చేసి వేదాబ్జ భాస్కరు డయ్యాడు. సూర్యుని కిరణాలు సోకగానే కమలము వికసించి, మధుర పరిమళాలను వెద జల్లునట్లు, వ్యాస భగవానుని దృష్టి పడగానే వేద కమలము విరబూసి, విజ్ఞాన సుగంధాలను వెదజల్లింది. అందుకే ఆయన విప్పారిన సరసిజ నయనుడు ***(ఫుల్లార విందాయత పత్ర నేత్ర!)***.

విస్తృత శాస్త్ర విషయ పరిజ్ఞానము కలవాడు కనుక విశాలబుద్ధి కలవాడు ***(వ్యాస విశాలబుద్ధే)***. పద్మనేత్రుడు అంటే జ్ఞాన నేత్రము కలవాడు అని అర్థము. అదే బ్రహ్మ నిష్ఠత్వము ***(ఫుల్లార విందాయత పత్ర నేత్ర)***. కనుక వ్యాస భగవానుడు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడు. ఆచార్యులకు ఆచార్యుడు. ఆర్ష విజ్ఞాన దీపమును వెలిగించి, ఎందరో ముముక్షువులకు ముక్తి మార్గాన్ని సుస్పష్టం చేశాడు. ఆయన ముట్టని తాత్త్విక విషయం లేదు. అందుచేతనే **వ్యాసోచ్ఛిష్టం జగత్సర్వం** - వ్యాసుడు చవి చూడని విషయమే లేదని జ్ఞానులు కీర్తించారు.

### గీతా జ్ఞాన ధనం - భారతమే ఇంధనం

భారతీయ సంస్కృతిలో మహాభారతానికి ఒక విశిష్ట స్థానం ఉంది. అందుకే, భారతం పంచమ వేదంగా సమున్నత స్థాయిలో నిలిచింది. వేదము ఎలా సంపూర్ణమో, వేదవ్యాస విరచితమైన మహాభారతం కూడా అలా సమగ్ర స్థాయిలో సాక్షాత్కరించింది.

**యది హాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్**

మహాభారతంలో ఏదయితే ఉందో, అది వేరొక చోట ఉండ వచ్చు. కాని, మహాభారతంలో ఏదయితే లేదో అది మరొక చోట ఉండదు అని వ్యాసుడే రచించాడు. అదే మహాభారత వైభవం.

భారతంలో నీతి ఉంది. ధర్మం ఉంది. అభ్యుదయం ఉంది. నిశ్శ్రేయస ఉంది. అందుకే అది మహాభారతం. వ్యాసుని అద్భుత అపూర్వ సృష్టి అది ఆయనకే సరి పోయింది. వ్యాసుడు నిర్వహించిన

కార్యాలు అన్యులు సాధించ లేనివి. మహత్తర మైన ఆ కార్యాలకు సంపూర్ణ జ్ఞానం ఉండాలి. అద్భుత మైన త్యాగనిరతి కావాలి. అమోఘ సేవాసక్తి ఉండాలి. అవన్నీ పుష్కలంగా ఉండటం చేత వ్యాసమహర్షి అద్భుత కార్యాలను ఆవిష్కరించి చూపాడు. మహాభారత తైలాన్ని నింపి, సర్వ లోకాలకు, సమస్త దేశాలకు, సర్వ కాలాలకు, సమస్త మానవాళికి హితం చేసే గీతా జ్ఞాన ప్రదీపాన్ని వెలిగించి ఇచ్చాడు *( యేన త్వయా భారత తైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః )*

భవరోగమును పోగొట్టే దివ్యౌషధము భగవద్గీత. సంసారము రోగ మైతే, సంసారానికి కారణ మైన అజ్ఞానమే రోగ కారణము. కారణము ఉన్నంత వరకు కార్యము ఉంటుంది. కార్యరూప సంసారము తొలగాలి అంటే సంసార కారణమైన అజ్ఞానము అంతం కావాలి.

అజ్ఞానము అంటే చీకటి. చీకటిలో ఏది ఏమిటో అర్థం కానట్లు, అజ్ఞాన తిమిరాలు అలుముకున్నపుడు వివేకము కూడా ప్రకాశించదు. చీకటి తొలగాలి అంటే వెలుగు రావాలి. అజ్ఞాన తిమిరాలు అదృశ్యం కావాలి అంటే జ్ఞాన వెలుగులు ప్రసరించాలి. అదే గీతాజ్ఞాన ప్రకాశము. అట్టి గీతా ప్రదీపాన్ని వెలిగించి శోకార్తుల తలరాతలు మార్చిన వ్యాస భగవానునికి నమస్కారము *(నమోఽ స్తు).*

**ప్రపన్న పారిజాతాయ తోత్రవే త్రైకపాణయే ।**
**జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృత దుహే నమః ॥** 3

| | | | |
|---|---|---|---|
| ప్రపన్న పారిజాతాయ | = శరణాగతులకు కల్పవృక్షమైన వానికి | గీతామృత దుహే | = గీతామృతమును పితికిన వానికి |
| తోత్రవేత్ర ఏకపాణయే | = కొరడాను ఒక చేతి యందు కలిగిన వానికి | కృష్ణాయ | = శ్రీకృష్ణునికి |
| జ్ఞానముద్రాయ | = చిన్ముద్రను ధరించిన వానికి | నమః | = నమస్సులు |

**శరణాగతులకు కల్పతరువు వంటి వాడు, ఒక చేతి యందు మునికోలను పట్టుకొని, మరియొక చేతితో జ్ఞానముద్రను ప్రదర్శించు వాడు, గీతామృతమును పితికిన వాడు, శ్రీకృష్ణ దేవునకు ప్రణామములు.**

**వ్యాఖ్య**

తరువులు కరువులు తీర్చ వచ్చు. బ్రతుకు తెరువును మార్చలేవు. ఛాయను ప్రసాదించ వచ్చు. మాయను తొలగించ లేవు. ఏ తరువు ఆ ఫలాలనే ఇస్తుంది. కాని కల్పతరువు కోరిన వన్నీ ఇస్తుంది. కల్పతరువు నీడలో కరువులు తీరుతాయి. బరువులు దిగుతాయి. కాని, అజ్ఞానాన్ని తొలగించి మోక్షాన్ని ప్రసాదించడం కల్పతరువుకు కూడా సాధ్యం కాదు. అది ఒక్క పరమేశ్వరునికే సాధ్యం.

స్వర్గం లోని కల్పతరువు కోరికల్ని తీర్చుతుంది. గోవింద కల్పతరువు కోరికలే లేకుండా చేస్తుంది. ఆశ్రితులను ఆప్తకాముల్ని చేస్తుంది. అంటే, సమస్త కోరికలు తీరి పోతాయి కనుక ఇక ఏ కోరికలు ఉండవు అని అర్థము. అదే మోక్షము. ***మోక్ష మిచ్ఛేత్ జనార్దనాత్*** - మోక్షాన్ని ప్రసాదించే వాడు జనార్దనుడు. భక్తుల పాలిటి కల్పవృక్షము. భక్త పారిజాతము.

ఆ మహాత్ముని సమీపించిన వారందరూ సద్గతిని పొంది తరించారు. పరమాత్మ స్మరణం మరణాన్ని నివారిస్తుంది. అశుభాన్ని అంతం చేస్తుంది. అజ్ఞానాన్ని నిర్మూలిస్తుంది. అజ్ఞానం లేని చోట శోకమోహాదు లుండవు. దుఃఖం దరి చేరదు. ఆనందం దూరం కాదు.

భేదం చూడకుండా నది అందరినీ చల్లబరుస్తుంది. తేడాలు లేకుండా గాలి అందరికీ హాయి నిస్తుంది.





ఈ ప్రేమల్ని, త్యాగాల్ని ప్రకృతిలో ఆవిష్కరించిన పరమాత్మ, ఆశ్రయించిన వారిని తారతమ్యాలు చూడకుండా తరింప చేస్తాడు.

నిరుపేద అయిన కుచేలుని ఆదుకున్నాడు. త్రివక్ర అయిన కుబ్జను కనికరించాడు. దారుణ మైన పరిస్థితి నుండి ద్రౌపదిని రక్షించాడు. అమాయకులైన గోపికలను ఉద్ధరించాడు. సుదాముణ్ణి అనుగ్రహించాడు. అక్రూరునికి యమునా జలాలలో దర్శన మిచ్చాడు. ఆవులకు ఆనందాన్ని పంచాడు. కోతుల్ని కరుణతో చూశాడు. గుఱ్ఱాలకు కరస్పర్శతో హాయిని ప్రసాదించాడు. అన్నం పెట్టిన విప్ర స్త్రీలకు అమృతాన్ని అనుగ్రహించాడు. పాలిచ్చిన తల్లికీ మోక్షమే. విష మిచ్చిన రాక్షసికీ మోక్షమే. పిడికెడు అటుకు లిచ్చినా మోక్షమే. అరటితొక్కలు అర్పించినా మోక్షమే. పారము తెలియని ఆ ప్రేమ సాగరంలో మునక వేసిన వారందరూ తరించి పోయారు. చేరని వారు చెడిపోయా రేమో గాని, ఆశ్రయించిన వారందరూ ఆనంద స్వరూపు లయ్యారు. అమృత స్వరూపు లయ్యారు.

ధర్మాచరణమును నేర్పి వానరులను కూడా నరులను చేసేందుకు రామావతారం వస్తే, జ్ఞానప్రేమలను పంచి నరుల్ని నారాయణులుగా మార్చేందుకు కృష్ణావతారం వచ్చింది. అందుకే మునికోలతో, చిన్ముద్రతో శ్రీకృష్ణుడు చిద్విలాసంగా దర్శన మిస్తాడు.

**జగన్మోహనం**

శ్రీకృష్ణ పరమాత్మ ఒక చేతిలో వేత్రమును ధరించి ఉన్నాడు. 'వేత్రము' అంటే పశువులను తోలే ముల్లుకర్ర అని అర్థము. వెదురు కర్ర అని కూడా అర్థము. గుఱ్ఱాలను తోలే కొరడా, లేదా మునికోల అని కూడా చెబుతారు.

గోవులను మేపు నపుడు బాలకృష్ణుని చేతిలో ఒక కర్ర ఉండేది. దారి తప్పే గోవుల్ని దారి మళ్ళించడానికి అది ఉపయోగ పడేది. ఆనాడు పశువుల్ని దారి మళ్ళించినట్లే, మానవుల హృదయాలలో నిక్షిప్తమై ఉన్న పశు ప్రవృత్తుల్ని కూడా సదా దారి మళ్ళించి సంస్కరిస్తాడు కనుక చేతిలో వేత్రమును ధరిస్తాడు.

రథంలో ఆసీనమై నపుడు పార్థసారథి చేతిలో మునికోల ఉంటుంది. మునికోలను ఊపుతూ అశ్వాలను అదుపులో పెడుతూ ఉంటాడు. అలాగే ఆశ్రితులైన వారి మనస్సులలో చెలరేగే అరిషడ్వర్గాలను అదుపులో ఉంచి ఆశీర్వదిస్తూ ఉంటాడు.

ఇక రెండవ చేతి ద్వారా జ్ఞానముద్రను ప్రదర్శిస్తాడు. చేతి వ్రేళ్ళ ద్వారా ప్రకటించే తాత్త్విక సంజ్ఞా ప్రదర్శనమే జ్ఞానముద్ర, లేక చిన్ముద్ర. అరచేతిని ముందుకు చాపి, చిటికెన వ్రేలు, ఉంగరపు వ్రేలు, మధ్య వ్రేలు - ఈ మూడింటిని కలిపి ముందుకు చాచి, చూపుడు వ్రేలును మడచి బొటనవ్రేలుతో కలిపి వలయాకారంలో ఉంచడాన్ని చిన్ముద్ర అంటారు.

బొటనవ్రేలు లేనిదే ఏ కార్యమును చెయ్యలేము. అన్నిటికీ అదే ఆధారము. ఆ ఒక్కటి లేకపోతే, నాలుగు వ్రేళ్ళు ఉన్నా ఉపయోగము ఉండదు. కనుక, ఆధార మైన బొటనవ్రేలు బ్రహ్మస్వరూపము.

చూపుడు వ్రేలు ఎప్పుడూ దోష దర్శనం చేస్తూ ఉంటుంది. దోషాలను, పాపాలను చూడటమే గాక, చూపెట్టడం ప్రత్యేకంగా దాని పని. కనుక అది జీవునికి సంకేతము. 'జీవ' సంకేత మైన చూపుడు వ్రేలును 'బ్రహ్మ' సంకేత మైన బొటనవ్రేలుకు తగిలించ గానే వలయాకారం ఏర్పడుతుంది. గుండ్రముగా కనిపిస్తుంది. అదే పూర్ణ స్వరూపము. ఆది ఎక్కడో, అంత మెక్కడో అర్థం గాని పరిపూర్ణ సత్తా స్వరూపానికి సంకేతము.

ఇలా రెండు వ్రేళ్ళను కలిపే టప్పుడు మిగిలిన మూడు వ్రేళ్ళను ముందుకు చాచి దూరంగా ఉంచాలి.

పూర్ణానంద స్వరూపము అనుభూతిగా నిలవాలి అంటే, ఆ మూడు వ్రేళ్ళు దూరంగా ఉండాలి. అవే త్రిగుణములు. గుణత్రయమును దూరంగా ఉంచాలి. శరీరత్రయమును దూరంగా ఉంచాలి. అవస్థాత్రయమును దూరంగా ఉంచాలి. ఒక్కమాటలో చెప్పాలంటే, అనాత్మను దూరంగా ఉంచాలి. అలా ఉంచి నపుడే జీవ బ్రహ్మైక్యము అఖండంగా శోభిస్తుంది. ఇదే చిన్ముద్ర లోని చిద్విలాసం.

శ్రీకృష్ణుడు బోధించిన యోగాలు రెండే. ఒకటి జ్ఞానయోగము. రెండవది కర్మయోగము. చిన్ముద్ర ద్వారా జ్ఞానయోగ వైభవమును, మునికోల ద్వారా కర్మయోగ వైశిష్ట్యమును ప్రదర్శించి చూపాడు. రెండిటిని ఆచరించి చూపాడు. కర్మలలో ఉన్నా జ్ఞానాన్ని జారవిడుచుకో కూడదు అనే సందేశాన్ని అందించాడు. జ్ఞానం లేకపోయినా ధనుర్బాణాలను పడేసి అర్జునుడు నిశ్చేష్టుడై కూర్చున్నాడు. పరిపూర్ణ జ్ఞానంతో శోభిస్తున్నా పురుషోత్తముడు మునికోలను చేత పట్టుకొనే ఉన్నాడు. జ్ఞానంతో శోభించే వారికి కర్మ ఎన్నడూ బంధం కాదని ప్రదర్శన ద్వారా చెప్పకనే భగవానుడు చెబుతున్నాడు.

జ్ఞానం కలవాడే జ్ఞానాన్ని ప్రసాదించ గలడు. చిన్ముద్రాకారుడే గీతామృతాన్ని పితికి ఆశ్రితులకు వితరణ చేశాడు. చిన్ముద్ర ఎలా ఉంటుందో పాలు పితికే వారి వ్రేళ్ళు కూడా పితికే టప్పుడు అలాగే ఉంటాయి. శ్రీకృష్ణుడు జ్ఞానక్షీరాన్ని ఎలా పితికాడో తరువాత శ్లోకంలో చూద్దాం.

## అమృతోద్భవం

సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనన్దనః ।
పార్థో వత్సః సుధీ ర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్ ॥ 4

| | | | | | |
|---|---|---|---|---|---|
| సర్వోపనిషదః | = | సకల ఉపనిషత్తులు | వత్సః | = | లేగదూడ |
| గావః | = | ఆవులు | భోక్తా | = | అనుభవించు వాడు |
| గోపాలనందనః | = | గోప కుమారుడు | సుధీః | = | బుద్ధిమంతుడు |
| దోగ్ధా | = | పాలు పితుకువాడు | దుగ్ధం | = | క్షీరము |
| పార్థః | = | అర్జునుడు | మహత్ గీతామృతం | = | గొప్పదైన గీతామృతము |

**ఉపనిషత్తులు గోవులు. పాలు పితుకు వాడు గోపాల నందనుడు. లేగదూడ అర్జునుడు. పానము చేయు వాడు సద్బుద్ధి కలవాడు. గొప్పదైన గీతామృతమే క్షీరము.**

### వ్యాఖ్య

### జ్ఞాన క్షీరం

ఉపనిషత్తులు గోవులు. జ్ఞానము పవిత్రము కనుక జ్ఞాన పూర్ణమైన ఉపనిషత్తులు పవిత్రములు. అలాగే గోమాత కూడా పవిత్రము. గోక్షీరము ఆరోగ్యప్రదము. ఉపనిషత్సార మైన గీతా పీయూషము అమృతానంద ప్రదము. గోక్షీరము ప్రాణులకు శక్తి నిచ్చి జీవనాన్ని వృద్ధి చేస్తుంది. ఉపనిషత్తులు బోధించే జ్ఞానము మనిషికి ఆధ్యాత్మిక శక్తి నిచ్చి అద్వైత జ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. జగత్తు యొక్క ధారణ పోషణలు ఏడు విషయాల మీద ఆధారపడి ఉన్నా యన్నారు మన పూర్వీకులు. ఆ ఏడింటిలో గోమాత ఒకటి.

*గోభి ర్విప్రైశ్చ వేదైశ్చ సతీభిః సత్యవాదిభిః*
*అలుబ్ధైః దానశూరైశ్చ సప్తభి ర్ధాయతే మహీః ॥*





గోమాత, వేదవిదుడు, వేదము, పతివ్రత, సత్యవాది, లోభి కాని వాడు, దానవీరుడు - ఈ ఏడుగురి తోనే ధరణి యొక్క ధారణ పోషణలు జరుగు తున్నాయి.

గోవు మనకు అనేక విధాలుగా ఉపయోగ పడుతుంది. గోమాత సంతాన మైన ఎద్దులు పొలాన్ని దున్న డానికి, బరువులు మోయడానికి, బండ్లు లాగడానికి ఉపయోగ పడతాయి. ఆవుపేడ శక్తివంతమైన ఎరువుగా ఉపయోగ పడుతుంది. పంచితము, అనగా గోమూత్రము కూడా పవిత్రమే. ఔషధాల తయారీలో గోమూత్రాన్ని ఉపయోగిస్తారు. పంచితాన్ని శుద్ధి క్రియకు కూడా వినియోగిస్తారు. గోమాతల నుండి ఇన్ని విధాలైన ప్రయోజనాలు చేకూరుతున్నా, ప్రధాన ప్రయోజనము మాత్రము క్షీరమే.

ఉపనిషత్తులు అనేకమైన విషయాలను చర్చిస్తాయి. కర్మకాండ, యోగవిధి, ఉపాసనాది విషయాలను కూడా ఉపనిషత్తులు చర్చిస్తాయి. కాని, ఉపనిషత్తుల యొక్క ప్రధాన ప్రయోజనం మాత్రం ఆత్మజ్ఞానమే. జ్ఞానక్షీరమే.

భోజనం లేనిదే మనిషికి శక్తి రాదు. కాని, గోక్షీరము లేకుండా భోజనం రుచిస్తుందా? పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి, - ఇవన్నీ క్షీరము ప్రసాదించినవే కదా? అందుచేతనే ***వినా గోరసం కో రసం భోజనేషు?*** గోక్షీరం లేని ఆహారంలో రుచి ఏముంటుంది? అన్నారు పెద్దలు.

జ్ఞానం లేకపోతే జీవితంలో వెలుగు ఉండదు. కాని, ఉపనిషత్తులకు దూరమైన జ్ఞానం వాస్తవానికి అజ్ఞానమే. విశ్వ విజ్ఞాన మంతా ఉపనిషత్తుల నుండే లభిస్తుంది. అందుకనే, వేదాంత జ్ఞానం లేని వారి జీవితాలలో వెలుగు ఉండదు అన్నారు పెద్దలు.

బాల్యంలో తల్లిపాలు త్రాగి పెరుగుతాము. శైశవం దాటిన తరువాత, బ్రతికినంత కాలం గోక్షీరం తోనే జీవిస్తాము. అందుకనే గోమాతను పాలిచ్చి పెంచిన తల్లి స్థానంలో నిలిపి పూజించారు మన పూర్వీకులు.

గోక్షీరం ఎలా అందుతుందో, ఉపనిషత్ జ్ఞానం కూడా అలాగే అందుతుంది. అందుచేత గోవుల్ని ఉపనిషత్తుల తోను, క్షీరాన్ని గీతామృతం తోను పోల్చారు. ఆరోగ్యాన్నిచ్చే గోక్షీరం మధురం. ప్రకాశాన్ని ప్రసాదించే ఉపనిషత్ జ్ఞానం మధురాతి మధురం.

ఆవులు గడ్డి తింటాయి. తినిన ఆహారాన్ని తిరిగి నోటి లోకి తెచ్చుకొని నెమరు వేస్తాయి. అలా నెమరు వేయడంలో పాలు ఉత్పన్న మవుతాయి. జటిల మైన, గహన మైన ఉపనిషత్ విషయాలు ఒక రాగాన మ్రింగుడు పడవు. ఆవు నెమరు వేసినట్లు, ఆ తాత్త్విక విషయాలను మనం మననం చేయాలి. నెమరు వేసే టప్పుడు గోమాత తదేకంగా అవధానంతో ఉంటుంది. అప్పుడే పాలు తయా రవుతాయి. అలాగే, ఉపనిష ద్విషయాలను శ్రవణ మననాదుల ద్వారా బుద్ధికి పట్టించుకొని, ఆ తరువాత తదేక నిష్ఠతో నిదిధ్యాసను సాగిస్తే, జ్ఞానక్షీరం లభిస్తుంది. ఆ జ్ఞానక్షీరమే గీతామృతము. ఉపనిషత్తులు అనే గోవుల నుండి గీతాజ్ఞాన క్షీరమును పితికే వాడు గోపాల నందనుడు.

### పాల గోపాలుడు

గోవుల నుండి పాలు పితకడం ఒక కళ. తెలిసిన వాడు పితికితేనే పాలొస్తాయి. తెలియని వాడు పితికితే తన్నులు మిగుల్తాయి. శ్రీకృష్ణుడు గొల్ల పిల్లవాడే కనుక చక్కగా పాలు పితక గలడు. అందుకే అతడు గోపాలుడు. గోవులను పాలించే వాడు అయినందున గోపాలుడు ***(గవాం పాలనాత్).*** అలాగే గోవుల్ని మేపే టప్పుడు గోప వేషధారిగా గోచరించడం వల్ల కూడా శ్రీకృష్ణుడు గోపాలుడు ***(గోప వేషధరః గోపాలః).***

పాలు పితకడం అందరూ చేయలేరు. ఉపనిషత్తుల లోని జ్ఞానాన్ని అందరూ అందుకోలేరు. పాలు పితకడం తెలిసిన వానికే గోక్షీరం లభ్య మైనట్లు, సంప్రదాయం తెలిసిన వారికే ఉపనిషత్ జ్ఞానము వంట పడుతుంది. శ్రీకృష్ణుడు గోపాల నందనుడు. గోక్షీరమును ఎలా పితకాలో తెలిసిన వాడు. అలాగే **గో** అంటే 'మహి' లేదా 'భూమి' అని కూడా అర్థము. భూమికి పతి కనుక గోపాలుడు భూపతి. అతడే గోపతి. అతడే గోహితుడు కూడా. ***గోభ్యో హితో గోహితః*** - భూమండలానికి మేలు చేసే వాడు. **గో** అంటే వాక్కు అని మరొక అర్థం. ఉపనిషత్తుల యొక్క జ్ఞాన వైభవాన్ని వర్ణించి చెప్పి, అటు ఉపనిషత్తుల ప్రాభవాన్ని నిలుపు తున్నాడు. ఇటు ఉపనిషత్ జ్ఞానము ద్వారా మహిలో మహిమను ఆవిష్కరిస్తున్నాడు. ఉపనిషత్తు లనే గోవుల నుండి గోపాలు డనే శ్రీకృష్ణుడు భగవద్గీత అనే క్షీరాన్ని ఎలా పితుకు తున్నాడో అర్థం చేసుకున్నాం. ఇంతవరకు జ్ఞానం యొక్క వైశిష్ట్యంతో పాటు ***(గీతా)***, జ్ఞాని యొక్క వైభవాన్ని కూడా అర్థం చేసుకున్నాం ***(గోవిందః)***. ముక్తికి గకార చతుష్టయం రాజమార్గ మని శాస్త్రం చెబుతూ ఉంటే, ఇప్పటికే మనకు గకార ద్వయం లభ్యమైంది. (1)గీత (2) గోవిందుడు.

***గీతా గంగా చ గాయత్రీ గోవిందేతి హృది స్థితే***
***చతు ర్గకార సంయుక్తే పునర్జన్మ న విద్యతే ॥***

గీత, గంగ, గాయత్రి, గోవిందుడు అని గకారముతో ప్రారంభమయ్యే నాల్గింటిని హృదయములో నిలుపుకున్న వారికి పునర్జన్మ ఉండదు.

**వాత్సల్యం తోనే వర్షన**

ఆవు పాలు ఇస్తుంది. కాకపోతే, ముందుగా లేగదూడ తల్లి పొదుగును స్పృశించాలి. అప్పుడే ప్రేమతో పొదుగు నుండి పాలు కారుతాయి. గీతా క్షీరాన్ని శ్రీకృష్ణుడు ప్రసాదించ డానికి అర్జునుడు లేగదూడగా నిలిచాడు. గీతాబోధ ప్రపంచానికి అంద డానికి పార్థుడు నిమిత్త మయ్యాడు. అర్జునుణ్ణి నిమిత్తంగా చేసుకొని పరానుగ్రహార్థం ఉపదేశించాలని భగవానుడైన వాసుదేవుడు సంకల్పించాడు ***( సర్వ లోకానుగ్రహార్థం అర్జునం నిమిత్తీకృత్య ఆహ భగవాన్ వాసుదేవః )***.

**పేరు ఒకరిది - ఊరు అందరిది**

ఆవు పాలిచ్చేది దూడ కొరకే అయినా, పాలన్నీ దూడ ఒక్కటే త్రాగదు; త్రాగలేదు. దూడ ముందుగా కొన్ని పాలు త్రాగుతుంది. ఆ తరువాత మిగిలిన పాలు మన పాలు.

గీతామృతం కూడా అంతే. గీతాజ్ఞానాన్ని శ్రీకృష్ణుడు అర్జునుణ్ణి ఉద్దేశించి బోధించినా, అది కేవలం అర్జునుని కొరకే కాదు. అందరి కొరకు. అందరి ఆనందం కొరకు. గీతామృతాన్ని పానం చేసే వారు బుద్ధిమంతులు ***(సుధీః భోక్తా)***. అంటే వివేకబుద్ధి కలవారు అని అర్థం. అట్టి వారే గీతామృతాన్ని పానం చేసి అమృత స్వరూపు లవుతారు. ఈ విధంగా వేదార్థ సార సంగ్రహమైన గీతాశాస్త్రాన్ని ప్రసాదించిన శ్రీకృష్ణ దేవునకు కృతజ్ఞతతో మళ్ళీ మళ్ళీ తలవంచి నమస్కరిస్తున్నాము.

## జగద్గురు వందనం

**వసుదేవసుతం దేవం కంస చాణూర మర్దనమ్ ।**
**దేవకీ పరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్ ॥** 5





| | | | | |
|---|---|---|---|---|
| వసుదేవ సుతం | = వసుదేవుని కుమారుడు | జగద్గురుం | = | జగద్గురువు |
| కంస చాణూర మర్దనం | = కంస చాణూరులను చంపిన వాడు | దేవం | = | భగవంతుడు |
| | | కృష్ణం | = | శ్రీకృష్ణుని |
| దేవకీ పరమానందం | = దేవకీమాతను పరమానంద పరచిన వాడు | వందే | = | నమస్కరింతును |

**వసుదేవుని కుమారుడు, కంసచాణూరులను చంపిన వాడు, దేవకీదేవికి దివ్యానందాన్ని ప్రసాదించిన వాడు, జగద్గురువు, శ్రీకృష్ణదేవునికి నమస్కారము.**

**వ్యాఖ్య**

**వసుదేవ సుతం దేవం**

వసుదేవుని కుమారుడుగా అవతరించుట చేత శ్రీకృష్ణుడు వాసుదేవు డని కీర్తింప బడ్డాడు ***( వసుదేవ సుతం - వసుదేవస్య అపత్యం వాసుదేవః )***. అంతేకాదు, సర్వ భూతముల యందు వసించు వాడు కూడా తానే. అందుచేత కూడా ఆయన వాసుదేవుడు ***(వసన్తి భూతాని తత్ర)***. సర్వత్ర ఉండు వాడు, సర్వమును ఆచ్ఛాదించు వాడు కనుక ఆయన 'వాసుః' అయ్యాడు. వాసువైన తాను సాక్షాత్తు దేవుడే కనుక వాసుదేవు డయ్యాడు ***(వాసుశ్చాసౌ దేవశ్చేతి వాసుదేవః)***. అలా చూచి నపుడు అవతారమూర్తిగా ఆయన వసుదేవుని కుమారుడు. దేవుడుగా వసుదేవునికి కూడా తండ్రి. జగత్పిత.

***సర్వాణి తత్ర భూతాని వసన్తి పరమాత్మని***
***భూతేషు చ స సర్వాత్మా వాసుదేవ స్తతః స్మృతః ॥***

పరమాత్మ యందు సర్వ భూతములు, సర్వ భూతముల యందు పరమాత్మ ఉండుట చేత ఆయన వాసుదేవుడు అని విష్ణుపురాణము. కనుక వసుదేవుని కుమారుడుగా స్తుతింప బడిన వాసుదేవుడు, వాస్తవానికి దేవదేవు డైన వాసుదేవుడే ***( వసుదేవ సుతం దేవం )***.

**కంస చాణూర మర్దనం**

శ్రీకృష్ణుడు మేనమామ అయిన కంసుని వధించి కంసారి అయ్యాడు. కంసుడు ఎవరో కాదు, అజ్ఞానమే కంసుడు. ఆదిత్య దర్శనంతో అంధకారం అదృశ్య మైనట్లు, అచ్యుతుని దర్శనంతో అజ్ఞానం అంత మవుతుంది.

అజ్ఞాన కొలువులో అహంకారమే గొప్ప యోధుడు. వాడే చాణూరుడనే మల్లయోధుడు. అహంకారానికి ప్రతిరూపం. శ్రీకృష్ణుడు చాణూరుణ్ణి కూడా వధించాడు. పరమాత్మ ప్రవేశంతో హృదయ మనే మధురా నగరాన్ని కలుషితం చేస్తున్న కంసచాణూరులు మరణిస్తారు. జీవునికి అనంతానందం ప్రాప్తిస్తుంది.

**దేవకీ పరమానందం**

తల్లి మైన దేవకీదేవికి శ్రీకృష్ణుడు దివ్యానందాన్ని ప్రసాదించాడు. దేవకీ నందనుడై దేవకీదేవిని ఆనందంలో ఓల లాడించాడు. ఆయన దేవకీసుతుడు ***(దేవక్యాః పుత్రః)***. అంతేకాదు. సర్వములో, సర్వ దేవతలలో శోభించే దివ్య చైతన్యం కూడా దేవకీ పుత్రుడే అన్నది పంచమ వేదమైన మహాభారతము ***( సర్వ దేవాః దేవకీ పుత్ర ఏవ - ఇతి మహాభారతే )***.

దేవకీదేవికి శ్రీకృష్ణుడు రెండుసార్లు పరమానందాన్ని కలిగించాడు. కారాగృహంలో బిడ్డగా ఆవిర్భవించి నపుడు, శంఖచక్ర గదా పద్మములతో శోభిస్తూ చతుర్భుజుడుగా దివ్య దర్శన మిచ్చి, 'అమ్మా! బాధపడకు, నేను వచ్చాను. సదా మీ తోనే ఉంటాను. మీ లోనే ఉంటాను. మీ బంధాలను తొలగిస్తాను' అని అభయ ప్రదానం చేసి మహదానందాన్ని కలిగించాడు. అది మొదటిసారి.

ఆ అలౌకిక రూపాన్నే ధ్యానిస్తూ, ఆయన దివ్యనామాన్నే స్మరిస్తూ, చెరసాలలో భక్తి సాధనను కొనసాగించింది దేవకీమాత. తనను స్మరించే భక్తుల్ని శ్రీకృష్ణుడు విస్మరించడు. కంసుణ్ణి వధించి, దేవకీ వసుదేవుల్ని చెరసాల నుండి విడిపించి వారికి దివ్యానందాన్ని అనుగ్రహించాడు. ఇది రెండవ సారి.

దేవకీమాతకే కాదు. భక్తు లెవరి కైనా భగవ దనుగ్రహం ఇలా రెండు సార్లు ప్రాప్తిస్తుంది. మొదట హృదయంలో భక్తిరూపంలో ఆవిష్కరింప బడుతుంది. ఆ తరువాత జ్ఞానరూపంలో ఆశీర్వదించి పరమానందాన్ని ప్రసాదిస్తుంది **(దేవకీ పరమానందం)**.

**కృష్ణం వందే జగద్గురుమ్**

శ్రీకృష్ణ భగవానుడు ప్రసాదించిన గీతా జ్ఞానం ఒక కాలానికో, ఒక దేశానికో, లేదా కొందరు వ్యక్తులకో సంబంధించింది కాదు. యావద్విశ్వానికి విశ్వ మున్నంత వరకు ఉపకరించే జ్ఞానం కావడం చేత ఆయన జగద్గురువు. కృష్ణుడు బోధించిన గీతాజ్ఞానం పట్ల కొందరికి ఆసక్తి లేకపోవచ్చు. అనురక్తి లేకపోవచ్చు. అయినా, అది వారికి సంబంధించే ఉంది. అవసరం తెలియనంత మాత్రాన అవసరం లేదని కాదు. తెలిసొచ్చిన నాడు అది ఒక్కటే తెరువు అని అర్థ మవుతుంది. ఆనాడు వారికి కూడా ఆయనే గురువు. ఆ విధంగా శ్రీకృష్ణుడు జగద్గురువు. అట్టి జగద్గురువైన శ్రీకృష్ణునికి నమస్కారము.

*కృష్ణ యను పలుకులో ఎంత కమ్మదనము*
*బాధలలో ఓదార్చు అమ్మతనము*
*నిన్ను మించిన దైవమును కనలేము మేము*
*నీ అడుగుల కడ పడి ఉందు చిన్నికృష్ణా!*

అని చిన్నికృష్ణ శతకము భక్తితో నివేదించు కుంటున్న ఒక వెన్నముద్ద.

## తరించే మార్గము

భీష్మద్రోణ తటా జయద్రథజలా గాన్ధార నీలోత్పలా
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ।
అశ్వత్థామ వికర్ణ ఘోర మకరా దుర్యోధ నావర్తినీ
సోత్తీర్ణా ఖలు పాణ్డవై రణనదీ కైవర్తకః కేశవః ॥ 6

| | | | |
|---|---|---|---|
| భీష్మద్రోణతటా | = భీష్మద్రోణులు తీరములు | దుర్యోధన ఆవర్తినీ | = దుర్యోధనుడు సుడిగుండము |
| జయద్రథజలా | = సైంధవుడు నీరు | | |
| గాంధార నీలోత్పలా | = శకుని నల్లకలువ | సః | = ఆ |
| శల్యగ్రాహవతీ | = శల్యుడు సొరచేప | రణనదీ | = యుద్ధమనే నది |
| కృపేణ వహనీ | = కృపుడు జలప్రవాహ వేగము | ఖలు | = వాస్తవముగా |
| కర్ణేన | = కర్ణుడనే | పాండవైః | = పాండవులచే |
| వేలాకులా | = అలలతో నిండి | ఉత్తీర్ణా | = దాట బడినది |
| అశ్వత్థామ వికర్ణ ఘోరమకరా | = అశ్వత్థామ, వికర్ణులు భయంకర మొసళ్ళు | కైవర్తకః | = నావికుడు |
| | | కేశవః | = కేశవుడు |





**భీష్మద్రోణులను తీరములుగా కలది, జయద్రథుని జలముగా కలది, శకునిని నల్లకలువగా కలది, శల్యుని సొరచేపగా కలది, కృపాచార్యుడనే జలప్రవాహ వేగము కలది, కర్ణు డనే అలలతో కూడినది, అశ్వత్థామ వికర్ణులనే భయంకరమైన మొసళ్ళతో నిండినది, దుర్యోధనుడనే సుడిగుండము గల సమరనదిని నిజానికి పాండవులు చక్కగా దాట గలిగారు. శ్రీకృష్ణుడు నావికు డయ్యాడు.**

**వ్యాఖ్య**

దుర్యోధనుని అధర్మ జీవనానికి, అక్రమ ప్రవర్తనకు ప్రతిఫలమే కురుక్షేత్ర సంగ్రామము. మాతృమూర్తి కుంతీదేవి అభీష్టానికి అనుగుణంగా, అచ్యుతుని సారథ్యంలో పాండవులు యుద్ధానికి సిద్ధ పడ్డారు. ఏడు అక్షౌహిణుల సైన్యం పాండవుల వైపు నిలిచింది. కౌరవుల పక్షంలో పదకొండు అక్షౌహిణుల సైన్యం నిలిచి భయంకరంగా గోచరిస్తూ ఉంది. మహా ప్రళయ ప్రభంజనంలా కనిపిస్తున్న కౌరవసేనను భయంకరమైన నదీ ప్రవాహంతో పోల్చి అద్భుతంగా వర్ణిస్తూ, చివరగా జీవితానికి అతి ముఖ్యమైన సందేశాన్ని కూడా జోడించి జోహారు లర్పిస్తూ ఉంది ఈ శ్లోకం.

**సమరనది**

పాండవులు ఎవరిని ఎదిరించి పోరాడాలో, ఆ కౌరవసైన్యం భయంకరమైన నదీ ప్రవాహంలా ఉంది. అది మామూలు నది కాదు. సమరనది. సంసార రణనది.

ఏటి గట్ల మధ్యే నది ప్రవహిస్తుంది. గట్లు లేకపోతే ఏరు ఉండదు. నీరు అన్ని వైపుల పారి కళ్ళేపి చల్లినట్లు రూపం లేకుండా పోతుంది. కురుక్షేత్రంలో కౌరవసేనా నదికి భీష్మద్రోణులు గట్ల లాగా నిలిచి ఉన్నారు. నదిని పటిష్ఠ మైన గట్లు కాపాడినట్లు, కౌరవసేనా నదిని పరాక్రమవంతులు, అజేయు లైన భీష్మ ద్రోణులు కాపాడు తున్నారు. ఏటి గట్టు బలంగా లేనపుడు ఏటికి గండ్లు పడతాయి. అసమాన పరాక్రమవంతు లైన భీష్మద్రోణుల పరాక్రమం ముందు ప్రమాదానికి అవకాశం లేని రీతిలో సమరనది ప్రవహిస్తోంది **(భీష్మద్రోణ తటా)**.

గట్లు పటిష్ఠంగా ఉండినా, నదిలో నీళ్ళు లేకపోతే ఏమి ప్రయోజనం? గొప్ప సైన్యం అనే జలంతో జయద్రథుడు జలరూపంలో ఉన్నాడు **(జయద్రథజలా)**. ఆ జలం కూడా ప్రవాహ రూపంలో పరవళ్ళు త్రొక్కుతూ ఉంది. ఆ ప్రవాహ వేగమే కృపాచార్యుడు **(కృపేణ వహనీ)**.

నది ప్రవహించే టప్పుడు మార్గంలో అక్కడక్కడ ఏటి గట్లు కొద్దిగా రాపిడికి గురై, గుంటలు ఏర్పడుతూ ఉంటాయి. అలాంటి చోట ప్రవాహ జలము కొంత నిలువ ఉండి పోతుంది. అక్కడ బీజవ్యాప్తి వల్ల మొక్కలు పెరుగుతాయి. తీగలు మొలుస్తాయి. కలువలు మొదలైన పువ్వులు పూస్తాయి. కొంత కాలానికి తీగ లన్నీ విస్తరించి నదీ ప్రవాహాన్ని అడ్డగిస్తూ ఉంటాయి. ప్రస్తుతం కౌరవుల సమరనదిలో శకుని కలువ పొద లాగా ఉన్నాడు **(గాంధార నీలోత్పలా)**.

నదిలో భయంకరమైన సొరచేపలు, తిమింగలాల లాగా, కర్ణుడి సారథి శల్యుడు కనిపిస్తున్నాడు **(శల్య గ్రాహవతీ)**. ఈదడానికి వీలు లేని విధంగా ఆ సమరనది కర్ణుడనే భయంకర కెరటాలతో ఎగిసి పడుతోంది **(కర్ణేన వేలాకులా)**. శ్రమించి ఈదడానికి ప్రయత్నిస్తే, గొప్ప ప్రమాదం యువకిశోరాలైన అశ్వత్థామ, వికర్ణు లనే భయంకర మొసళ్ళ రూపంలో పొంచి ఉంది **(అశ్వత్థామ వికర్ణ ఘోర మకరా)**.

ఇన్నిటినీ తట్టుకొని గట్టు పైకి చేరే లోగా మధ్యలో పెద్ద సుడిగుండం ఉంది. అదే దుర్యోధనుడు

(దుర్యోధన ఆవర్తినీ). ఆ వైపు లాగబడిన వాళ్ళు తిరిగి బయట పడలేరు. భీష్మ, ద్రోణ, కృప, వికర్ణాదులు ఆ సుడిగుండంలో చిక్కుకొని బయట పడ లేక గింజుకుంటున్న వాళ్ళే. యుద్ధం వారిలో ఎవ్వరికీ ఇష్టం లేదు. అయినా సుడిగుండంలో చిక్కుకొని బయట పడలేక పోతున్నారు. ఇలాంటి భయంకర సమరనదిని ఎవరైనా దాటగలరా? కాని, పాండవులు దాటేశారు. దానికి కారణం వారు నావలో ఎక్కడమే. అది కూడా విజ్ఞాన నౌక కావడమే. అంతకన్నా ముఖ్యమైన విషయం ఆ నౌకను నడిపే వాడు శ్రీకృష్ణుడు కావడమే (*కైవర్తకః కేశవః*).

**తరుణోపాయం**

జీవితము ఎవరి దైనా చదరంగమే. రణరంగమే. ఇక్కడ ఏదైనా జరగవచ్చు. ఎలాగైనా జరగవచ్చు. ఎప్పుడైనా జరగవచ్చు. అనుక్షణం అప్రమత్తంగా ఉండాలి. వివేకంతో చరించాలి. జీవన సమరనదీ ప్రవాహంలో పరిస్థితి విషమించకుండా చూసుకోవాలి.

నదీ ప్రవాహంలో ప్రతి క్షణమూ మార్పులే. జీవితంలో కూడా అంతే. నదిలో కాలు పెట్టబోయే ముందు ఏ నీటి నైతే మనం చూస్తామో, కాలు పెట్టే సరికి మన పాదాలకు తాకే నీరు మనం చూసింది కాదు. కాలు పెట్టే లోగా మనం చూసిన నీరు ముందుకు పోతుంది. కొత్త నీరు కాళ్ళను తాకుతుంది. ఇదే మార్పు. జీవితమూ ఇంతే. క్షణక్షణానికి మార్పే జీవిత మిచ్చే గొప్ప తీర్పు. నేడున్న వారు రేపుండరు. నేడున్న పరిస్థితులు మరునాడు ఉండవు. ఈ నిముషంలో లేని ప్రమాదం మరో పది నిముషాల్లో ముంచుకు రావచ్చు. ఉన్నవి ఊడిపోతూ ఉంటాయి. కొన్ని కళ్ళ ముందే కాలిపోతూ ఉంటాయి. కదిలే కాళ్ళకు కదలలేని స్థితి ఒకటుంది. చూచే కళ్ళకు చూడలేని పరిస్థితీ ఉంటుంది. జాగ్రత్తగా ఉన్నా కొన్ని జారి పోతూనే ఉంటాయి. గోరంత లాభాలను చూసుకొని పది అడుగులు పైకి పోతాం. కొండంత నష్టాలను మోయలేక వంద అడుగులు క్రిందికి జారిపోతాం.

ప్రారబ్దం దర్శకత్వం వహించే ఈ జీవిత నాటకంలో ప్రతిక్షణం ఉత్కంఠే. ప్రతి నిముషం ఉద్వేగమే. అంతా అనిశ్చితమే. అయోమయమే. ఈ మాయా మనుగడలో మనిషి ఎవరిని ఆశ్రయించాలి? ఎవరిని ఆశ్రయించినా, మునిగిపోయే వాణ్ణి వాటేసుకొని తేలేందుకు ప్రయత్నం చేయటమే అవుతుంది. ఎవరిని ఆశ్రయిస్తే అశ్రువులు, అగచాట్లు శాశ్వతంగా అదృశ్య మవుతాయో, ఎవరి అండ దొరికితే దండగ అనుకున్న బ్రతుకు దండిగా పండుతుందో - అట్టి ఏకైక శరణ్యమూర్తి కేశవుణ్ణి భక్తితో ఆశ్రయించాలి.

*సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః.* భయంకరమైన యుద్ధ మనే నదీ ప్రవాహాన్ని పాండవులు అవలీలగా దాటేశారు. ఎలా దాట గలిగారో తెలుసా? *కైవర్తకః కేశవః.* నావ నడిపే వాడు శ్రీకృష్ణుడు కావడం చేత.

పాండవులు శ్రీకృష్ణుని ఆశ్రయించి తరించారు. అందరమూ అదే చెయ్యాలి. బ్రతుకులో చెలరేగే బాధల్ని మన శక్తియుక్తులతో పోగొట్టుకో లేము. ఉప్పెనలా వచ్చిపడే కష్టాల్ని మనకు మనంగా తొలగించుకో లేము. ఎక్కడ అవరోధాలు అడ్డు నిలుస్తాయో, ఎప్పుడు ప్రతిబంధకాలు ఎదురౌతాయో మన మనస్సుకు తెలియదు. ఒకవేళ తెలిసినా చేయ గలిగింది కూడా చాలా విషయాల్లో ఏమీ ఉండదు. రోదిస్తే చీకటి పోదు. ఏడిస్తే పోయింది రాదు. అనివార్యాలు జీవితంలో తప్పవు. అసంభవా లెన్నడూ జరగవు.

చంద్రుడు ఉదయిస్తేనే వెన్నెల. వసంతం విరబూస్తేనే వనం కళకళ. పరమాత్మ కృప ప్రాప్తిస్తేనే జీవితంలో పరిపూర్ణకళ. ఆనందకళ. అనంతానందకళ. భగవంతుడు ఇలా అందరికీ శరణమై ఉన్నాడు. ఆనంద ప్రదాతయై ఉన్నాడు.





## మహాభారత కమలం

**పారాశర్య వచః సరోజ మమలం గీతార్థ గన్ధోత్కటం**
**నానాఽఖ్యానక కేసరం హరికథా సంబోధనా బోధితమ్ ।**
**లోకే సజ్జన షట్పదై రహరహః పేపీయమానం ముదా**
**భూయా ద్భారత పఙ్కజం కలిమల ప్రధ్వంసి నః శ్రేయసే ॥ 7**

| | |
|---|---|
| అమలం | = నిర్మలమైన |
| పారాశర్య వచః సరోజం | = వ్యాసుని వచనములనే సరస్సున పుట్టినది |
| గీతార్థ గంధ ఉత్కటం | = గీతార్థ మనే మధురమైన సుగంధము కలది |
| నానా ఆఖ్యానక కేసరం | = వివిధములైన కథలే కేసరములుగా గలది |
| హరికథా సంబోధనా బోధితం | = హరికథల సందేశాలతో వికసించినది |
| లోకే | = లోకంలో |

| | |
|---|---|
| సజ్జన షట్పదైః | = మహాత్ము లనెడి తుమ్మెదలచే |
| అహరహః | = దినదినము |
| ముదా | = ఆనందముతో |
| పేపీయమానం | = ఆస్వాదించ బడేది |
| భారత పంకజం | = మహాభారత కమలము |
| కలిమల ప్రధ్వంసి | = కలికల్మషమును నాశనం చేసి |
| నః | = మాకు |
| శ్రేయసే | = శ్రేయస్సు కొరకు |
| భూయాత్ | = అగు గాక! |

**వ్యాసప్రబోధ మనే సరోవరమున పుట్టినది, గీతార్థ మనే మధురమైన సుగంధము కలది, వివిధము లైన కథలను కేసరములుగా కలది, హరికథా సందేశములతో ప్రఫుల్ల మైనది, ఈ ప్రపంచమున బుధజను లనెడి తుమ్మెదలచే ప్రతిదినము ఆనందముగా ఆస్వాదించ బడునది, కలిదోషములను పోగొట్టునది, నిర్దోష మైనది అయిన మహాభారత కమలము మాకు శ్రేయస్సును ప్రసాదించు గాక!**

**వ్యాఖ్య**

మహాభారత కమలం వ్యాస భగవానుని వాక్సరోవరం నుండి ఆవిర్భవించింది. మహాభారతము అద్భుత మైన గ్రంథము. పంచమ వేదంగా శ్లాఘింప బడింది. ధర్మసూక్ష్మములు, తత్త్వసారములతో నిండిన పవిత్రమైన గ్రంథము. జన కళ్యాణాన్ని ఆవిష్కరించిన గ్రంథము.

భారతము ఇతిహాసమే అయినా, ఒక కాలానికి సంబంధించిన గ్రంథం కాదు. ఏ కాలములో నైనా కమలము తన పరిమళాన్ని ఒకే విధంగా వెద జల్లినట్లు, మహాభారత కమలం దేశకాలాదులకు పరిమితం కాకుండా జ్ఞాన సుగంధాన్ని వెద జల్లుతుంది.

మానవ సమాజం లోని వ్యక్తుల జీవన స్థితిగతులకు, ఆలోచనా విధానానికి, ప్రవర్తనకు అద్దం పడుతుంది. అర్థం చెబుతుంది. కవితా శిల్పంతో, నాటకీకరణంతో, ధర్మ సూక్ష్మ వివరణంతో, తాత్త్విక విశ్లేషణలతో అద్భుతంగా, అసమానంగా అలరారుతూ వినడానికి ఇంపుగా, సొంపుగా ఉంటుంది. అందుచేతనే, 'వింటే భారతమే వినాలి' అనే నానుడి విపుల వ్యాప్తి చెందింది.

అద్దంలో ఎవరి ముఖమైనా కనిపిస్తుంది. మహాభారతంలో ఎవరి జీవిత మైనా ప్రతిబింబిస్తుంది. మన పాత్రలు, ప్రవర్తనలు, మనస్తత్త్వాలు భారతంలో ప్రతిఫలిస్తూ ఉంటాయి. అందుకే భారతం రమణీయంగా

గోచరిస్తుంది. భారతాన్ని అధ్యయనం చేయడం అంటే, మన ఆంతరంగిక లోతు ల్లోకి తొంగి చూడటమే.

భారతం త్రికాల జ్ఞాని యైన వ్యాసభగవానుని అపూర్వ సృష్టి కావడమే ఇందుకు ప్రబలమైన కారణము ***(పారాశర్య వచః సరోజం).*** వ్యాసుని పారాశర్యుడని ఈ శ్లోకంలో పేర్కొనడంలో కూడా అంతరార్థం అదే. భవిష్యత్తును వర్తమానము నందు దర్శించే స్మృతికర్త పరాశరుని కుమారుడు వ్యాసుడు. అట్టి వ్యాసమహర్షి రచించింది కావడం చేత మహాభారత కమలం కాలంలో వాడి పోకుండా కళకళ లాడుతూ ఉంది. నిర్మలంగా ఉంది ***(అమలం).***

వాసన లేని పూలు పూజకు పనికిరావు. అవి దర్శనీయమే గాని అర్చనీయము కావు. తత్త్వ సౌరభాన్ని గుండెలో దాచుకోలేని గ్రంథాలు అవి ఇతిహాసా లైనా, కావ్యాలైనా పది కాలాల పాటు ఊరేగ లేవు. మహాభారత గ్రంథము అమోఘమైన గీతా సుగంధంతో అజేయంగా అలరారుతూ ఉంది. తత్త్వార్థ సౌరభంతో గుబాళిస్తూ ఉంది ***(గీతార్థ గంధోత్కటం).***

పువ్వు యొక్క సౌందర్యము పూలరేకుల మీదే ఆధారపడి ఉంటుంది. నైతిక జీవనాన్ని వృద్ధి చేసే ధార్మిక కథలనే పూలరేకులతో మహాభారత కమలం మనోజ్ఞంగా శోభిస్తూ ఉంది ***(నానాఽఖ్యానక కేసరం).***

కోమలమైన రేకులతో సుగంధాన్ని విరజిమ్ముతూ పువ్వులు విరబూయాలి అంటే చల్లని చిరుగాలి తోడు కావాలి. శ్రీహరి భగవానుని దివ్య గాథల లోని భక్తి మారుతము తోడై మహాభారత కమలము విరబూసింది ***(హరికథా సంబోధనా బోధితం).*** పవిత్రాత్ములు, పావనచరితులు అయిన సాధుజనులు, సత్పురుషులు అనే తుమ్మెదలు అనుదినము ఆ మహాభారత కమలమును ఆఘ్రాణిస్తూ ఉంటారు. జ్ఞాన మకరందాన్ని ఆస్వాదిస్తూ ఉంటారు.

షట్పది అంటే తుమ్మెద. తుమ్మెదకు ఆరు కాళ్ళు. అందుకే అది షట్పది. తుమ్మెద ఎటు ఎగిరినా, ఎక్కడ తిరిగినా పువ్వుపై వాలి నపుడే నవ్వుతుంది. తనకు ఆకలి తీరేది, ఆనందం కలిగేది పువ్వు ఒడి లోనే. ఆ గుడి లోనే.

అరవిందము ఎవరి కైనా అందం గానే అగుపిస్తుంది. కాని తుమ్మెదకు అందులో అందమే కాదు, ఆనందం కూడా లభిస్తుంది. అరవిందంలో దాగిన మకరందాన్ని జుర్రుకొనే భాగ్యం తనకు ఉండటమే తన ఆనందానికి కారణము.

తుమ్మెద పద్మము లోని మకరందాన్ని ఆస్వాదించినట్లు, సత్పురుషులు, సుకృతాత్ములు అయిన షట్పదులు మహాభారత కమలం లోని అమృతానంద రసాన్ని పానం చేస్తారు.

మహాభారతాన్ని ఎవరు విన్నా ఆనందాన్ని పొందుతారు. కాని సత్పురుషు లనే షట్పదులు అందులోని తత్త్వసారాన్ని ఆస్వాదించి తృప్తి చెందుతారు. తుమ్మెద ఆరు కాళ్ళతో సంచరిస్తుంది కనుక దానిని షట్పది అంటారు. సత్పురుషులు ఐదు జ్ఞానేంద్రియాలు, ఒక మనస్సు వెరసి ఆరు ఇంద్రియ పాదాలతో చరిస్తూ జ్ఞానమధువును గ్రోలుతారు కనుక వారు కూడా షట్పదులే ***(సజ్జన షట్పదైః).***

సుకృతాత్ములైన ఈ సజ్జన భ్రమరాలు మహాభారత కమలం లోని మధువును ప్రతి రోజు ఆనందంతో ఆస్వాదిస్తూ ఉంటారు ***(అహరహః పేపీయమానం ముదా).*** మహాభారతం యొక్క అవసరం మానవులకు ప్రతిరోజు ఉంది. ప్రతిరోజు అద్దం చూసుకొని ముఖాన్ని ఎలా సరి చేసుకుంటామో, అలాగే ప్రతిరోజు మహాభారతాన్ని పఠిస్తూ మన జీవన సరళిని సవరించుకుంటూ ఉండాలి. అప్పుడే బ్రతుకులో అందం నిండుతుంది. ఆనందం పండుతుంది.





వ్యాస భగవానుని వాక్సరోవరం నుండి ఆవిర్భవించిన మహాభారత కమలం మన హృదయ సరోవరంలో విరబూయాలి. కమలాలతో కళకళ లాడే సరోవరం స్వచ్ఛంగా, నిర్మలంగా, రమణీయంగా, పవిత్రంగా ఉంటుంది. మహాభారత మనే ధార్మిక, తాత్త్విక సరోజం హృదయ మడుగులో వికసిస్తే, నిర్మలత్వాన్ని, పావనత్వాన్ని సంతరించుకొని బ్రతుకు దివ్యంగా శోభిస్తుంది. కలికల్మషాలు అంతరించి పోతాయి **( కలిమల ప్రధ్వంసి ).** శ్రేయస్సు ప్రాప్తిస్తుంది. యావత్ప్రపంచం ఈ మహాభారత కమలాన్ని ఆఘ్రాణించు గాక! సర్వజనులు షట్పదులై మహాభారత కమలం లోని ఆనంద మకరందాన్ని ఆస్వాదించెదరు గాక! **జయోఽస్తు విజయోఽస్తు** - 'జయ'మునకు జయమగు గాక! జయ గ్రంథానికి విజయ మగు గాక!

## కృపా విశేషము

**మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్ ।**
**యత్కృపా తమహం వన్దే పరమానన్ద మాధవమ్ ॥** 8

| | | | |
|---|---|---|---|
| యత్ కృపా | = ఎవరి కృప | లంఘయతే | = ఎక్కించునో |
| మూకం | = మూగవానిని | తం | = అట్టి |
| వాచాలం | = భాషణశీలునిగా | పరమానంద మాధవం | = పరమానంద స్వరూపుడైన మాధవుని |
| కరోతి | = చేయునో | అహం | = నేను |
| పంగుం | = కుంటి వానిని | వందే | = నమస్కరిస్తున్నాను |
| గిరిం | = కొండను | | |

**ఎవరి కృప మూగవానిని భాషణశీలునిగా చేయునో, కుంటివానిని కొండ లెక్కించునో అట్టి పరమానంద స్వరూపుడైన మాధవునికి నమస్కరిస్తున్నాను.**

### వ్యాఖ్య

భగవత్కృప అనిర్వచనీయం. అనుభవైక వేద్యం. భగవంతుని అనుగ్రహం అమృతానందాన్ని ప్రసాదిస్తుంది. భక్తి మానవునికి బ్రహ్మ సంబంధమును కలిగిస్తుంది. మనస్సు మాధవుని యందు లగ్నమైతే మాయ అంతరిస్తుంది. మహిమ అందల మెక్కుతుంది.

బుద్ధిలో సదా భక్తి భావాలు ఉండేటట్లు జీవించ గలిగితే భక్తులం అవుతాము. భక్తులము కాగలిగితే భగవత్కృపను పొందడానికి అర్హులం అవుతాము. భగవంతుడు సదా భక్తులను దయతో రక్షిస్తూ ఉంటాడు.

భక్తిలో అపారమైన శక్తి ఉంది. అద్భుతమైన లివ ఉంది. భక్తి మూగవానిని కూడా మాట్లాడిస్తుంది **(మూకం కరోతి వాచాలం).** అదంతా భగవంతుని కృపా విశేషం. కృపా సాగరుడైన పరమేశ్వరుని పాదాల చెంత కృపారసం సముద్రం లాగా పొంగి పొరలుతూ ఉంటుంది. నమస్కరించే సంస్కారం తోడైతే భగవత్కృప విశేషంగా వర్షిస్తుంది. కరచరణ విహీను డైన కూర్మదాసు పండరీపురానికి నడిచి వెళ్ళి పాండురంగణ్ణి దర్శించాడు. సంత్ జ్ఞానదేవ్ మహిషము చేత వేదాన్ని పలికించాడు. భగవత్కృపకు అడ్డు లేదు అనడానికి ఇవన్నీ తార్కాణాలు.

తల్లికి వినపడే లాగా బిడ్డ విలపిస్తే చాలు. మరుక్షణం లోనే తల్లి ప్రత్యక్ష మవుతుంది. ఆకలి తీర్చుతుంది. లాలిస్తుంది. పాలిస్తుంది. బాధను తొలగిస్తుంది. కష్టాల్ని కరిగిస్తుంది. మహా భక్తుడైన అంబరీషునిపై

దుర్వాస మహర్షి దురాగ్రహాన్ని ప్రకటించాడు. క్రోధావేశాన్ని ప్రదర్శించాడు. ఏ విధమైన క్షోభకు గురి కాకుండా, అలజడి లేకుండా అంబరీషుడు ప్రసన్నంగా అగుపించాడు. అంబరీషుని అనుగ్రహించేందుకు, దుర్వాసుని సంహరించేందుకు భగవత్కృప సుదర్శనం రూపంలో బయలు దేరింది. మహా తపస్వి అయిన దుర్వాస మహర్షి చివరగా భక్తుడైన అంబరీషుణ్ణే ఆశ్రయించ వలసి వచ్చింది. ఆ సందర్భంలో దుర్వాసుడు పలికిన వాక్యాలు భక్తుల వైభవానికి ప్రతిరూపాలుగా భాసిస్తాయి.

*ఒకమా రెవ్వరి పేరు కర్ణములలో నొయ్యారమై సోకినన్*
*సకలా ఘంబులు పల్లటిల్లి తొలగున్ సంభ్రాంతితో నట్టి స*
*త్సుకరున్ మంగళతీర్థ పాదు హరి విష్ణున్ దేవ దేవేశునిన్*
*అకలంక స్థితి గొల్చు భక్తులకు లేదడ్డంబు రాజాగ్రణీ ॥*

పరమేశ్వరుని కృపతో సర్వ పాపాలు హరించుకు పోతాయి. సదా భగవంతుని మౌనంగా స్మరించే వారికి, నిర్మలంగా ధ్యానించే వారికి, కర్మయోగులై అర్చన కీర్తనాదుల ద్వారా సేవించే వారికి భగవత్కృప తప్పక సిద్ధిస్తుంది. అలాంటి సిద్ధిని ప్రసాదించే వాడు కనుకనే పరమానంద రూపుడైన పరమేశ్వరుని ఈ శ్లోకంలో **మాధవమ్** అని కీర్తించడం జరిగింది.

'మా' అంటే లక్ష్మీదేవి. 'ధవుడు' అంటే భర్త. అందుచేత లక్ష్మీపతి మాధవుడని కీర్తింప బడ్డాడు. మౌన, ధ్యాన, యోగాల ద్వారా తెలియబడే వాడు మాధవుడు ***(మౌనాత్ ధ్యానాత్ యోగాత్ విద్ధి భారత మాధవమ్)*** అని మహాభారతంలో వ్యాసోక్తి.

భగవంతుని కొరకు నిర్వహించే ఉపాసనలు, ఆరాధనలు, భక్తి కార్యాలన్నీ అలౌకిక కర్మలు. అలౌకిక కర్మలకు ఫలం అలౌకికం గానే ఉంటుంది. అదే దయ. భక్తి సాధనల ఫలంగా పరమేశ్వరుడు అనుగ్రహించే కృపా విశేషం భక్తుణ్ణి కృతార్థుణ్ణి చేస్తుంది. కృతకృత్యుణ్ణి చేస్తుంది.

చరణము : *నను కరుణించిన భక్తివి నీవే*
*నేను వరించిన ముక్తివి నీవే*
*నీ వెంట పడితే మిగలదు మోహము*
*నీవు వెంట రాగా వెలుగును మోక్షము*

పల్లవి : *రాధా రమణ రాదేల కరుణ*
*దేవకీనందన మాకేల వేదన?*

అనుపల్లవి : *జీవుల గమ్యము నీవే కావా!*
*బ్రతుకు సంద్రమున నీవే నావ!* ॥ రాధా ॥

అని భక్తి వైభవాన్ని, భగవత్కృపా విశేషాన్ని వర్ణించింది చైతన్య గీతిక.

యం బ్రహ్మ వరుణేన్ద్ర రుద్ర మరుత: స్తున్వన్తి దివ్యై: స్తవై
ర్వేదై: సాంగ పదక్ర మోపనిషదై ర్గాయన్తి యం సామగా: ।
ధ్యానావస్థిత త ద్గతేన మనసా పశ్యన్తి యం యోగినో
యస్యాన్తం న విదు: సురాసురగణా: దేవాయ తస్మై నమ: ॥ 9





| | |
|---|---|
| బ్రహ్మ వరుణేంద్ర రుద్ర మరుతః | = బ్రహ్మదేవుడు, వరుణుడు, ఇంద్రుడు, రుద్రుడు, వాయుదేవుడు |
| దివ్యైః స్తవైః | = అద్భుతమైన స్తోత్రములచే |
| యం | = ఎవనిని |
| స్తున్వంతి | = స్తుతిస్తున్నారో |
| సామగాః | = సామవేద గాయకులు |
| వేదైః | = శ్రుతుల ద్వారా |
| స అంగ పదక్రమ ఉపనిషదైః | = అంగము, పదము, క్రమము, ఉపనిషత్తులతో కూడి |
| యం | = ఎవరిని గూర్చి |
| గాయంతి | = గానం చేస్తున్నారో |
| ధ్యానావస్థిత | = ధ్యాన స్థితిలో |

| | |
|---|---|
| తద్గతేన | = పరమాత్మ యందు లగ్నమైన |
| మనసా | = మనస్సుతో |
| పశ్యన్తి | = అవలోకిస్తున్నారో |
| యం | = ఎవరిని |
| యోగినః | = పరమ యోగులు |
| యస్య అంతం | = ఎవరి పూర్ణత్వమును |
| సురాసురగణాః | = దేవతలు, అసురులు కూడా |
| న విదుః | = తెలియలేరో |
| తస్మై | = అట్టి |
| దేవాయ | = భగవంతునకు |
| నమః | = ప్రణామము |

**బ్రహ్మదేవుడు, వరుణుడు, ఇంద్రుడు, రుద్రుడు, వాయుదేవుడు ఎవరిని దివ్యమైన స్తోత్రములచే స్తుతిస్తున్నారో, సామవేద గాయకులు అంగ, పద, క్రమ, ఉపనిషత్తులతో కూడి ఎవరిని కీర్తిస్తున్నారో, పరమయోగులు ధ్యానములో పరమాత్మ యందు లగ్నమైన మనస్సుతో ఎవరి వైపు చూస్తున్నారో, దేవాసురులు సైతము ఎవరి స్వరూపమును తెలుసుకోలేక పోతున్నారో అట్టి దేవదేవునకు ప్రణామములు.**

**వ్యాఖ్య**

పరమేశ్వర సాక్షాత్కారానికి అనేక మంది అనేక మార్గాలలో ప్రయాణం సాగిస్తూ ఉంటారు. పవిత్రమైన లక్ష్యంతో ఆరంభ మైనవి కనుక మార్గాలన్నీ మంగళకరం గానే ఉంటాయి. అద్భుతం గానే గోచరిస్తాయి. అలా గోచరించాలి కూడా. కానీ ఇవన్నీ మహా తేజోవంతమైన ఆ ఏకైక గమ్యానికి సోపానాలే గాని స్వయంగా తేజోమయాలు కావు.

మీరు చరించే మార్గం మీరు చేరాలి అనుకునే గమ్యానికి ఎలా సంబంధించి ఉంది? మార్గం, గమ్యం కన్నా వేరుగా లేదు అని తెలియడమే సరియైన మార్గం. అదే జ్ఞానం.

మనం ఎన్నిటినో ఆశిస్తాము. అభిలషిస్తాము. చాలా వాటిని ప్రేమిస్తాము. ఆశించినవి కొన్ని లభిస్తాయి. ప్రేమించినవి కొన్ని ప్రాప్తిస్తాయి. ప్రేమించిన వన్నీ లభించాలని లేదు. చిరుగాలిని నువ్వు ప్రేమించ వచ్చు. అలాగని దానిని పెట్టెలో పెట్టి దాచుకో లేవు. జాబిలిని నేను ప్రేమించ వచ్చు. అలాగని దానిని ఆకాశం నుండి త్రెంపుకొని జేబులో పెట్టుకో లేను. అవసరం లేదు కూడా.

సామాన్యమైన విషయాలే ఇలా ఉండే టప్పుడు, బ్రహ్మవిదుడు ప్రత్యేకంగా మార్గంలో నిలిచి, గమ్యమైన అనంత బ్రహ్మ స్వరూపాన్ని గ్రహించ గలడా? గ్రహించ లేడు. ఎందుకో తెలుసా? తానే బ్రహ్మము. మార్గం గమ్యానికి వేరుగా లేదు. గమ్యం లోనే మార్గం ఒదిగి ఉంది. అన్నీ ఇలాగే ఉన్నాయి. అందుకే బ్రహ్మము అనంతము.

బ్రహ్మము సద్వస్తువు. ఉన్నదే గాని కానున్నది కాదు. లేని దానిని ప్రయత్నించి పొందాలి. ఉన్న దానిని అర్థం చేసుకోవాలి. బ్రహ్మము ఉన్నదే గనుక, అలా ఉన్నట్లు ఏ జ్ఞానం చేత తెలియ బడుతూ ఉందో, అదే బ్రహ్మజ్ఞానము.

బ్రహ్మజ్ఞానం విషయంలో పొంద బడేది ఏదో అది పొందాలి అనుకొనే వాడు బ్రహ్మమే. మార్గంలో ఉన్న వ్యక్తిని గమ్యం నుండి వేరు చేసేది దేశమూ కాదు. కాలమూ కాదు. కేవలం అజ్ఞానమే. అజ్ఞానము తొలగితే సాధకుడే సాధ్యం. ఆ సాధ్యం కూడా సిద్ధం. ఎప్పుడో ఎక్కడో సాధ్య మయ్యేది కాదు. ఇప్పుడే, ఇక్కడే సిద్ధమై ఉండేది. కనుక అది జ్ఞాతవ్యమే గాని కర్తవ్యం కాదు. అందుకనే, ***తత్ విజిజ్ఞాసస్వ*** - దానిని తెలుసుకొనే ప్రయత్నం చెయ్యి మన్నది ఉపనిషత్తు.

దేవతలు మరణం లేనివారే గాని బ్రహ్మజ్ఞానులు కారు. కనుక దేవతలకు కూడా బ్రహ్మమే ప్రభువు ***(అమరాణాం మరణ రహితానాం ప్రభుః).*** ఆయనే గమ్యము. దేవతలు అత్యున్నత మైన ప్రకాశ స్వరూపులు. ఉన్నత స్థాయిలో ఉన్నంత మాత్రాన ఉన్న సత్య స్వరూపానికి సంబంధించిన జ్ఞానం కలగాలని లేదు. ప్రమాణం ఉంటేనే ప్రమ, లేదా జ్ఞానం కలుగుతుంది.

కనుకనే, దేవత లందరూ దివ్య స్తోత్రాలతో స్తుతించినా, బ్రహ్మ స్వరూపాన్ని తెలుసుకోలేక పోయారు. వేదనాదంతో కీర్తించే వేద పండితులు కూడా బ్రహ్మ స్వరూపాన్ని గ్రహించలేక పోతున్నారు. అంతర్ముఖులై ధ్యానమగ్ను లైన యోగులు కూడా బ్రహ్మ స్వరూపము అర్థం గాక నిశ్చేష్టులై ఉన్నారు. అట్టి పరబ్రహ్మమును ఎలా కీర్తించాలి? కీర్తించను ఎలాగూ వీలు పడదు కనుక, ఎలా కీర్తించినా దోషం లేదు. అనంత మైన పరమాత్మ స్వరూపాన్ని పరిమితమైన మన ప్రార్థనలలో మడత పెట్టలేము అనేదే అన్ని ప్రార్థనల యొక్క అంతరంగము. కనుక, ఎవరి స్వరూపాన్ని సురాసురులు సైతం తెలుసుకోలేరో, అట్టి భగవంతునికి నమస్కారము ***( యస్యాంతం న విదుః సురా సురగణాః దేవాయ తస్మై నమః ).***

భగవాన్! నీవు ఉన్నట్లు తెలుసు. ఎలా ఉన్నావో తెలియదు. నీ స్వరూప స్వభావాలు నా బుద్ధికి దొరకడం లేదు. నీవు ఎలా ఉన్నా, నేను పిలిచే పలుకు మాత్రం నీకే వినిపించాలి. నా ప్రార్థనలు నిన్నే చేరాలి.

***తవ తత్త్వం న జానామి కీదృశోఽసి మహేశ్వర***
***యాదృశోఽసి మహాదేవ తాదృశాయ నమోనమః ॥***

నీ స్వరూప మేమిటో నాకు తెలియదు. అది ఏదైనా కానీ, నేను చేసే వందనము ఆ స్వరూపానికే. నీ స్వరూపానికే.

ఈ విధమైన మెత్తని భావాలతో నిండిన ధ్యాన శ్లోకాలను పఠించి, తృప్తి చెందిన గీతా భక్తుని హృదయం ఆనందంతో ఊగుతూ గీత వైపు సాగుతూ ఉంది.





# చైతన్య భగవద్గీత

## అథ ప్రథమోఽధ్యాయః - మొదటి అధ్యాయము

## అర్జున విషాదయోగః - అర్జున విషాద యోగము

**ధృతరాష్ట్ర ఉవాచ :**

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః ।
మామకాః పాండవా శ్చైవ కి మకుర్వత సంజయ ॥ 1

ధర్మక్షేత్రే-కురుక్షేత్రే-సమవేతాః-యుయుత్సవః
మామకాః-పాండవాః-చ-ఏవ-కిం-అకుర్వత-సంజయ

| | | | | | |
|---|---|---|---|---|---|
| సంజయ | = | ఓ సంజయా! | సమవేతాః | = | చేరిన |
| ధర్మక్షేత్రే | = | ధర్మభూమి యైన | మామకాః | = | నా వాళ్ళు |
| కురుక్షేత్రే | = | కురుక్షేత్రమున | పాండవాః చ ఏవ | = | పాండవులు |
| యుయుత్సవః | = | సమరేచ్ఛతో | కిం అకుర్వత | = | ఏమి చేశారు? |

**ధృతరాష్ట్రుడు అడుగుతున్నాడు :**

**సంజయా! యుద్ధం చెయ్యాలని మా వాళ్ళు, పాండవులు ధర్మక్షేత్ర మైన కురుక్షేత్రానికి చేరారు కదా! అక్కడ వాళ్ళు ఏం చేశారు?**

**వ్యాఖ్య**

**మంగళము**

గీతాశాస్త్రము ధృతరాష్ట్రుని శ్లోకంతో ఆరంభమైంది. మంగళాచరణము చేసి శాస్త్రాన్ని ప్రారంభించాలి అనేది సంప్రదాయము. శిష్టాచార నియమము. భగవద్గీత మంగళముతో ఆరంభం కాకుండా, ఒకేసారి ధృతరాష్ట్రుని శ్లోకంతో ప్రారంభం కావడం చేత, గీతాశాస్త్రము సంప్రదాయ విరుద్ధ మని కొందరి అభిప్రాయము.

ఈ విషయాన్ని కాస్త వివరంగా, విస్పష్టంగా విచారించు కోవాలి. భగవద్గీతకు మంగళాచరణం అవసరమా? అనేది ముందుగా నిర్ణయం కావాలి.

భగవద్గీతకు మంగళాచరణం ప్రత్యేకంగా ఉండ నవసరం లేదు. గీత మహాభారతము మధ్యలో ఉంది **(మధ్యే మహాభారతమ్).** మంగళాచరణముతో మహాభారతము మొదలైంది కనుక భార తాంతర్గత మైన భగవద్గీతకు ప్రత్యేకించి మంగళము చెప్ప నవసరం లేదు.

అలా కాకుండా, భగవద్గీత తత్త్వ ప్రధానమైన శాస్త్రం కనుక, భార తాంతర్గతమే అయినా ప్రత్యేకించి మంగళార్థము ఒక శ్లోకము ఉండి తీరాలి అని భావించడంలో తప్పు లేదు. అలాగని మంగళాన్ని ఆచరించకుండా, సంప్రదాయానికి భిన్నంగా గీత ఆరంభమైంది అనే విమర్శ అర్థరహితం. ఎందుకని? గీతారంభము మంగళాచరణము తోనే జరిగింది.

## ధర్మము - దైవము

భగవద్గీతలో ధృతరాష్ట్రుడు పలికిన ఈ ప్రథమ శ్లోకం **ధర్మక్షేత్రే** అంటూ మొదలైంది. **ధర్మక్షేత్రే** అనే సమాసంలో మొదటి పదమే ధర్మం. ధర్మము అనగా దైవమే. ధర్మరూపంలో ఉన్నది దైవమే. ధర్మమును ఆచరించడం సాధన మైతే, ధర్మరూపంలో ఉన్న దైవాన్ని పొందడము సాధ్యము. కనుక, ధర్మము అనేది సాధన వాచకమే కాదు, సాధ్య వాచకం కూడా. ధర్మ శబ్దము సాధన సాధ్య వాచకము, లేదా ఉపాయ ఉపేయ వాచకము.

సాధ్య రూపుడైన పరమేశ్వరుడు మంగళకరుడు. మంగళ రూపుడైన భగవంతుని పొందుటకు ఆచరించే సాధన కూడా మంగళకరమే. అందుచేత, ధర్మశబ్దంతో ప్రారంభించ బడిన గీతాశాస్త్రము మంగళార్థంతో దివ్యంగా శోభిస్తూ ఉంది అనే విషయంలో సందేహానికి తావు లేదు.

**ధరతీతి ధర్మః** ధరించునది ధర్మము. **ధృఞ్ ధారణే** అనే ధాతువు నుండి ధర్మ శబ్దము పుట్టింది. ధారణం అంటే భరించడం, లేదా మోయడం అని అర్థము. **డుభాఞ్ ధారణ పోషణయోః.** ధారణము, పాలనము అనే రెండు లక్షణాలు కలిగింది ధర్మము. సర్వ ప్రపంచాన్ని భరించేది, ధరించేది, పాలించేది ఏదో అదే ధర్మము. ఈ కారణం చేత సమస్త విశ్వానికి మూలాధారము ధర్మము.

**ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా**

యావ ద్విశ్వానికి ధర్మమే ఆధారంగా ఉంది అన్నది తైత్తిరీయ శ్రుతి. ధర్మ రూపంలో దైవం ఉన్నప్పుడే అది సాధ్య మవుతుంది. కనుక, ధర్మ మనేది ఏదో కాదు భగవ ద్విభూతియే. భగవ ద్రూపమే. ధర్మరూపంలో ఉన్నది దైవమే. ధర్మం ఉన్నచోట దైవం ఉన్నట్లే. ధర్మస్పృహ దైవస్మరణమే.

**యతో ధర్మః తతో కృష్ణః**
**యతో కృష్ణః తతో జయః**

ఎక్కడ ధర్మం ఉంటుందో అక్కడ శ్రీకృష్ణ భగవానుడు ఉంటాడు. ఎక్కడ శ్రీకృష్ణుడు ఉంటాడో అక్కడ జయం వర్ధిల్లుతుంది అని వ్యాసప్రోక్తం.

ధృతరాష్ట్రుని శ్లోకం 'ధర్మ' అనే రెండు అక్షరాలతో దివ్యంగా ప్రారంభమై, 'జయ' అనే రెండు అక్షరాలతో సమాప్త మైంది. **ధర్మమేవ జయతే** - ధర్మమే జయించి తీరుతుంది అనే ఆర్షవాణిని ప్రథమ శ్లోకమే అద్భుతంగా ఆవిష్కరించింది.

## నరేశుడు - నారాయణుడు

ధర్మ మనే పదంతో ఆరంభం కావడం చేత ప్రథమ శ్లోకం మంగళమనే అనుకుందాం. కాని, పలికిన వాడు ధృతరాష్ట్రుడు కదా! 'ధృతరాష్ట్ర ఉవాచ' అంటూ గీత మొదలైంది. ధృతరాష్ట్రుడు పలికింది మంగళం ఎలా అవుతుంది? అనేది మరి కొందరి వాదము.

వాదించడంలో తప్పు లేదు. కాని, అలా వాదించే వారికి ధృతరాష్ట్ర శబ్దము కూడా మంగళమే అనే సత్యం తెలిస్తే బాగుంటుంది. **ధృతం రాష్ట్రం యేన సః ధృతరాష్ట్రః** - ధృతరాష్ట్రుడు అంటే రాష్ట్రమును ధరించిన వాడు అని అర్థము. రాష్ట్రమును ధరించే వాడు రాజు. రాష్ట్రమును పాలించే వాడు రాజు. దేశము యొక్క ధారణ పాలనలు ప్రభువు మీద ఆధారపడి ఉంటాయి. ప్రభువు లోని ఆ శక్తి పరమేశ్వరునిదే. అందుచేతనే **నరాణాం చ నరాధిపమ్** - నరులలో నరాధిపుడు అనగా రాజు నేనే అన్నాడు గీతలో భగవానుడు.





దేశాన్ని పాలించే శక్తి సామర్థ్యాలు ప్రభువులో ఉంటాయి. అదే ఐశ్వర్యం. **ఈశ్వరస్య భావః ఐశ్వర్యం.** ప్రభువు యొక్క ఐశ్వర్యము వాస్తవానికి జగత్ప్రభువుదే. పరమేశ్వరునిదే. ఈశ్వరునిలో ఐశ్వర్యం సమగ్రంగా ఉంటుంది. రాజులో అవసరమై నంతే ఉంటుంది. అందుచేతనే ధర్మంగా పాలించే రాజును ధర్మప్రభువు అంటుంటారు. ప్రభువు లోని ధర్మవైభవము పరమేశ్వరునిదే. ధర్మరూపంలో దైవం శోభిస్తూ ఉండటమే దానికి కారణము.

ధర్మస్పృహ లేనివాడు ప్రభువు కాలేడు. దైవస్పర్శ లేనిదే ధర్మస్పృహ రాదు. **నా విష్ణుః పృథివీ పతిః** - విష్ణు అంశ లేనివాడు రాజు కాలేడు అన్నది శాస్త్రము. అందుకనే ప్రభువును భగవ ద్విభూతిగా గీత అభివర్ణించింది.

## ధర్మ క్షేత్రము

క్షేత్రము అంటే భూమి, లేక స్థలము అని ఒక అర్థం. ధర్మమును పండించు కొనుటకు అనువైన ప్రదేశము కావడం చేత, ధర్మ నిలయమైన భారతదేశం ధర్మక్షేత్ర మైంది. ధర్మక్షేత్రము అంటే ధర్మమే ప్రధానంగా శోభించు క్షేత్రము అని అర్థము. పుణ్య ప్రధానమైన క్షేత్రము అని భావము.

భారతదేశము ధర్మ ప్రధానమైన క్షేత్రము. పుణ్యప్రద మైన భారతావనిలో కురు మహారాజు ధర్మ పరిపాలన సాగించిన ప్రదేశము కురుక్షేత్రము. అది ఎందరో మహాత్ములు, మహర్షులు కఠోర తపస్సు నాచరించిన తపోభూమి. మరెందరో సుకృతాత్ములు యజ్ఞ యాగాది కర్మములు నిర్వహించిన కర్మభూమి. 'కురు' అంటే కర్మ. పుణ్య కర్మలను ఆచరించ డానికి అనువైన, నెలవైన క్షేత్రము కురుక్షేత్రము.

కురు మహారాజుకు ఇంద్రుడు ప్రత్యక్ష మైంది ఇక్కడే. కురుమహారాజా! కురుక్షేత్ర పుణ్యభూమిలో తప మాచరిస్తూ అంతిమ శ్వాసను విడిచిన వారికి సద్గతి లభిస్తుంది. పుణ్య ప్రధానమైన ఈ కురుక్షేత్రంలో ఆయుధ హస్తులై యుద్ధమున మరణించిన వీరులు ఉత్తమ లోకాలు చేరుతారు అని ఇంద్రుడు వర ప్రదానం చేశాడు. అంతే కాదు. మదాంధులైన క్షత్రియులతో అవతారమూర్తి యైన పరశురాముడు ఘోర పోరాటం చేసి, తన పవిత్ర పాద స్పర్శతో పావనం చేసిన పుణ్యస్థలి కూడా ఈ కురుక్షేత్రమే. దీనిని బ్రహ్మావర్త మని కూడా పిలిచేవారట.

**కురుక్షేత్రం చ మత్స్యాశ్చ పాంచాలా శ్శూరసేనకాః**
**ఏష బ్రహ్మర్షి దేశో వై బ్రహ్మావర్తా దనంతరః**

కురుక్షేత్రం, మత్స్యదేశం, పాంచాలము, శూరసేనకము అనే ప్రదేశాలు కలసిన దేశాన్ని బ్రహ్మర్షి దేశము అని పిలిచేవారు.

క్షేత్రము అంటే పవిత్రమైన స్థలము అని కూడా అర్థము. పావన నదీమ తల్లులు ప్రవహించే ప్రదేశాలు కూడా క్షేత్రాలే. అలాగే పరమేశ్వరుడు వెలసిన దివ్య స్థానములను కూడా క్షేత్రములు అంటారు.

గంగ, యమున, నర్మద, కృష్ణ, కావేరి మొదలైన పుణ్యనదులు ప్రవహించే ప్రదేశాలను నదీ క్షేత్రాలు, లేదా తీర్థక్షేత్రాలు అంటారు. ఆయా పుణ్య నదీతీరాలలో దానాది పుణ్యకర్మలను ఆచరిస్తాము. కనుక అవి కూడా కర్మ క్షేత్రాలే. ధర్మ ప్రధానమైన పుణ్యక్షేత్రాలే. కురుక్షేత్రాలే.

కాశీక్షేత్రము, శ్రీకాళహస్తి క్షేత్రము, శ్రీశైలక్షేత్రము, బదరీక్షేత్రము, తిరుపతిక్షేత్రము, పండరీ క్షేత్రము మొదలైన పవిత్ర ప్రదేశాలన్నీ భగవ న్మూర్తులతో మంగళకరంగా శోభిస్తూ దివ్యక్షేత్రాలుగా ప్రసిద్ధి గాంచాయి.

అలాగే, జీవులు వసించే శరీరాలు కూడా క్షేత్రాలే. మానవ దేహాలన్నీ క్షేత్రాలే.

**ఇదం శరీరం కౌన్తేయ క్షేత్ర మిత్యభిధీయతే**

అర్జునా! ఈ మానవ దేహాన్ని క్షేత్రము అంటారు అని గీతాచార్యుడే స్వయంగా క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగంలో తెలిపాడు. జీవునికి దేహము ఉపాధి. దేహములో వసించే జీవుణ్ణి దేహం కవచం లాగా కాపాడుతుంది **(క్షతత్రాణాత్)**. అందుచేత కూడా దేహము క్షేత్రము అని పిలువ బడింది.

శరీరము క్షేత్రము. క్షేత్రము అనే పొలానికి రైతు స్వామి. దేహమనే క్షేత్రానికి జీవుడు స్వామి. పొలంలో ఏ బీజాలు నాటుతామో ఆ విధమైన పంటే మనకు ఫలంగా వస్తుంది. అలాగే దేహ మనే క్షేత్రాన్ని కూడా వినియోగించు కోవాలి.

ధర్మబీజాలు నాటుకుంటే, బాహ్యంలో ధర్మకార్యాలు సాగి మనకు పుణ్య మనే పంట వస్తుంది. అధర్మ బీజాలను నాటుకుంటే, తద్వారా అధర్మ కార్యాలు సాగి మనకు పాపం అనే పంట ప్రాప్తిస్తుంది. జ్ఞానాభిలాషులు జ్ఞాన బీజాలను నాటుకుంటే, జ్ఞానమును సముపార్జించుకొని మోక్షఫలాన్ని పొంది తరిస్తారు.

అందరికీ బ్రతుకు పంట పండాలి. అంటే, అందరూ ధర్మాన్ని అనుసరించాలి. ఆచరించాలి. చేసుకున్న వారికి చేసుకున్నంత; ఆ పైన మరి కొంత. ఈ సత్యం పంట విషయానికి వర్తిస్తుందే గాని వంట విషయానికి వర్తించదు.

కిలో బియ్యం వంట చేస్తే మూడు కిలోలు అన్నం తయా రవుతుంది. అలాగని పంచదార, పాలు కలిపి వంట చేస్తే మూడు రెట్లు కోవా తయారు కావాలంటే కాదు. ముద్దగా ఘనీభవించి నాలుగో వంతు కోవా తయా రవుతుంది. ఈ వ్యత్యాసాలు వంటలో ఉంటాయి. పంటలో తరుగుదల ఉండదు.

ధర్మము వంట లాంటిది కాదు. పంట లాంటిది. పెట్టుబడి తక్కువ. రాబడి ఎక్కువ. ఒక బస్తా ధాన్యపు గింజల్ని రైతు భూమిలో చల్లుతాడు. తిరిగి కొన్ని బస్తాల ధాన్యాన్ని ఫలంగా పొందుతాడు. ధర్మం కూడా అలాంటిదే. స్వల్పంగా ఆచరించినా అధికంగా ఫలాన్ని అందిస్తుంది.

**స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్**

ధర్మాన్ని ఏ కొంచెము ఆచరించినా అది గొప్ప భయాన్ని పోగొట్టి కాపాడుతుంది అని అభయ ప్రదానం చేసింది గీతామాత. దీపం చిన్నదే అయినా దట్టమైన చీకటిని దూరం చేస్తూ ఉంది కదా! ధర్మాచరణం కూడా అంతే.

## కురుక్షేత్రము

కురుక్షేత్రము పుణ్యభూమి. యజ్ఞభూమి. తపోభూమి. ఇంతవరకు ఇలాగే అర్థం చేసుకున్నాం. ఇక ఇప్పుడు, కురుక్షేత్రాన్ని యుద్ధభూమిగా చూడబోతున్నాం. కురుక్షేత్రంలో పోరాడటానికి ఇరువర్గాలు సిద్ధపడ్డాయి. (**కురుక్షేత్రే యుయుత్సవః ఏవ సమవేతాః**). పుణ్యభూమి పోరాట భూమిగా మారింది. సాధన క్షేత్రం సమరక్షేత్ర మైంది. వేదనాదాలతో మారు మ్రోగిన యజ్ఞభూమి రణభేరీ నినాదాలతో హోరెత్తే యుద్ధభూమిగా తయారైంది.

యుద్ధము ఏదో కాదు. వైరుధ్యమే యుద్ధము. వైరుధ్యంలో జనించే సంఘర్షణే సమరము. ప్రపంచంలో ఎక్కడ చూచినా కనిపించేది సమరమే. సమరాన్ని విశ్వం సహించ లేదు. అందుకే విశ్వశాంతి నినాదం.

విశ్వం లోనే కాదు. ఏ వ్యక్తిలో చూచినా సమరమే దాగి ఉంది. వ్యక్తి మనస్సు భరించలేని సంఘర్షణే





సమరము. సంఘర్షణల మధ్య మనిషి స్వాస్థ్యమును పొందలేడు. సమన్వయంతో జీవించ లేడు. సంఘర్షణల ఒత్తిడిలో మనిషి ప్రశాంతంగా బ్రతక లేడు. అందుకే వ్యక్తి శాంతి - వ్యక్తి ఔన్నత్యం అనే నినాదాలు విశ్వంలో ప్రతిధ్వనిస్తూ ఉంటాయి.

వైరుధ్యాలు విచిత్రంగా విలయ తాండవం చేస్తున్న విశ్వంలో మనం జీవిస్తున్నాం. ఈ కల్లోల వాతావరణంలో యజ్ఞభూమి యైన కురుక్షేత్రము యుద్ధభూమిగా మారినట్లు, శాంతి మందిరంగా విలసిల్ల వలసిన ప్రపంచం అశాంతి నిలయంగా నిలిచి ఉంది.

## రంగస్థలమా? రణస్థలమా?

ఆడేందుకు ఉన్నది నాటకరంగం. పోరాడేందుకు ఉన్నది రణరంగం. ఆట ఏదైనా ఆట కొరకే. ఆట వరకే. కాని, పోరాటము అలాంటిది కాదు. పోరాటము పోరాటము కొరకే కాదు. పోరాటము పోరాటము వరకే కాదు. పోరాటము వికృతం కొరకు. పోరాటము వినాశం కొరకు.

ఆటలో ఆనందం ఉంటుంది. పోరాటంలో ఆందోళన ఉంటుంది. ఆటలో పోరాట పటిమ ఉండటం తప్పు కాదు. ఉండాలి కూడా. కాని, ఆట పోరాటంగా మారితే మాత్రం, ఆ తరువాత అంతా ఆరాటమే. బ్రతుకంతా కాటకమే.

ఇంతకీ ప్రపంచం రంగస్థలమా? రణస్థలమా? జీవితం నాటకరంగమా? రణరంగమా? విలువలతో విలసితంగా జీవించే విశ్రాంతి మందిరమా? లేక, విరోధాలతో విషాదాలను విరజిమ్మే వికృత సదనమా? ఆలోచనలకు పదును పెట్ట వలసింది ఇక్కడే.

నాటకంలో ఎందరో నటులు ఉంటారు. ఎన్నో సన్నివేశాలు ఉంటాయి. మరెన్నో అలంకరణలు ఉంటాయి. అలా ఉన్న వన్నీ ఒకే నాటకానికి సంబంధించి ఉన్నాయి. ప్రత్యేకతలతో గోచరిస్తున్నా, ప్రత్యేకంగా మాత్రం లేవు.

ఈ ప్రపంచంలో ఉన్న వన్నీ అలాగే ఉన్నాయి. ప్రత్యేకతలు ఉన్నాయేమో గాని, అవి ప్రత్యేకంగా లేవు. వివిధ రకాల పాత్రలు ఒకే నాటకంలో ఒదిగినట్లు, వివిధ రంగుల పువ్వులు ఒకే మాలలో చేరినట్లు, ఒక్క మాటలో చెప్పాలంటే - వివిధములైన అలలు ఒకే సముద్రంలో అలరారినట్లు, విశ్వంలో ఉన్న వన్నీ ఏకంలో ఏకమై ఉన్నవే గాని, అనేకంలో భిన్నమైనవి మాత్రం కావు.

ఈ సత్యం అర్థమైతే ప్రపంచం ఒక రంగస్థలం. జీవు లందరూ ఉత్సాహంతో నటనలో నర్తిస్తూ జీవించే కళాకారులు. అర్థం కాకపోతే, విశ్వమే ఒక వికృతమైన రణస్థలం. జీవు లందరూ విద్వేషాలతో యుద్ధంలో పోరాడుతూ గతించే పోరుగాళ్ళు.

## నటించుట - వికటించుట

నాటకంలో నటులు ఎవరి పాత్రను వారు పోషించాలి. పోషిస్తారు. ఎవరైనా, ఎంతటి నటుడైనా తన పాత్రనే తాను పోషిస్తాడు. అంతమాత్రాన ఇతరుల పాత్రలతో సంబంధం లేకుండా నటించ లేడు. ఇతర పాత్రలతో సంబంధాన్ని సంరక్షించుకొంటూ తన పాత్రను తాను పోషించాలి. అప్పుడే నటనలో వైభవము. అక్కడే నటునిలో వైదుష్యము.

ఇది అర్థమైతే, నటనలో ఘర్షణ ఉన్నా, నటునిలో ఘర్షణ ఉండదు. ఒకవేళ వ్యత్యాసాలు గోచరించినా, వ్యావహారికంగా నటనలో ఉంటాయే గాని, స్వాభావికంగా వ్యక్తిలో ఇమడవు.

అలా కాకుండా, ఇతర పాత్రలతో విభేదిస్తూ, వ్యక్తిత్వంతో విభిన్నంగా వ్యవహరిస్తే, నటుడు ఘర్షణలో పడతాడు. నాటకాన్ని సంఘర్షణకు గురి చేస్తాడు. పుణ్య క్షేత్రమైన కురుక్షేత్రాన్ని రణక్షేత్రంగా మార్చేస్తాడు.

నాటకంలో నటించే నటుడికి నాటకం మొత్తం తెలుసు. అంతేకాదు. వ్యక్తిగా తానేమిటో కూడా తనకు తెలుసు. కనుక సంఘర్షణతో కూడిన సన్నివేశాలలో కూడా నటుడు తనలో తాను ప్రసన్నంగా ఉంటాడు. ప్రతిచర్యలు లేకుండా ప్రశాంతంగా ఉంటాడు. ప్రమోదంగా నటిస్తాడు.

దర్శకుని మార్గదర్శకత్వంలో నాటకం ప్రదర్శింప బడుతుంది. పరమేశ్వరుని అధ్యక్షతన ఈ ప్రపంచ రంగస్థలిపై జీవులు ప్రవేశిస్తూ నిష్క్రమిస్తూ ఉంటారు (***మయాఽధ్యక్షేణ ప్రకృతిః సూయతే స చరాచరమ్***; *గీత - 9 వ అ - 9 వ శ్లో* ). నాటకంలో ఏమి జరగబోతుందో నటుడికి తెలుసు కనుక, నటుడు సంఘర్షణతో నటిస్తున్నా, వాస్తవానికి నటునిలో ఏ సంఘర్షణా ఉండదు.

కానీ, జీవితంలో ఎప్పుడు ఏమి జరుగుతుందో జీవికి తెలియదు. ఎవరు ఏమౌతారో అర్థం కాదు. అందుకే ప్రతి వ్యక్తికి అనుక్షణం సంఘర్షణ, సంతాపము. ప్రతిక్షణం ఆవేదన, పరితాపము.

## యజ్ఞాలు - యుద్ధాలు

మానవ దేహంలో ఎన్నో జీవ కణాలు ఉన్నాయి. ఏ జీవకణం దేనికి అదే. అయినా ఒక జీవకణం మరొక జీవకణంతో సమన్వయ సంబంధాన్ని కలిగి ఉంది. అన్యోన్య అనుబంధాన్ని కలిగి ఉంది.

అలాగే మనస్సులో బోలెడన్ని ఆలోచనలు ఉన్నాయి. ఏ ఆలోచన దేనికి అదే. నిన్నటి ఆలోచన వేరు. నేటి ఆలోచన వేరు అని మనం అనుకోవచ్చు. కానీ, నేటి ఆలోచనకు పునాదులుగా నిన్నటి ఆలోచనలే ఉన్నాయి. మొన్నటి ఆలోచనలే ఉన్నాయి. గతంలో ఏనాడో చేసిన ఆలోచనలు కూడా ఉన్నాయి.

దేహంలో జీవకణాలు ఎన్నున్నా దేహం ఒక్కటే. మనస్సులో ఆలోచనలు ఎన్నున్నా మనస్సు ఒక్కటే. ఇదీ అవగాహన. ఈ అవగాహన కుదిరితే కురుక్షేత్రంలో యజ్ఞాలు చెయ్యొచ్చు. ఈ అవగాహనే కనుక లోపిస్తే యజ్ఞానికి బదులు యుద్ధం చెయ్యొచ్చు. ప్రస్తుతం మనం అక్కడే ఉన్నాం. యుద్ధభూమి లోనే ఉన్నాం.

## బాహాబాహి

బాహ్యం ఉంది. బాహ్య ప్రపంచం ఉంది. నిద్రించి నపుడు బాహ్యాన్ని మరచినా, మేలుకుంటే మాత్రం బాహ్యాన్ని బహిష్కరించడం సాధ్యం కాదు. బాహ్యం బాగుంటే బ్రతుకు బాగుంటుంది. బాహ్యం బాధక మైతే బ్రతుకు బావురు మంటుంది.

నిద్రించిన పుణ్యానికి మేలుకోక తప్పదు. మేలుకోగానే ఎదురుపడే వారిని స్మృతిలో పోల్చుకోక తప్పదు. వారు మనకు నచ్చని వారైతే శాంతిని రాల్చుకోక తప్పదు.

ఎదురయ్యే వాటిని, లేదా ఎదురుపడే వారిని చూచి యెద చెడితే ఘర్షణ మొద లవుతుంది. కురు క్షేత్రంలో యుద్ధం ఆరంభ మైనట్లే.

ఇష్టమున్నా లేకపోయినా నిత్యము కొన్ని ముఖాల్ని చూడక తప్పదు. మనకు కనిపించే ముఖం భార్యది కావచ్చు. భర్తది కావచ్చు. అధికారిది కావచ్చు. ప్రక్కింటి వారిది కావచ్చు. లేదా, రోజూ మనం ప్రయాణం చేసే బస్సులో కండక్టర్‌ది కావచ్చు.

ఇష్టం లేని ముఖాలను చూస్తే మనస్సులో ఆరాటం మొద లవుతుంది. ఘర్షణ చెలరేగు తుంది. అదలా ఉంచితే, కొన్ని పరిస్థితులలో ఇష్టమైన ముఖాల్ని చూడటంలో కూడా ఘర్షణే తలెత్తుతూ ఉంటుంది.





మనకు ఇష్టులైన వారిని ఆరోగ్యంగా మనం చూడగలం. ఆనందంగా ఉంటే చూడగలం. అలా చూడటంలో ఘర్షణ లేకపోవచ్చు. వారినే ప్రమాదానికి గురై నపుడో, లేదా మృత్యుశయ్యపై చివరి క్షణాలు లెక్క పెడుతు న్నప్పుడో చూడాలంటే మన పరిస్థితి దారుణంగా ఉంటుంది. ఇదంతా ఘర్షణే. సంఘర్షణే. బాహ్యంలో సాగే బాహాబాహి.

కురుక్షేత్రంలో అర్జునుని విషాదం వెనుక నిగూఢంగా ఉండి ప్రేరేపించిన ఘర్షణ ఇదే. అదంతా మున్ముందు చెప్పుకుందాం. ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని మీకు గుర్తు చేస్తూ ప్రస్తావిస్తున్నా.

నాటకంలో నటుడికి ఏ పాత్ర ఎదురైనా అతని మనస్సులో మాత్రం ఏ విధమైన చలనమూ ఉండదు. ఎదురైన వ్యక్తి స్నేహితు డైనా, శత్రువైనా, నటనలో మార్పు ఉంటుందే గాని, మనస్సులో ఏ వికారమూ ఉండదు.

## అంతర్యుద్ధం

బాహ్యంలో నచ్చనివి బాహాబాహికి కారణ మైతే, ఆంతర్యంలో నచ్చనివి అంతర్యుద్ధానికి కారణము. రేపు మన మనస్సులో ఏ ఆలోచనలు కదుల్తాయో వాటిని నేడు ఊహించలేక పోతున్నాము. నిన్న ఏ ఆలోచనల్ని సంతోషంతో హుషారుగా కదలించామో, అవి నేడు బేజారెత్తి స్తున్నాయి. గత మాసంలో చేసినవి ఈ మాసంలో రుచించడం లేదు. ఇది మరొక ఘర్షణ. ఆంతరంగిక ఘర్షణ.

నీకు ఒక వ్యక్తి పూర్తిగా నచ్చితే, ఆ తరువాత మనస్సులో ఏ ఘర్షణ ఉండదు. అసలే నచ్చకపోతే కూడా ఘర్షణ ఉండే ప్రసక్తి లేదు. అలా కాకుండా, ఒక వ్యక్తిలో కొంత నచ్చి, కొంత నచ్చనపుడు, మనస్సులో ఘర్షణ తప్ప మరొకటి ఉండదు.

వ్యక్తి మనకు నచ్చితే అక్కున చేర్చుకోవచ్చు. నచ్చకపోతే ప్రక్కన పెట్టవచ్చు. ఒకే వ్యక్తి కొంత నచ్చి, కొంత నచ్చనపుడు ఉంచుకోవాలో తెలియదు, త్రెంచుకోవాలో అర్థం కాదు. ఇదే సంఘర్షణ. ఇదే సమరము. అయితే, ఈ యుద్ధము బాహాబాహి కాదు. అంతర్యుద్ధం. ఇదే ప్రతి జీవిని పట్టి పీడిస్తున్న సమస్య. కురుక్షేత్రం అద్దం పడుతున్న అందరి సమస్య. జనులందరి సమస్య. ఇదొక చీకటి. దట్టమైన చీకటి. దారి ఎటో అర్థం గాని చీకటి. అంధకారం. గాఢాంధకారం. అజ్ఞానాంధకారం. ఈ చీకటి నుండి బయట పడాలి. వెలుగు వైపుకు ఎగబ్రాకాలి.

## తమసోమా జ్యోతిర్గమయ

గీతాభవనం లోకి ప్రవేశించాలి అంటే ముందుగా ద్వారం వద్ద ధృతరాష్ట్రుల వారిని అవశ్యం దర్శించాలి. ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడు. పుట్టుక తోనే గ్రుడ్డివాడు. జాత్యంధుడు. అంధత్వ మనేది ఆ మహారాజుతో కలిసే పుట్టింది (***జన్మనా సహ జాయతే***). అంటే, అలా జన్మించడానికి బీజాలు పూర్వజన్మ లోనే నాటుకున్నా డని అర్థము.

ప్రారబ్ధ వశాత్తు ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడైతే, ప్రయత్నించి లేని గ్రుడ్డితనాన్ని అర్ధాంగి గాంధారి అరువు తెచ్చుకుంది. ఇక సంతానం విషయం చెప్ప నవసరం లేదు. అంతా దుస్సంతానమే. దుర్యోధన, దుశ్శాసన, దుస్సల అంటూ అంతా దుకార ప్రయోగమే. దుష్ట సంజాతమే.

దేహ మనే రాష్ట్రాన్ని ధరించిన వాడు ధృతరాష్ట్రుడు. దేహాన్నైతే ధరించాడు కాని, ఆ దేహము ఎందు కొచ్చిందో, దేని కొరకు ఉందో గ్రహించలేని వాడు. కళ్ళకు ఎలాగూ చూపు లేదు. మనస్సును కూడా మూసేసుకున్న వాడు. సత్యాన్ని దర్శించ లేని అంధుడు. జ్ఞానాంధుడు.

ఈ గ్రుడ్డి మహారాజు గారి వాక్యం మమకారంతో ఆరంభ మైంది. **మామకాః** - నా వాళ్ళు అంటూ కౌరవుల్ని, **పాండవాః** - పాండవులు అంటూ పాండుపుత్రుల్ని సాహసించి మరీ పలికాడు.

**అయిన వారు - కాని వారు**

అయ్యా! అంబికేయా! నా వాళ్ళు (**మామకాః**) అని ముద్దుగా పిలుచుకున్నావు. బావుంది. నీ వాళ్ళు నీ వాళ్ళే. ఎవరూ కాదనడం లేదు. కాని, నీ తమ్ముడు పాండురాజు కుమారులు నీ వాళ్ళు కాకుండా ఎలా పోయారు?

ఇరువురిలో ప్రవహించే రక్తం ఒకటే కదా! ఇరువురిదీ ఒకే వంశం. ఒకే కుటుంబం. ఒకే గోత్రం. అలాంటప్పుడు అయిన వాళ్ళు, కాని వాళ్ళు అనే విచక్షణ ఎక్కడిది? గ్రుడ్డి విచక్షణ. అదే అంధకారం. మనస్సులో చీకటి. మమకారం పొరలు కప్పిన మానవునికి వాస్తవాలు అగుపించవు. విడ్డూరాలే కనిపిస్తాయి. వికారాలే వినిపిస్తాయి.

పాండవులు ఎక్కడి నుండో క్రొత్తగా పుట్టుకొచ్చిన వాళ్ళు కారు. తెలియని వారూ కారు. స్వయాన తన తమ్ముని బిడ్డలే. వాళ్ళనే తన వాళ్ళుగా చూడలేని ధృతరాష్ట్రయ్య ఇక ఎవరిని తన వారిగా చూస్తాడు?

ఇంతకీ, అయిన వాళ్ళెవరు? కాని వాళ్ళెవరు? మానవ జీవన ప్రస్థానంలో ఎవరికి ఎవరు సొంతము? ఎవరికి ఎవరు తోడు? ఎవరితో ఎవరు కలసి వచ్చారు? ఎవరితో ఎవరు కలసి పోతారు? ఉన్నా ఎంత కాలం కలసి ఉంటారు? ఎవరిదైనా ఒంటరి జీవితమే. అందరమూ ఒంటరిగా వచ్చిన వాళ్ళమే. ఒంటరిగా పోయే వాళ్ళమే. అలాంటప్పుడు నా వాళ్ళు (**మామకాః**) అనే మమకార ప్రదర్శనం అర్థ రహితం కాదా? విచారణ చేయ గలిగే వారికి ఈ ప్రపంచంలో ఎవ్వరూ ఎవ్వరికీ ఏమీ కారని తెలుతుంది (***విచార్యమాణేన కస్యాపి కశ్చిత్ బంధుః***).

అదేదో తాత్త్విక అవగాహన లెండి. వ్యావహారికంగా మనకు సంబంధించిన వాళ్ళు మన వాళ్ళు కాకుండా పోతారా? అని మీరు అనవచ్చు. తప్పు లేదు. అలాంటప్పుడు, మళ్ళీ మన వాళ్ళ లోనే వీరు మన వాళ్ళు - వారు కాని వాళ్ళు అనే వ్యత్యాసాలు, విభేదాలు ఎక్కడి నుండి పుట్టుకొచ్చాయి? ఏమో! తెలియదు అంటారా! అదే పుట్టుగ్రుడ్డి అంటే.

అయినవాళ్ళు అంటే, ఉభయులూ అయిన వాళ్ళే. కాని వారు అంటే, ఎవరైనా కాని వాళ్ళే. ఇలా చూచి నపుడు ఇరువురూ తన వాళ్ళే కావాలి. లేదా, ఇరువురూ తన వాళ్ళు కాకుండా పోవాలి.

వీరు నా వాళ్ళు (**మామకాః**), వారు నా వాళ్ళు కారు అనుకుంటే, అక్కడే ఘర్షణ ఆరంభ మవుతుంది. ఈ ఘర్షణే ప్రస్తుతం కురుక్షేత్రం. ఇది హస్తినాపురానికి సమీపాన ఉండే బాహ్య కురుక్షేత్రం కాదు. అంతః కరణను అంటి పెట్టుకొని ఉన్న ఆంతరంగిక కురుక్షేత్రం.

**పెద్ద మనస్సు - చిన్న బుద్ధి**

ముందు పుట్టిన వాడు తండ్రితో సమాన మనుకొంటూ అన్నగారైన ధృతరాష్ట్రుని తండ్రి కంటే ఎక్కువగా పాండురాజు భావించాడు. పూజించాడు. పాండురాజు మరణానంతరం ధృతరాష్ట్రుడే తండ్రి అని త్రికరణ శుద్ధిగా నమ్మిన వ్యక్తి ధర్మరాజు.

భారత యుద్ధం ముగిసింది. ధర్మరాజు సింహాసనాన్ని అధిష్ఠించే శుభ ఘడియ సమీపించింది. మంగళ శంఖాన్ని చేత పట్టుకొని పవిత్ర నదీజలాలతో శ్రీకృష్ణుడు ధర్మరాజును అభిషేకించాడు. సింహాసనాన్ని అధిష్ఠింప చేశాడు. ఆ సందర్భంలో ధర్మరాజు తన మనస్సు లోని మాటను, మనసైన మాటను మంజులంగా వినిపిస్తాడు.





కృష్ణా! ధృతరాష్ట్ర మహారాజు నా తండ్రి. నా దైవం. ఆయన ప్రతినిధిగా ఈ సింహాసనాన్ని నేను అధిష్ఠించాను. ఆయన క్షేమాన్నే కాంక్షిస్తూ జీవిస్తాను (**ఏత దర్థం హి జీవామి**). ఆయన సేవ లోనే నా బ్రతుకును చరితార్థం చేసుకుంటాను. నాకు ఆయనే ప్రభువు అంటాడు.

ధృతరాష్ట్రుడు వృద్ధుడు. పెద్దవాడు. ధృతరాష్ట్రుని ముందు ధర్మరాజు వయస్సులో చాలా చిన్న వాడు. పసికూన. ధర్మరాజు చిన్నవాడే అయినా ఎంతో పెద్ద మనస్సుతో పలికాడు. ధృతరాష్ట్రుడు పెద్దవాడే అయినా, **మామకాః - పాండవాః** అంటూ చిన్న బుద్ధిని బయట పెట్టుకున్నాడు. ఎవరు పెద్దలు? ఎవరు పిన్నలు? పెద్ద మనస్సు కలిగిన పిన్నలు పెద్దలు కాకపోతారా? చిన్న బుద్ధులున్న పెద్దలు పిన్నలు కాకుండా ఉంటారా?

**ఆఖ్యాయిక**

యంత్రాలు తయారు చేసే ఒక కంపెనీ వారు ఆ నగరం లోనే ఉన్న ఒక సంస్థకు ఒక యంత్రాన్ని అమ్మడం జరిగింది. పక్షం రోజులు గడచిన తరువాత, యంత్రము సరిగ పని చేయడం లేదు. దానిని సరి చేసే వారిని ఎవరి నైనా పంపించండి అని కంపెనీకి ఫోన్ చేశారు ఆ సంస్థవారు.

వెంటనే ఒక వ్యక్తిని పంపించారు కంపెనీ వారు. ఆ వచ్చిన వ్యక్తి యంత్రాన్ని పరిశీలించే లోగా, సంస్థ వారు కంపెనీకి మళ్ళీ ఫోన్ చేశారు. అయ్యా! మీరు పంపిన వ్యక్తి వచ్చాడు. కాని, అతడు చాలా కుర్రవాడు. ఎవరి నైనా పెద్ద వ్యక్తిని పంపించండి అని సంస్థ యజమాని అడిగాడు.

ఫరవాలేదు. మీరేమీ ఆదుర్దా చెందకండి. అతడు సరిపోతాడు. ఆ యంత్రాన్ని కనిపెట్టింది ఆ కుర్రవాడే అని కంపెనీ వారు సమాధానం ఇచ్చారు.

ధర్మం విషయంలో గాని, జ్ఞానం విషయంలో గాని పరిగణించ వలసింది వయస్సును కాదు. జీవన విధానాన్ని, బుద్ధి వికసనాన్ని. అవి లోపించడం వల్లే తన వాళ్ళు, పాండవులు కురుక్షేత్రంలో ఏమి చేశారు? (*కిం అకుర్వత?*) అని ధృతరాష్ట్రుడు సంజయుని ప్రశ్నించాడు.

**ఎవరు చేయాలి? ఏమి చేయాలి?**

సంజయా! సమరాభిలాషతో కురుక్షేత్రానికి చేరిన నా వాళ్ళు - పాండవులు ఏమి చేశారు? అని వింతగా ప్రశ్నించాడు ధృతరాష్ట్రుడు. యుద్ధభూమిలో ఎవరైనా ఏం చేస్తారు? ఉభయులు కరచాలనం చేసుకొని కలసి భోంచేస్తారా? పరస్పరం మందహాసాన్ని చిందిస్తూ, కుశల ప్రశ్నలు వేసుకొంటూ, పాచికలు ఆడుకుంటారా? ఏమీ చేయరు, యుద్ధం తప్ప! అలాంటప్పుడు ఏం చేశారు అని ప్రశ్నించడ మేమిటి? ఏదో చేయాలి అనేది ఆయన దుగ్ధ. బుద్ధిలో దురద.

ఆలయంలో ప్రవేశిస్తే చాలు. హంతకుడి కైనా ఆ సమయంలో మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. భక్తి కలుగుతుంది. కురుక్షేత్రము పుణ్యక్షేత్రం. ధర్మస్థలం. తపో వనం. శాంతి నిలయం. ధర్మక్షేత్ర మైన కురు క్షేత్రంలో కాలు మోపిన వీరులకు ధర్మ స్పృహ కలగ లేదా? వారి మనస్సులు మార లేదా? వారిలో పరివర్తన రాలేదా? అనేదే ధృతరాష్ట్రుని ఆశ.

**అనుకూలమా? ప్రతికూలమా?**

పుణ్యక్షేత్రంలో ప్రవేశించ గానే మనస్సులు మారుతాయా? మనుష్యులు పరివర్తన చెందుతారా? పుణ్య సంకల్పాలు గల పుణ్యాత్ములకు పుణ్యక్షేత్రాలు ఓడలకు తెరచాప ల్లాగా సహకరిస్తాయి. ఉపకరిస్తాయి. అంతేగాని, పుణ్యస్పృహ లేని పాపాత్ములను మార్చే శక్తి పుణ్యక్షేత్రాలకు లేదు.

విద్యుద్దీపంలో విద్యుద్వాహక తీగ (ఫిలమెంటు) ఉంటేనే అందులో విద్యుచ్ఛక్తి ప్రసరిస్తుంది. తీగ వీడిపోతే లేదా ఊడిపోతే, విద్యుచ్ఛక్తి ప్రసరించి మాత్రం ఏం చేస్తుంది? దీపాన్ని వెలిగిస్తుందా? కాంతిని ప్రసరింప చేస్తుందా? పాపాత్ములు ఫిలమెంట్లు రాలిపోయిన బల్బుల వంటివారు. అట్టి వారిలో పుణ్యకాంతిని ప్రసరింప చేయడం పుణ్యక్షేత్రాలకు కూడా సాధ్యం కాదు.

అంతమాత్రాన విద్యుచ్ఛక్తి నిరుపయోగమా? నిరుపయోగ మైతే, మరొక బల్బును ఎలా వెలిగిస్తూ ఉంది? పుణ్యాత్ములే పుణ్య ఫలాలను అందుకుంటారు. చిల్లికుండ నీటిని నిలబెట్టుకో లేని విధంగా పాపాత్ములు పుణ్యాన్ని కార్చేసు కుంటారు. పుణ్య ఫలాలను రాల్చేసు కుంటారు. అంతమాత్రాన పుణ్యక్షేత్రాల వైభవం తరగదు. కరగదు.

**ఎవరు మారాలి? ఎందుకు మారాలి?**

మనస్సులు మారితే మారణహోమం ఆగుతుందని అంబికేయుని అభిప్రాయమా? అదే నిజమైతే, ఎవరి మనస్సులు మారాలి? ఎవరిలో మార్పు వస్తే సమరం ఆగుతుంది? ఈ విషయంలో ప్రధానంగా ముగ్గురే కనిపిస్తున్నారు. ఈ ముగ్గురిలో ఎవరు సంకల్పించినా రణం ఆగుతుంది. వారెవరంటే, ఒకడు ధృతరాష్ట్రుడు. రెండవ వాడు దుర్యోధనుడు. మూడవ వాడు ధర్మరాజు.

యుద్ధం నివారింప బడాలి అనేదే కనుక ధృతరాష్ట్రుని అభిప్రాయ మైతే, ఈ యుద్ధం జరగటానికి వీల్లేదు అని తాను ఒక్క ఆజ్ఞ జారీ చేస్తే సరిపోయేది. ఆ ఆదేశాన్ని ఆధారం చేసికొని భీష్మద్రోణాదు లతో పాటు మరెందరో వీరులు ధృతరాష్ట్రునికి మద్దత్తుగా నిలిచి యుద్ధాన్ని తీవ్రంగా ప్రతిఘటించి ఉండేవారు. భీష్మద్రోణులు లేకుండా దుర్యోధనుడు రణరంగంలో కాలు పెట్ట గలడా? ఇదంతా ధృతరాష్ట్రునికి తెలియదా? తెలుసు. మమకార ఊబిలో చిక్కుకు పోయిన మహానుభావుడికి ఏమి తెలిసి మాత్రం ఏం లాభం? తన మనస్సు మారదు. మారలేదు. తానే మార నప్పుడు, తన రక్తాన్నే పంచుకొని పుట్టి, దానికి తోడు దుష్ట ప్రారబ్ద సహజత్వంతో చెలరేగి పోతున్న దుర్యోధనుడు మారుతాడా? దుర్యోధనుడు మారనే మారడు అని క్షుణ్ణంగా తెలిసిన వాడు కూడా ధృతరాష్ట్రుడే.

తాను మారలేడు. తన కుమారుడు మారడు. ఇక ఎవరు మారాలి అని ఆయన అభిమతం? ఇంకెవరు? మిగిలింది ధర్మరాజే కదా! ధర్మరాజే మారాలి. ధర్మరాజు ధర్మాత్ముడు కనుక ధర్మక్షేత్ర మైన కురుక్షేత్రంలో ప్రవేశించ గానే ధర్మస్పృహ ఆవేశించి, సమరంపై ఉత్సాహం తరిగి, రాజ్యంపై విరక్తి పెరిగి, యుద్ధాన్ని నిరసించి మళ్ళీ కట్టుబట్టలతో కానల కేగే ప్రయత్నం చేయలేదా? అనేదే ఆయన గారి ప్రశ్నాంతరం.

ఇన్ని ఆలోచనలతో సతమత మౌతూ, అంతర్యాన్నే రణక్షేత్రంగా మార్చుకున్న ధృతరాష్ట్రుడు *కిం అకుర్వత?* యుద్ధభూమిలో ఏమి చేశారు? అంటూ పగలే కలవరిస్తున్నాడు.

**అధర్మం అచ్చి రాదు - ధర్మమే రక్షించాలి**

ఈ సందర్భంలో ఒక్క విషయాన్ని మనం జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. యుద్ధం ఎలా జరిగింది? అని ధృతరాష్ట్రుడు సంజయుని సూటిగా ప్రశ్నించి ఉంటే విషయం స్పష్టంగా ఉండేది. అలా కాకుండా, యుద్ధంలో ఏమి చేశారు? *(కిం అకుర్వత?)* అని ప్రశ్నించడం వల్లే విషయం మీమాంసకు దారి తీసింది.

ఏమి చేశారు? అని ప్రశ్నించడం లోనే, మనం ముందు గానే విశ్లేషించు కున్నట్లు, ఎవరో ఏదో చేయాలని, దాని వల్ల మరేదో జరగాలని ధృతరాష్ట్రుడు ఆశిస్తున్నాడు అనేది నిర్వివాదాంశం. సరే. ఇంతకీ ఏమి చేయాలి? ఎవరు చేయాలి? ఏమి జరగాలి?





తన కుమారులు గెలవాలి. పాండవులు ఓడిపోవాలి. ధృతరాష్ట్రుడు అంతకు మించి ఆలోచించడం లేదు. ఆయనకి కావలసింది అదే. అంతే.

దుర్యోధనుడు గెలవాలి. కాని, అధర్మపరుడు కనుక గెలవ డేమో అనే భయం. ధర్మరాజు ధర్మప్రభువు కనుక రాజ్యాన్ని త్యజిస్తాడు అనే ధైర్యం. ధర్మరాజు తనంతట తాను యుద్ధము నుండి విరమిస్తే, తన బిడ్డకు రాజ్యం దక్కుతుంది అనే ఆశ. ఇలా ఎందుకు జరగలేదు? అనేదే ధృతరాష్ట్రునిలో సంఘర్షణ.

**అసందర్భ ప్రలాపం**

భగవద్గీత మహాభారతం భీష్మపర్వంలో ఇరవై ఐదవ అధ్యాయంలో ప్రారంభ మైంది. యుద్ధం ప్రారంభ మైన పదవ రోజు భీష్మాచార్యుడు రథం నుండి పతన మయ్యాడు. ఆ విషయాన్ని చెప్పటానికి పరుగెత్తుకొంటూ సంజయుడు ధృతరాష్ట్రుని మందిరానికి వచ్చాడు.

**సంజయోఽహం మహారాజ నమస్తే భరతర్షభ ।**
**హతో భీష్మ శ్శాంతనవో భారతానాం పితామహః ॥**
**యస్య వీర్యం సమాశ్రిత్య ద్యూతం పుత్ర స్తవా కరోత్ ।**
**స శేతే నిహతో రాజన్ సంఖ్యే భీష్మః శిఖండినా ॥**

మహారాజా! నేను సంజయుణ్ణి. నమస్కారము. భరతవంశ పితామహుడు, శంతన మహారాజ నందనుడు భీష్ముడు శరతల్పంపై ఉన్నాడు. ఎవరి శౌర్య పరాక్రమాలపై ఆశలు పెట్టుకొని, నీ కుమారుడు కపట జూదమును నిర్వహించి యుద్ధానికి సిద్ధపడ్డాడో, ఆ భీష్ముడు శిఖండి విడిచిన బాణాలకు గురై పతన మయ్యాడు. నీ కొడుకు ఆశలన్నీ అడియాస లయ్యాయి అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పాడు.

ఈ వాస్తవాన్ని ధృతరాష్ట్రుడు జీర్ణించుకోలేక పోయాడు. సంజయుని మళ్ళీ మళ్ళీ ప్రశ్నించాడు. మహేంద్ర తేజోసముడు, నరశార్దూల మైన భీష్ముడు హతుడయ్యాడా! అని విస్మెర పోయాడు.

**కథం భీష్మేణ సంగ్రామ మకుర్వన్ పాండునందనాః ।**
**కథం చ నా జయ ద్భీష్మో ద్రోణే జీవతి సంజయ ॥**

సంజయా! యుద్ధంలో భీష్ముని ఎదుర్కొని పాండుసేనలు ఎలా నిలిచాయి? యుద్ధం ఎలా జరిగింది? *(కథం?)* ద్రోణుడు జీవించి యుండగా భీష్ముడు ఎలా పతన మయ్యాడు? కృపాచార్యుడు సమీపంలో లేడా? **(కృపే సన్నిహితే తత్ర భరద్వాజాత్మకే తథా)** అని ప్రశ్నల వర్షం కురిపించాడు.

ఇదంతా పదమూడు, పద్నాలుగు అధ్యాయాలలో జరిగిన ధృతరాష్ట్ర సంజయ సంభాషణము. ఆ తరువాత యుద్ధభూమిలో జరిగిన విషయాలన్నీ పూస గ్రుచ్చినట్లు సంజయుడు ధృతరాష్ట్రునికి వివరించి చెప్పాడు. వారి సంవాదమును పది అధ్యాయాలలో వాయు వేగంతో ముగించుకొని మహాభారతం ఇరవై ఐదవ అధ్యాయం దగ్గరకు వచ్చి ఆగింది. ఇక్కడ భగవద్గీత ప్రారంభ మైంది.

ఇదీ సందర్భము. ఈ సన్నివేశంలో యుద్ధంలో నా వారు, పాండవులు ఏమి చేశారు? **(కిం అకుర్వత)** అని ప్రశ్నించడం అసందర్భ ప్రలాపం కాదా!

ముందు గానే నేను వివరించినట్లు యుద్ధం ఎలా జరిగింది? అని ధృతరాష్ట్రుడు సంజయుని ప్రశ్నించి ఉండాలి. కాని, అది కూడా అప్రస్తుతమే నని ఇప్పటికే విజ్ఞులకు అర్థమై ఉంటుందని భావిస్తున్నాను.

భీష్ముడు హతు డయ్యాడు అని సంజయుడు చెప్పగానే, యుద్ధం ఎలా జరిగింది? అని ధృతరాష్ట్రుడు

వెంటనే ప్రశ్నించాడు. మళ్ళీ ఇక్కడ అడగ నవసరం లేదు. *కథం* అనే మాటకే అవకాశం లేనపుడు *కిం అకుర్వత* అనే మాట ఎలా అంకురిస్తుంది?

భాషాపరంగా వ్యాకరణశాస్త్రంలో తలదూర్చి అర్థం చేసుకుంటే, *కిం అకుర్వత* అనే మాట విచిత్రాల మూటను విప్పుతుంది.

***కిం అకుర్వత*** అనే మాటను సమస్త పదంగా తీసుకుంటే, ***కిం అకుర్వత*** - ఎంత తప్పు చేశారు! అనే అర్థం వస్తుంది. అంటే, అలా చేయకుండా ఉంటే బాగుండేది అనే భావం ధ్వనిస్తుంది. సంజయా! యుద్ధాభిలాషతో ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో సమావేశమై నా వాళ్ళు, పాండవులు ఎంత తప్పు చేశారు! అనే అర్థం స్ఫురిస్తుంది.

అలా సమస్త పదం కాకుండా, వ్యస్తమైతే, ***కిం అకుర్వత*** అంటే ఏదో చేశారు అనే అర్థం వస్తుంది. అంటే, వాళ్ళకు తోచిందేదో వాళ్ళు చేసుకు పోయారు. ఏదో చేశారు. ఏదేదో చేసేశారు. ఏమేమో చేసేశారు. అలా చేసి సాధించిం దేముంది? ఏమి ఉపయోగం? అనే అర్థం వస్తుంది. సమర వాంఛతో ధర్మక్షేత్ర మైన కురుక్షేత్రంలో సమావేశ మైన నా వాళ్ళు, పాండవులు , సంజయా! ఏదో చేసేశారయ్యా! అనే అర్థం ధ్వనిస్తుంది. ఏమిటో, అంధ మహారాజు! ఒక్క మాట పలికి అందరినీ గందరగోళంలో ముంచేస్తూ, ఎవరికీ అందకుండా పోతున్నాడు.

## అంబికేయుని అంతర్మథనం

యుద్ధం భయంకరంగా సాగుతోంది. ఇప్పటికే ఎందరో మరణించారు. భీష్ముడు హతుడయ్యాడు. గుండె గుబేలు మంటోంది. ఏ క్షణాన ఏమి వినవలసి వస్తుందో అనే భయం మనసును పీడిస్తోంది. ఇలా ఎందుకు జరిగింది? అని ఆంతర్యం ప్రశ్నిస్తోంది. మరో విధంగా ఎందుకు జరగలేదు? అని చిత్తం చింతిస్తోంది. దారుణమైన ఈ అంతర్మథనంలో ఏమి అడగాలని ఆ మహారాజు భావిస్తున్నాడో, ఏమి అడుగుతున్నాడో ముమ్మొందు మందహాసంతో మాటలు కదిలించే మువ్వల వానికే తెలియాలి. చిరునవ్వుల వానికే తెలియాలి.

ఏది ఏమైనా అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పాలి కదా అనుకొంటూ, సంజయుడు స్మృతి పుటలలో తల దూర్చి, పది రోజులు వెనక్కి వెళ్ళి, యుద్ధంలో మొదటి రోజు ఏం జరిగిందో చెప్పడం ఆరంభించాడు. యుద్ధం ఎలా జరిగింది? అని అడిగినా, యుద్ధభూమిలో ఏమి చేశారు? అని ప్రశ్నించినా సమాధానం సరిపోయే లాగా త్రికాలవేది, సర్వాన్ని ప్రత్యక్షంగా దర్శించే శక్తి గల సంజయుడు *(ప్రత్యక్షదర్శీ సర్వస్య భూత భవ్య భవిష్య విత్)* చెప్పడం ఆరంభించాడు.

**సంజయ ఉవాచ :**

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధన స్తదా ।
ఆచార్య ముపసంగమ్య రాజా వచన మబ్రవీత్ ॥ 2

*దృష్ట్వా-తు-పాండవానీకం-వ్యూఢం-దుర్యోధనః-తదా*
*ఆచార్యం-ఉపసంగమ్య-రాజా-వచనం-అబ్రవీత్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| తదా | = | అప్పుడు | దృష్ట్వా | = | వీక్షించి |
| రాజా | = | రాజైన | తు | = | ఆ తరువాత |
| దుర్యోధనః | = | దుర్యోధనుడు | ఆచార్యమ్ | = | ద్రోణాచార్యుని |
| వ్యూఢం | = | వ్యూహంగా ఏర్పాటైన | ఉపసంగమ్య | = | సమీపించి |
| పాండవానీకం | = | పాండవ సైన్యమును | వచనం | = | మాటను |
| | | | అబ్రవీత్ | = | పలికాడు |





**సంజయుడు చెబుతున్నాడు :**

**మహారాజా! వ్యూహంగా ఏర్పడిన పాండవ సైన్యాన్ని దుర్యోధన మహారాజు చూశాడు. వెంటనే ద్రోణాచార్యుల వద్దకు వెళ్ళాడు. తన పలుకును వినిపించాడు.**

### వ్యాఖ్య

## అజ్ఞానము - అహంకారము

అజ్ఞానాంధకారంలో అలమటిస్తున్న అంబికేయుని అప్రస్తుత ప్రసంగాన్ని అర్థం చేసుకున్నాం. అజ్ఞానానికి బిడ్డ అహంకారము. ధృతరాష్ట్రుని బిడ్డ దుర్యోధనుడు. మొదటి శ్లోకంలో ధృతరాష్ట్రుని దర్శనం. రెండవ శ్లోకంలో దుర్యోధనుని భాషణం.

పాండవ సేనను చూచిన దుర్యోధనుడు ద్రోణాచార్యుని వద్దకు వెళ్ళి భాషించాడు అంటున్నాడు సంజయుడు. ఈ శ్లోకము వద్ద దుర్యోధనుడు ప్రవేశించి భాషించడం జరిగింది. కాని, 'దుర్యోధన ఉవాచ' అని వ్యాసుడు ప్రస్తావించ లేదు. దుర్యోధనుని మాటల్ని సంజయుని చేతనే చెప్పించాడు. 'ధృతరాష్ట్ర ఉవాచ' ఉంది కదా మళ్ళీ ఈయన గారు ఎందుకు లెమ్మని భావించాడేమో! మొదటి శ్లోకం మంగళార్థ మైనా ఉపయోగ పడింది. చిన్నదొర గారిది అంతా అహంకార ప్రదర్శనమే కదా అని భావించి, పవిత్రాత్ముడైన సంజయుణ్ణే ఉపయోగించు కున్నాడేమో వ్యాసుడు!

## సంధిలో సంజయుడు

మొదటి శ్లోకంలో 'సంజయా' అనే సంబోధన విన పడింది. రెండవ శ్లోకం నుండి 'సంజయ ఉవాచ' అంటే, సంజయుడే వినిపించడం జరుగుతూ ఉంది. సంజయా! అంటూ ధృతరాష్ట్రుడు పలికాడు. దుర్యోధనుడు పలికింది సంజయుడు వినిపించాడు. ఇరువురి మధ్య సంజయుణ్ణే ప్రధానం చేశాడు వ్యాసమహర్షి. ధృతరాష్ట్ర దుర్యోధనుల వంటి వ్యక్తుల మధ్య సంజయుడి లాగా జీవించమని చెప్పకనే చెబుతున్నాడు.

ధృతరాష్ట్రునిలో కోరుకో వలసింది కనిపించదు. దుర్యోధనునిలో ఏరుకో వలసింది వినిపించదు. మొదటిది అంతా అజ్ఞానమే. రెండవది అంతా అహంకారమే. ఈ మధ్యలో నిలిచిన మధ్యవర్తి సంజయుడే ఆదర్శమూర్తి. అందుకే నేమో గీత మొదటి శ్లోకమును విన్నవాడు సంజయుడు. గీత చివరి శ్లోకమును వినిపించిన వాడు కూడా సంజయుడే. జయమును ఆశించే వారు, విజయమును కాంక్షించే వారు సంజయుణ్ణే ఆదర్శంగా తీసుకోవాలి.

***సర్వోత్కర్షేణ జయ సంజయ*** - అన్ని విధాల విజయమును సాధించ మని ఆశీర్వదిస్తుంది సంజయ నామం.

**సమ్యక్ జయః యస్య సః సంజయః**

ఇంద్రియ మనస్సులను చక్కగా జయించిన వాడు సంజయుడు. కురుక్షేత్రంలో వీరులు ఏమి చేశారు? అని ధృతరాష్ట్రుడు అడిగిన ప్రశ్నకు, రాజైన దుర్యోధనుడు వ్యూహముగా ఉన్న పాండవ సేనను చూచి, ఆచార్యుడైన ద్రోణాచార్యుని సమీపించి ఇలా చెబుతున్నాడు అనే సమాధానాన్ని వినిపించాడు సంజయుడు.

## బాహ్య దృశ్యము

అనూహ్యమైన రీతిలో వ్యూహాకారంగా కనిపిస్తున్న పాండవ సైన్యాన్ని దుర్యోధనుడు చూశాడు. ఇది

బాహ్యం లోని యుద్ధ దృశ్యము. రణరంగంలో సైన్యాన్ని ఒక ప్రత్యేకమైన రూపంలో నిర్మించడాన్ని వ్యూహం అంటారు.

పద్మం యొక్క ఆకారంలో సైన్యాన్ని నిలబెడితే అది పద్మవ్యూహము. ముందు ఎక్కువ సైన్యము ఉండి వెనుక తక్కువ సైన్యాన్ని ఉంచితే అది మకర వ్యూహము. ముందు తక్కువ సైన్యము ఉండి వెనుక ఎక్కువ సైన్యము ఉంటే అది శకట వ్యూహము. చీమల బారు లాగా సైన్యమంతా ఒకే వరుసలో ఉంటే, అది సూచికా వ్యూహము. ఈ విధంగా గారుడ వ్యూహము, దండ వ్యూహము, వరాహ వ్యూహము అని అనేక వ్యూహా లున్నాయి. అవసరాలను దృష్టిలో ఉంచుకొని ఆయా సేనాధిపతులు వ్యూహాలను నిర్మిస్తూ ఉంటారు.

పాండవులు నిర్మించిన వ్యూహాన్ని చూచి భయపడిన దుర్యోధనుడు ఆచార్యుడైన ద్రోణుని సమీపించాడు. సైన్యాన్ని చూడగానే **(దృష్ట్వా తు)** భయ పడ్డాడు. భయ పడగానే **(తదాతు)** ద్రోణాచార్యుని సమీపించాడు. యుద్ధభూమి దుర్యోధనునికి తెలియనిదా? ఎందుకని భయ పడ్డాడు? దుర్యోధనుని భయానికి మూడు కారణాలు కనిపిస్తున్నాయి.

**అంతర్యుద్ధము**

కురుక్షేత్రంలో కౌరవ సైన్యంతో పోల్చితే పాండవుల సైన్యము తక్కువే. పదకొండు అక్షౌహిణుల సైన్యం కౌరవుల వైపు ఉంటే, ఏడు అక్షౌహిణుల సైన్యం మాత్రమే పాండవుల వైపు ఉంది.

ఎందరో రాజులు తనకు బాసటగా నిలిచారు. అసమాన పరాక్రమవంతులతో తన సేన అపర్యాప్తంగా ఉంది. ఇలాంటి సేనను ఎదుర్కొనే రీతిలో పాండవులు సేనను సమకూర్చుకో లేరు అని దుర్యోధనుడు ఇంతకాలం ఊహించాడు. కాని నేడు రణరంగంలో అనూహ్యంగా ఏడు అక్షౌహిణుల సైన్యాన్ని చూడగానే **(దృష్ట్వా తు)** దిగ్భ్రాంతి చెందాడు. 'తు' శబ్దం ఈ వాస్తవానికి అద్దం పడుతోంది. దుర్యోధనుని భయానికి ఇది మొదటి కారణము.

**అంతర్యుద్ధంలో అల్లకల్లోలం**

పాండవుల సేన పెద్దదే కావచ్చు. తన సేన అంత కంటే పెద్దది కదా! పాండవ సైన్యంలో గొప్ప వీరులు ఉంటే ఉండొచ్చు. అలాగని, తన సేనలో ఉన్న వీరులు మాత్రం తక్కువ వారా? మరి దుర్యోధనునికి భయ మెందుకు?

నిజమే. తన సైన్యంలో వీరు లున్నారు. శూరు లున్నారు. కాని, పాండవ సైన్యంలో ఉండే వీరులకు, తన సైన్యంలో ఉండే వీరులకు మధ్య ఏదో అంతరం ఉంది అని ఆంతర్యం ఘోషిస్తోంది.

తన వైపు భీష్ముడు ఉన్నాడు. కాని, యుద్ధం చేయడం అతనికి ఇష్టం లేదు. ఆచార్యుడైన ద్రోణుడు ఉన్నాడు. కాని, భీష్ముడు లాగా స్థిరమైన వాడు కాడు. ఇక కర్ణుడు ఉన్నాడు అంటే, అతడు విశ్వాసపాత్రుడే. తన కొరకు ప్రాణం ఇస్తాడు. కాని, అత్యవసర సమయంలో ఆమడ దూరాన ఉంటాడు. ఇక వికర్ణుడు, విదురుడు, సంజయుడు - వీళ్ళందరూ పాండవ పక్షపాతంతో వ్యవహరించే వారే. ఎందరో తనతో కలసి ఉన్నారు. కాని, పాలలో పంచదార లాగా తన మనస్సులో మనస్సుగా కలసిన వారెందరు?

ఇక పాండవుల వైపు చూస్తే, అందరూ హితులే. సన్నిహితులే. అవసరమైతే ప్రాణాలు అర్పించడానికి సంసిద్ధంగా ఉన్నవారే. పైగా, కొండంత అండగా శ్రీకృష్ణుడు వాళ్ళ మధ్యే ఉన్నాడు. ఎందరో దేవతల ఆశీర్వాదాలు పాండవులకు ఉన్నాయి. తన విజయాన్ని కాంక్షించే వారి కన్నా, పాండవుల విజయాన్ని కాంక్షించే వారే ఎక్కువగా కనిపిస్తున్నారు. దుర్యోధనుని భయానికి ఇది రెండవ కారణము.





**అపరాధాలే అవరోధాలు**

తప్పు చేసిన వారు ఎంతటి వారైనా తప్పించుకో లేరు. చట్టము నుండి తప్పించు కుంటే తప్పించుకో వచ్చు. చిత్తము నుండి తప్పించుకో లేరు. నిలదీసే చిత్తాన్ని పడుకోబెట్ట లేరు.

పాపిని పాపమే శిక్షిస్తుంది. పాపం చేశావు - పాపం చేశావు అంటూ, తన మనస్సే తనను శపిస్తూ ఉంటుంది. అందుకే దోషి ధైర్యంగా ఉండ లేడు. పైకి ధైర్యంగా ఉన్నా, లోపల దీనుడై ఉంటాడు. హీనుడై ఉంటాడు. దోష రహితులైన వారి ముందు మరీ కుంచుకు పోతాడు. తాను ముందుకు సాగా లనుకున్నా, మనస్సు వెనక్కి లాగుతూనే ఉంటుంది.

పాండవుల సైన్యములో అందరూ సత్పురుషులే. సజ్జనులే. మహాత్ములే. పుణ్యాత్ములే. వారిని చూడగానే దుర్యోధనుని మనస్సు సహజం గానే సంకోచించి ఉంటుంది. ఇది దుర్యోధన మహారాజు భయానికి మూడవ కారణము.

**ఆచార్యుని ఆశ్రయము**

భయంతో చలించి పోయిన దుర్యోధనుడు, భయపడిన పిల్లవాడు పెద్దల వద్దకు పరుగు లెత్తినట్లు, ద్రోణాచార్యుల వారి వద్దకు వెళ్ళాడు. బాహ్య ఓటమి కన్నా ముందే, దుర్యోధనుని మనస్సులో ఓటమి చేరి పోయింది. అపజయ శంక బుద్ధిలో ప్రవేశించింది. ఆంతర్యం అల్లకల్లోల మైంది. అందుకే ఆచార్యుని ఆశ్రయించాడు.

**ఆచారా లేమయ్యాయి?**

ఆచార్యుని సరే ఆశ్రయించాడు. సంప్రదాయాన్ని పాటించ నవసరం లేదా? సంప్రదాయాన్ని విస్మరిస్తే సదాచారాలు మిగుల్తాయా? సదాచారం లేకుండా సత్ప్రవర్తన ఎలా సాధ్యం?

ఆచార్యుని సమీపించి నపుడు అభివాదం చెయ్యాలా లేదా? మరి దుర్యోధనుడు చేశాడా? లేదు. ఇది దుర్యోధనుని దురాచార ప్రవృత్తి కాదా?

కాదులెండి. యుద్ధభూమిలో ద్రోణ దుర్యోధనులు గురుశిష్యులుగా లేరు. దుర్యోధనుడు రాజు స్థానంలో ఉన్నాడు. శాసించే స్థితిలో ఉన్నాడు. ద్రోణుడు సేనాధిపతి స్థానంలో ఉన్నాడు. కాబట్టి అభివాదం చేయక పోవడం అనాచార మేమీ కాదు అని మీరు అనవచ్చు.

అదే నిజమైతే, సేనాధిపతి రాజు వద్దకు రావాలి గాని, రాజు సేనాధిపతి దగ్గరకు వెళ్ళడ మేమిటి? అనే ప్రశ్న కూడా ఉదయిస్తుంది. అదే గాక, తరువాత శ్లోకంలో ద్రోణుణ్ణి 'ఆచార్యా!' అంటూ దుర్యోధనుడే సంబోధిస్తాడు. దానిని బట్టి వారి మధ్య గురుశిష్య సంబంధమే ఉంది అని ధ్రువ పడుతూ ఉంది. అభివాదము చేయక పోవడం వెనుక రాజు గారి అహంకారమే ప్రధానం గాని మరొక కారణం కాగడా పెట్టి వెతికినా కనిపించదు.

**సంజయుని సంకేతము**

దుర్యోధనుడు సరే. సంజయుడు చేసింది బాగుందా? ధృతరాష్ట్ర మహారాజు వద్ద, రాజైన దుర్యోధనుడు అని సంజయుడు పలకడం సమంజసమా? కానే కాదు. అది సంజయునికి తెలియనిదీ కాదు. ధృతరాష్ట్ర మహారాజా! తానే రాజైనట్లు తొలి నుండి దుర్యోధనుడు ప్రవర్తించడం వల్లనే ఈ దౌర్భాగ్యము దాపురించింది.

అనర్థము ప్రాప్తించింది అని వ్యంగ్యంగా పలకడమే సంజయుని మనోభావము. ఈ విధమైన సంభాషణము వాళ్ళిద్దరి మధ్య మహాభారతంలో అనేక చోట్ల కనిపిస్తుంది కూడా.

**పశ్యైతాం పాండుపుత్రాణాం అచార్య మహతీం చమూమ్ ।**
**వ్యూఢాం ద్రుపద పుత్రేణ తవ శిష్యేణ ధీమతా ॥** 3

**పశ్య-ఏతాం-పాండుపుత్రాణాం-ఆచార్య-మహతీం-చమూం**
**వ్యూఢాం-ద్రుపద పుత్రేణ-తవ-శిష్యేణ-ధీమతా**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆచార్య | = | ఓ ఆచార్యా! | పాండుపుత్రాణాం | = | పాండుతనయుల |
| తవ | = | నీ యొక్క | ఏతాం | = | ఈ |
| ధీమతా | = | బుద్ధిమంతుడు | మహతీం | = | గొప్పదైన |
| శిష్యేణ | = | శిష్యుడు | చమూం | = | సైన్యమును |
| ద్రుపద పుత్రేణ | = | ద్రుపదుని కుమారునిచే | పశ్య | = | చూడు! |
| వ్యూఢాం | = | వ్యూహంగా ఏర్పడిన | | | |

**ఆచార్యా! పాండవుల సైన్యము ఎంత గొప్ప వ్యూహంతో నిలబడి ఉందో చూడండి. దానిని నిర్మించింది ద్రుపదుని కొడుకైన ధృష్టద్యుమ్నుడు. మీ శిష్యుడు. బుద్ధిమంతుడు.**

**వ్యాఖ్య**

భయ భ్రాంతులతో విహ్వలుడైన గాంధారీ నందనుడు తన పక్షాన్ని తాను చక్క బరచుకొనే ప్రయత్నంలో పడ్డాడు. కర్ణుడేమో యుద్ధానికి దూరంగా ఉన్నాడు. ద్రోణుడు ఉన్నా, అతనిపై దుర్యోధనునికి భీష్మునిపై ఉన్నంత విశ్వాసం లేదు. అందుచేత, తన సైన్యానికి అధిపతిగా ఉన్న భీష్మాచార్యుల వారిని సంప్రదించడానికి బదులుగా ద్రోణాచార్యుని సమీపించాడు.

ఆచార్యా! అటు చూడు! పాండవుల సైన్యము చాలా గొప్పగా ఉంది. ఆ వ్యూహాన్ని రూపొందించిన వాడు ద్రుపదుని కుమారుడు. నీ శిష్యుడైన ధృష్టద్యుమ్నుడు బుద్ధిమంతుడు అని వ్యంగ్యంగా, మర్మంగా పలికాడు. శత్రుపక్షంపై విరుచుకు పడేలా ప్రేరేపించే ప్రయత్నంలో, త్రాచుపాము తోక త్రొక్కినట్లు ద్రోణాచార్యుని ఉసి గొల్పుతూ భాషించాడు.

**మిత్ర భేదం - స్వలాభం**

గొప్పదైన పాండవ సైన్యాన్ని చూడండి అంటున్నాడు దుర్యోధనుడు. పదకొండు అక్షౌహిణులతో తన సైన్యము ఉండగా, ఏడు అక్షౌహిణుల పాండవ సైన్యాన్ని గొప్పదిగా వర్ణించడంలో ***(మహతీం చమూం)*** దుర్యోధనుని హృదయం ఎంత భయ కంపితంగా ఉందో అర్థ మవుతూనే ఉంది. దుష్ట పన్నాగాలతో, రహస్య కుతంత్రాలతో కలుషిత మైన దుష్టులు విశ్వాస పాత్రులైన వారిని కూడా దారుణంగా శంకించడం, దోషాన్ని అంటగట్టి దుర్భాష లాడటం మనం చూస్తూనే ఉంటాం. ప్రస్తుతం దుర్యోధన చక్రవర్తి ఆ పని లోనే నిమగ్నమై ఉన్నాడు.

పాండవ వ్యూహకర్త ధృష్టద్యుమ్నుడు అనకుండా ద్రుపదుని కొడుకు అంటున్నాడు. మిత్రులైన ద్రుపద ద్రోణులు విభేదంతో విడి పడటం ఎప్పుడో జరిగింది. తనకు జరిగిన అన్యాయానికి ప్రతీకారంగా ద్రోణుడు అర్జునుని ద్వారా ద్రుపదుని అవమానించాడు. ద్రోణునిపై పగ తీర్చుకోవ డానికి ద్రుపదుడు యజ్ఞం చేసి





ధృష్టద్యుమ్నుని బిడ్డగా పొందాడు. ఇదంతా గతం. ఈ గతం ద్రోణాచార్యుని స్వగతమే కదా! అది ఆయనకు తెలియదా? మరి, దుర్యోధనుడు ఎందుకు చెప్తున్నాడు?

నీపై ప్రతీకారం తీర్చుకోవ డానికి ద్రుపదుడు తన కుమారునితో సిద్ధ మయ్యాడు. ఏం చెయ్యాలో ఆలోచించుకో అనే భావాన్ని స్ఫురింప జేస్తూ ద్రోణాచార్యుని రెచ్చగొాడు తున్నాడు. అంతే.

**పాముకే పాలు పోసింది**

ద్రోణుడు ధృష్టద్యుమ్నునికి విలువిద్య నేర్పాడు. తన ప్రాణం తీయాలనే ఏకైక లక్ష్యంతో ఆవిర్భవించిన వాడికి ఎవరైనా విలువిద్య నేర్పుతారా? కాటేయడానికి సిద్ధంగా ఉన్న సర్పానికి ఎవరైనా పాలు పోస్తారా?

ఇప్పుడు చూడు. నీ శిష్యుడే కదా? ***(తవ శిష్యః)*** ఇక చూపిస్తాడు తడాఖా! ***నీవు నేర్పిన విద్యయే నీరజాక్ష*** - నీ పైనే శర ప్రయోగం చేయడానికి సిద్ధంగా ఉన్నాడు. ఏం చేస్తాం? నీ శిష్యుడు కదా! బుద్ధిమంతుడు ***(ధీమతా).*** గురువునే గుర్తులు మిగలకుండా చేయాలనే శిష్యుడు. భళా! గొప్ప బుద్ధిమంతుడేలే! అంటూ వ్యంగ్యాస్త్రాలు సంధిస్తున్నాడు దుర్యోధనుడు.

***ధీమతా*** అనే పదాన్ని చాలా లోతైన అర్థంతో ప్రయోగించాడు దుర్యోధనుడు. రణరంగంలో బుద్ధిమంతుడు అంటే విలువిద్యా నిపుణుడు అని అర్థం. ధృష్టద్యుమ్నుడు నీ శిష్యుడు కనుక నీ విద్యా సంపత్తి నంతా గ్రహించే ఉంటాడు. తనకు సహజంగా ఉన్న ప్రావీణ్యంతో పాటు అన్యుల నుండి గ్రహించిన కౌశలం కూడా ఉంటుంది కాబట్టి, నా వైపు నిలబడి యుద్ధం చేసే నీ కన్నా, పాండవుల వైపు నిలబడి పోరాడుతున్న నీ శిష్యుడు ధృష్టద్యుమ్నుడే గొప్పవాడుగా తెలుస్తున్నాడు అనే ధ్వని కూడా అతని మాటల్లో ఉంది. ఇది వాస్తవం కాకపోతే, రణరంగంలో శిష్యుని కన్నా గురువే గొప్పవాడు అని నిరూపించుకో! అనే ఎత్తి పొడుపు కూడా ఉంది.

**పిలుపులో విరుపు**

ద్రోణాచార్యుని సమీపించిన దుర్యోధనుడు ఆచార్యా! అని సంబోధించాడు. కానీ శ్లోకాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే అక్కడ కూడా రెండో అర్థం స్ఫురిస్తోంది. **పాండు పుత్రాణా మాచార్య** (పాండు పుత్రాణాం ఆచార్య) అనడం చేత, పాండవుల ఆచార్యుడా! అనే వ్యంగ్య సంబోధన కూడా వినపడుతూ ఉంది.

పాండవులు నీ శిష్యులే. వాళ్ళ నాయకుడు కూడా తమరి శిష్యుడే. ప్రత్యర్థు లందరికీ తమరే గురువు. తమరికి కూడా వాళ్ళంటే వల్లమాలిన ప్రేమ. బాగానే ఉంది. కాని అదేమిటో! మా వైపు చేరి యుద్ధం చేస్తావు. అదే విచిత్రం. సరే. తమరికి ఇష్టమైన పాండవుల సేన లోని నాయకుల్ని గురించే చెబుతాను. వినండి. మీ మనస్సుకు కాస్త హాయిగా ఉంటుంది అంటూ దిక్కు తోచక శత్రుస్మరణం చేస్తున్నాడు.

దుర్యోధనుడు అటు చూడ మన్నాడు. ద్రోణుడు చూశాడు. ఇప్పుడు ఏమి చేయాలి? పాండవ సైన్యము చాలా పెద్దదిగా ఉంది. దానిని తక్కువగా అంచనా వేయ కూడదు అనేది దుర్యోధనుని భావన.

సైన్యము గొప్పదిగా ఉన్నంత మాత్రాన విజయము సాధిస్తారని ఎలా చెప్పగలం? విజయం అనేది సైన్యాన్ని నడిపే నాయకుల మీద ఆధారపడి ఉంటుంది. భీష్మాది మహావీరులు, శూరులు తన వైపు కూడా ఉన్నారు కదా! అయినా భయ మెందుకు?

పాండవ సైన్యములో కూడా మహా శూరు లున్నారు. కనుక, ఉపేక్షిస్తే లాభం లేదు అనుకొంటూ శత్రుపక్షంలో ఉండే శూరు లెవరో చెబుతున్నాడు.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి ।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ॥ 4

అత్ర-శూరాః-మహేష్వాసాః-భీమార్జునసమాః-యుధి
యుయుధానః-విరాటః-చ-ద్రుపదః-చ-మహారథః

| | | | | | |
|---|---|---|---|---|---|
| అత్ర | = | ఈ సైన్యములో | విరాటః | = | విరాటుడు |
| యుధి | = | సమరము నందు | చ | = | మరియు |
| భీమార్జునసమాః | = | భీమార్జునుల వంటి వాళ్ళు | మహారథః | = | మహారథుడైన |
| మహేష్వాసాః | = | గొప్ప ధనుర్ధారులు | ద్రుపదః | = | ద్రుపదుడును |
| శూరాః | = | శూరులు | చ | = | మరియు |
| యుయుధానః | = | సాత్యకి | | | |

**పాండవ సైన్యంలో భీమార్జునులతో సమానులైన శూరు లున్నారు. గొప్ప ధనుస్సులు ధరించి ఉన్నారు. సాత్యకి, విరాటరాజు, మహారథుడైన ద్రుపదుడు, ఇంకా -**

**వ్యాఖ్య**

పాండవ సైన్యంలో గొప్ప గొప్ప వీరు లున్నారు. శూరు లున్నారు. అతిరథ మహారథు లున్నారు **(సర్వ ఏవ మహారథాః)** అంటున్నాడు దుర్యోధనుడు. పైగా వీరందరూ భీమార్జునులతో సమానులు అంటున్నాడు.

గొప్ప ధనుర్విద్యా నిపుణుడై, తనను, సారథిని, గుఱ్ఱాలను ఏక కాలంలో రక్షించుకొంటూ పదివేల మందితో పోరాడే శక్తి గల వీరుణ్ణి మహారథుడు అంటారు. భీమార్జునులతో పాటు పాండవ సైన్యంలో ఉండే గొప్ప శూరుల్ని గూర్చి చెబుతున్నాడు దుర్యోధనుడు.

(1) **యుయుధానుడు.** కృష్ణార్జునులకు చాలా సన్నిహితుడు. గొప్ప పరాక్రమవంతుడు. శ్రీకృష్ణునికి తమ్ముడు. అర్జునుడికి శిష్యుడు కూడా. యుద్ధంలో అసమాన పరాక్రమాన్ని ప్రదర్శించే వాడు కావడం చేత సాత్యకికి యుయుధానుడు అనే పేరు వచ్చింది. కురుక్షేత్రంలో కృతవర్మను, సుదర్శనుని వధించడమే గాక, భూరిశ్రవునితో భయంకర పోరాటాన్ని సాగిస్తాడు సాత్యకి.

(2) **విరాటరాజు.** అజ్ఞాతవాసంలో పాండవులకు ఆశ్రయం కల్పించాడు. పాండవుల ఏడు అక్షౌహిణుల సేనలలో ఒక దానికి సారథ్యం వహిస్తాడు. తన కుమారులు శంఖుడు, ఉత్తరునితో కలసి కురుక్షేత్రంలో పోరాడి, ద్రోణుని చేతిలో మరణిస్తాడు. అభిమన్యునికి మామ. శత్రువులను విశేషంగా పీడించే వాడు కనుక విరటుడు అని ప్రసిద్ధి.

(3) **ద్రుపదుడు.** ధృష్టద్యుమ్నుని తండ్రి. పాంచాల దేశానికి రాజు. ద్రౌపది ఆయన కూతురే. ద్రుపదుడు ద్రోణునికి శత్రువు కనుక ద్రోణాచార్యుని రెచ్చగొట్టే ప్రయత్నంలో 'మహారథు' డంటూ ద్రుపదునికి ప్రత్యేకంగా విశేషణాన్ని జోడించాడు దుర్యోధనుడు.

ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్ ।
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః ॥ 5

ధృష్టకేతుః-చేకితానః-కాశిరాజః-చ-వీర్యవాన్
పురుజిత్-కుంతిభోజః-చ-శైబ్యః-చ-నరపుంగవః





| | | | | | |
|---|---|---|---|---|---|
| ధృష్టకేతుః | = | ధృష్టకేతుడు | కుంతిభోజః | = | కుంతిభోజుడు |
| చేకితానః | = | చేకితానుడు | చ | = | ఇంకను |
| వీర్యవాన్ | = | బలవంతుడైన | నరపుంగవః | = | పురుషశ్రేష్ఠుడు |
| కాశిరాజః | = | కాశిరాజు | శైబ్యః | = | శైబ్యుడు |
| చ | = | మరియు | చ | = | మరియు |
| పురుజిత్ | = | పురుజిత్తు | | | |

**ధృష్టకేతువు, చేకితానుడు, బలవంతుడైన కాశిరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, పురుష శ్రేష్ఠుడైన శైబ్యుడు - వాళ్ళతో పాటు -**

**వ్యాఖ్య**

(4) **ధృష్టకేతువు :-** చేది దేశపు రాజు. శిశుపాలుని కుమారుడు. నకులుని భార్య శ్రుణుమతి ఇతని చెల్లెలే. గొప్ప పోరాట పటిమ కలవాడు.

(5) **చేకితానుడు :-** యాదవ కులానికి సంబంధించిన వీరుడు. చికితానుని కుమారుడు. యుద్ధంలో ఇతనిని దుర్యోధనుడు సంహరిస్తాడు.

(6) **కాశిరాజు :-** కాశీ నగరాన్ని పాలించిన చక్రవర్తి, యుద్ధంలో అసమాన పరాక్రమంతో పోరాడుతాడు. అందుచేత 'వీర్యవాన్' అని ప్రత్యేకంగా శ్లాఘించడం జరిగింది.

(7) **పురుజిత్తు :-** కుంతీదేవికి సోదరుడు. కుంతిభోజుని కుమారుడు. ధర్మజ భీమార్జునులకు మేనమామ. పురు వంశీయులను జయించి పురుజిత్తు అయ్యాడు.

(8) **కుంతిభోజుడు :-** ఇతడు పురుజిత్తు సోదరుడు. తండ్రి యైన కుంతిభోజుని పేరే ఇతనికి కూడా పెట్టబడింది. కుంతీదేవి సోదరుడు.

(9) **శైబ్యుడు :-** శిబి వంశములో పుట్టి నందున ఇతడు శైబ్యుడు. ధర్మరాజుకు పిల్ల నిచ్చిన మామ. శైబ్యుని కుమార్తె దేవిక. శౌర్యవంతుడైన శైబ్యుని 'నరపుంగవః' - పురుష శ్రేష్ఠుడు అంటున్నాడు దుర్యోధనుడు.

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః ॥ 6

యుధామన్యుః-చ-విక్రాంతః-ఉత్తమౌజాః-చ-వీర్యవాన్
సౌభద్రః-ద్రౌపదేయాః-చ-సర్వే-ఏవ-మహారథాః

| | | | | | |
|---|---|---|---|---|---|
| విక్రాంతః | = | పరాక్రమవంతు డైన | సౌభద్రః | = | సుభద్ర కుమారుడు |
| యుధామన్యుః | = | యుధామన్యుడు | చ | = | మరియు |
| చ | = | మరియు | ద్రౌపదేయాః | = | ద్రౌపది కుమారులు |
| వీర్యవాన్ | = | బలవంతుడైన | సర్వే | = | అందరు |
| ఉత్తమౌజాః | = | ఉత్తమౌజుడు | మహారథాః ఏవ | = | మహారథులే |
| చ | = | మరియు | | | |

**పరాక్రమవంతుడైన యుధామన్యుడు, బలవంతుడైన ఉత్తమౌజుడు, సుభద్ర కుమారుడు, ద్రౌపది కొడుకులు - వీళ్ళందరూ మహారథులే.**

### వ్యాఖ్య

**(10) యుధామన్యుడు** :- ఇతడు అర్జునుని రథానికి వామపార్శ్వంలో చక్ర రక్షకుడుగా ఉంటాడు. గొప్ప శక్తిమంతుడు. అందుకే విక్రాంతుడు.

**(11) ఉత్తమౌజుడు** :- ఇతడు పాంచాల దేశపు రాజకుమారుడు. అర్జునుని రథానికి కుడిభాగాన చక్ర రక్షకుడుగా ఉంటాడు. గొప్ప వీర్యవంతుడు.

**(12) సౌభద్రుడు** :- సుభద్రార్జునుల పుత్రుడు. ఉత్తర భర్త. అభిమన్యుడు.

**(13) ద్రౌపదీ కుమారులు** :- ధర్మజుని వలన కలిగిన **ప్రతివింధ్యుడు**, భీముని వలన కలిగిన **శ్రుతసోముడు**, అర్జునుని వలన కలిగిన **శ్రుతకర్ముడు**, సహదేవుని వలన కలిగిన **శ్రుతసేనుడు**, నకులుని వలన కలిగిన **శతానీకుడు**. వీరు అయిదు మంది ద్రౌపదీ పుత్రులు. వీరినే ఉపపాండవులు అంటారు. వీరందరూ మహారథులే.*

మరి, అలాంటి మహారథులైన శత్రువులతో పోరాడి అనర్థం సృష్టించు కోవడం కంటే, వారితో సంధి చేసుకుంటే సరిపోతుంది కదా! అని ద్రోణాచార్యుడు ఎక్కడ చెబుతాడో అని ముందే ఊహించుకొని, తన సైన్యంలో కూడా వీరశూరులు, అతిరథ మహారథులు ఉన్నారంటూ వారిని గూర్చి కూడా చెబుతున్నాడు.

**అస్మాకం తు విశిష్టా యే తా న్నిబోధ ద్విజోత్తమ ।**
**నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తా న్బ్రవీమి తే ॥** 7

*అస్మాకం-తు-విశిష్టాః-యే-తాన్-నిబోధ-ద్విజోత్తమ*
*నాయకాః-మమ-సైన్యస్య-సంజ్ఞార్థం-తాన్-బ్రవీమి-తే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| ద్విజోత్తమ | = | ఓ బ్రాహ్మణశ్రేష్ఠుడా! | తాన్ | = | వారిని |
| అస్మాకం | = | మన పక్షంలో | తే | = | నీకు |
| యే తు | = | ఎవరైతే | సంజ్ఞార్థం | = | తెలియాలని |
| విశిష్టాః | = | గొప్పవారో | బ్రవీమి | = | చెబుతున్నాను |
| మమ | = | నా యొక్క | తాన్ | = | వారిని |
| సైన్యస్య | = | సైన్యమునకు | నిబోధ | = | గమనించు |
| నాయకాః | = | నాయకులో | | | |

**బ్రాహ్మణోత్తమా! ఇక మన పక్షంలో గొప్పవాళ్ళు, సేనా నాయకు లెవ్వరో నీకు తెలియాలని చెబుతున్నా, వారిని కూడా గమనించు.**

### వ్యాఖ్య

పాండవ సైన్యము లోని అతిరథులను పేర్కొన్నంత మాత్రాన తాను వాళ్ళను చూచి భీతి చెందుతున్నట్లు ద్రోణుడు అర్థం చేసుకుంటా డేమో నని, తన వైపు కూడా అతిరథులైన మహావీరులు ఎందరో ఉన్నారంటూ తన సైన్యము లోని నాయకులను కూడా దుర్యోధనుడు వరుసగా చెప్పబో తున్నాడు.

అంతే కాదు. ఒకవేళ, పాండవసేన లోని తన శిష్యులపై వ్యామోహంతో ద్రోణుడు పూర్ణ హృదయంతో కౌరవుల వైపు శ్రమించక పోయినా, తనకు వచ్చే నష్ట మేమీ లేదనేది ధ్వనించేలా ఈ శ్లోకంలో ద్రోణాచార్యుని



* స్వామీజీ రచించిన చైతన్య మహాభారతంలో ఈ మహారథులను గూర్చి విశేషంగా చర్చించడం జరిగింది.



ద్విజోత్తమా! అని సంబోధించాడు. అంటే, బ్రాహ్మణశ్రేష్ఠుడా! అని అర్థము. ఈ సందర్భములో ఇదొక విచిత్ర మైన, వికటమైన సంబోధనము.

**హోమ ధూమం - రణ రుధిరం**

ద్విజుడు అంటే రెండవ సారి పుట్టినవాడు అని అర్థము. తల్లి గర్భము నుండి పుట్టడం మొదటి జన్మ అయితే, ఉపనయన సంస్కారం జరిగిన తరువాత ఆ వ్యక్తి రెండవ జన్మ ఎత్తిన వాడు అవుతాడు. అప్పుడు ద్విజుడు అని పిలువ బడతాడు.

**జన్మనా జాయతే శూద్రః కర్మణా జాయతే ద్విజః**

పుట్టుకతో అందరూ శూద్రులే. ఉపనయన సంస్కారం తరువాత ద్విజులుగా మారుతారు. ఈ విధంగా రెండు జన్మలు ఎత్తిన వాడు ద్విజుడు లేక ద్విజన్ముడు అన్నది శాస్త్రం ***( ద్వైజాతీ జన్మనీ యస్య సః ద్విజన్మా ).***

జన్మ నిచ్చిన జననీ జనకులు మొదటి జన్మకు కారణ మవుతున్నారు. ద్విజుడుగా తన రెండవ జన్మకు గాయత్రీ మంత్రము జనని కాగా, జనకుడు దానిని ఉపదేశించే ఆచార్యుడు అవుతున్నాడు ***( తద్ద్వితీయం జన్మ మాతా సావిత్రీ పితా తు ఆచార్యః ).*** గాయత్రిని వేదంలో సావిత్రి అని కూడా పిలుస్తారు. మంత్రద్రష్ట విశ్వామిత్ర మహర్షి.

అయితే, ఈ సందర్భంలో ద్రోణాచార్యుని ద్విజోత్తమా! అని సంబోధించడంలో దుర్యోధనుని ఆంతర్య మేమిటి? ఏముంది, కాస్త మనస్సు పెట్టి చూస్తే శుభ్రంగా తెలుస్తూనే ఉంది కదా!

ద్విజోత్తమా! బ్రాహ్మణశ్రేష్ఠుడా! నీ శరీరం మా వైపు నిలబడి ఉంది. మనస్సేమో ఆ వైపు పచార్లు చేస్తోంది. నీ శిష్యు లందరూ ఆ వైపే ఉన్నారు. నీ మనస్సు కూడా అక్కడే ఉంది. ఇక నీ వల్ల నాకు ఒరిగే దేముంది? అలాగని, నీవు లేకపోతే తరిగే దేముంది? నీవు ద్విజశ్రేష్ఠుడవు. గాయత్రీమాత పుత్రుడవు. సంధ్యా వందనాది పవిత్ర కర్మలు, యజ్ఞ యాగాది పుణ్య కర్మలకు అలవాటు పడ్డ వాడివి. పైగా సత్త్వగుణం గల బ్రాహ్మణుడివి.

హోమధూమం మధ్యలో కూర్చుని వేదమంత్రాలు వల్లించడం వేరు. రణరంగంలో నిలబడి రుధిర ప్రవాహాన్ని వీక్షిస్తూ పోరాడటం వేరు. పారాయణ జపధ్యానాలకు అలవాటు పడిన నీ ద్విజ స్వభావం రణరంగంలో ఏవో అద్భుతాలు సృష్టిస్తుందని నేను ఆశించడం లేదు. నీవు మా అందరికీ శిక్షణ ఇచ్చి ఉండొచ్చు. ఆట నేర్పడం వేరు. క్లిష్టమైన పరిస్థితుల్లో ఆడటం వేరు. పైగా చిత్తము లేకుండా చిందులు వేయడం చిత్రం గానే ఉంటుంది అంటూ, ఆచార్యునిపై తన కున్న అవిశ్వాసాన్ని చెప్పకనే బైట పెట్టేశాడు. అందుకే తన సైన్యంలో ఉండే మహారథులను వివరించి చెబుతున్నాడు. కౌరవ సైన్యములో ఉండే నాయకు లెవరో ద్రోణుడి స్థాయి యోధునికి తెలియదా? మరి దుర్యోధనుడు ఎందుకు చెబుతున్నట్లు?

**సంజ్ఞార్థం** - గుర్తు చేయాలి అని చెబుతున్నాను అంటున్నాడు. భీష్ముని పతనానంతరం సర్వ సేనాధిపతిగా పగ్గాలు చేపట్టబోయే ద్రోణుడికి తన సైన్యమును, అది కూడా నాయకులను గూర్చి గుర్తు చేయడ మేమిటి? నీవు మనస్సు పెట్టి యుద్ధం చేయక పోయినా, నాకు వచ్చే నష్ట మేమీ లేదు అని గుర్తు చేయడమే. నా వైపు నిన్ను మించిన అతిరథ మహారథు లెందరో ఉన్నారు అని తేల్చి చెప్పడమే. చాలా విడ్డూరంగా ఉంది కదూ! నిజమే. అలా ప్రవర్తించే వాడే దుర్యోధనుడు.

ఇక కౌరవ వీరుల్ని గూర్చి ప్రారంభిస్తూ ముందుగా ద్రోణాచార్యుని ప్రస్తావించాడు దుర్యోధనుడు. తన మనస్సులో ద్రోణునిపై ఉండే అవిశ్వాసాన్ని అణచుకో లేక సూటిపోటి మాటలతో వ్యంగ్యాస్త్రాలను విపరీతంగా

సంధించేశాడు. ఆ మాటలకు ద్రోణుడు ఎక్కడ మనస్తాపం చెందాడో, క్రోధంతో కదులు తున్నాడో అని శంకించి, ఆచార్యుని శాంతింప చేసే ప్రయత్నంలో ప్రథమంగా ద్రోణాచార్యునే ప్రస్తావించాడు. దారి తప్పిన వారికి ఎన్నో దారులు!

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ ॥ * 8

*భవాన్-భీష్మః-చ-కర్ణః-చ-కృపః-చ-సమితింజయః*
*అశ్వత్థామా-వికర్ణః-చ-సౌమదత్తిః-తథా-ఏవ-చ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| భవాన్ | = | మీరు | అశ్వత్థామా | = | అశ్వత్థామ |
| భీష్మశ్చ | = | భీష్ముడు | వికర్ణశ్చ | = | వికర్ణుడు |
| కర్ణశ్చ | = | కర్ణుడు | తథా ఏవ చ | = | అలాగే |
| సమితింజయః | = | సమర విజయుడు | సౌమదత్తిశ్చ | = | సోమదత్తుని పుత్రుడు |
| కృపశ్చ | = | కృపాచార్యుడు | | | |

**మీరు, భీష్ముడు,కర్ణుడు, సమర విజయుడు కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని కొడుకు - వీళ్ళే కాదు,**

### వ్యాఖ్య

తన పక్షంలో ఉండే ముఖ్యమైన వీరుల్ని గూర్చి చెబుతూ ప్రథమంగా *భవాన్* - తమరు అంటూ ప్రారంభించాడు. వాస్తవంగా మాట్లాడితే ముందు భీష్మణ్ణి చెప్పి తరువాత ద్రోణుణ్ణి చెప్పాలి. ఇంతవరకు తాను చేసిన అప్రస్తుత అధిక ప్రసంగం వల్ల కలిగిన గాయాలను నయం చేసేందుకు సున్నితంగా మందు రాసే ప్రయత్నంలో పడ్డాడు దుర్యోధనుడు. అందుకనే భీష్ముని కన్నా ముందు ద్రోణుణ్ణి, వికర్ణుడి కన్నా ముందు అశ్వత్థామను ప్రస్తావించి, భోజనం లేకుండానే బ్రాహ్మణుణ్ణి ఉబ్బిస్తున్నాడు.

గొప్ప తేజోసంపన్ను లైన తమరు, భీష్ముడు, కర్ణుడు, సమర విజయుడు కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు అంటూ ఏడు మందిని ప్రస్తావించాడు. పాండవ సైన్యములో పదిహేడు మంది వీరుల్ని ప్రస్తావించి, తన వైపు ఏడు మంది వీరుల్నే ప్రస్తావించాడు (**సౌమదత్తి ర్జయద్రథః** అనే పాఠాంతరాన్ని గ్రహిస్తే ఎనిమిది మంది అవుతారు. ఆ ఎనిమిదవ వాడు జయద్రథుడు. అంటే, సింధు నరేశుడు సైంధవుడు).

### వాపు - బలుపు

పదకొండు అక్షౌహిణుల సైన్యము గల కౌరవ సైన్యము లోని నాయకులను ఏడు మందిని పేర్కొని, ఏడు అక్షౌహిణుల సైన్యము గల పాండవ సైన్యము లోని నాయకులను పదిహేడు మందిని చెప్పడంలో ఆంతర్య మేమిటో! పైగా పాండవ వీరుల్ని మూడు శ్లోకాలలో ప్రస్తావించి, తన సైన్యము లోని వీరులను ఒక్క శ్లోకం లోనే చెప్పేశాడు. **

మన వాళ్ళను గూర్చి మనకు ఎలాగూ తెలుసు కదా, ఎదుటి వారి శక్తిని అంచనా వేయడమే కర్తవ్యం కావాలి అనే సంగ్రామ చాతుర్యమా? లేక సైన్యము ఎక్కువగా ఉందే గాని, వీరులు కౌరవ సైన్యంలో తక్కువగా



* సౌమదత్తిః జయద్రథః అని పాఠాంతరము.

** గీత 16 వ అధ్యాయమును ప్రారంభిస్తూ, దైవీ సంపదలో జన్మించిన వారిని మూడు శ్లోకాలలో వర్ణించి, ఆసురీ సంపదలో జన్మించిన వారిని ఒక్క శ్లోకంలో చెప్పాడు గీతాచార్యుడు. వ్రాసిన వాడు వ్యాసుడు కావడం చేత, ఇది కూడా ఆలోచించ దగిన విషయమే.



ఉన్నారు. సైన్యము అక్షౌహిణుల సంఖ్యలో తక్కువగా ఉన్నా, పాండవసేన లోనే వీరులు ఎక్కువగా ఉన్నారు అనే నైరాశ్యమా? ఏమో, రెండవదే అయినా దుర్యోధనుని విషయంలో ఆశ్చర్యపో నవసరం లేదు.

ఎందుకంటే, తరువాత శ్లోకంలో మరెందరో తన వైపు ప్రావీణ్యత గల మహావీరులు ఉన్నారు అని పేరు లేని వాళ్ళను ప్రస్తావిస్తాడు. పైగా, వాళ్ళు తమ కొరకు ప్రాణాలు తెగించి వచ్చారు అంటాడు. ఇవన్నీ విస్మరించ దగిన విషయాలు మాత్రం కావు. అదేమిటో కూడా చెప్పుకుందాం.

అన్యే చ బహవ శ్శూరాః మదర్థే త్యక్తజీవితాః ।
నానాశస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః ॥ 9

*అన్యే-చ-బహవః-శూరాః-మదర్థే-త్యక్తజీవితాః*
*నానాశస్త్ర ప్రహరణాః-సర్వే-యుద్ధ విశారదాః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అన్యే | = | ఇంకా వేరే | త్యక్త జీవితాః | = | బ్రతుకును ధారబోసి |
| బహవః | = | చాలా మంది | సర్వే | = | అందరు |
| శూరాః | = | శూరులు | నానాశస్త్ర ప్రహరణాః | = | అనేక శస్త్రాస్త్రములు గలవారు |
| మదర్థే | = | నా కొరకు | యుద్ధవిశారదాః | = | సమర చాతుర్యము గలవారు |

**ఇంకా, వేరే వాళ్ళు చాలా మంది, నా కోసం బ్రతుకును ఫణంగా పెట్టి వచ్చి ఉన్నారు. శస్త్రాస్త్రములను ధరించిన వాళ్ళందరూ యుద్ధంలో ఎంతో ప్రావీణ్య మున్న వాళ్ళు**

### వ్యాఖ్య

తన సైన్యంలో ముఖ్యులైన ఏడు మంది వీరుల్ని ప్రస్తావించిన దుర్యోధనుడు, ఆ తరువాత మరెందరో ఉన్నారు అంటున్నాడు. పైగా వాళ్ళందరూ గొప్ప ప్రావీణ్యమున్న వాళ్ళు, శస్త్రాస్త్రములను ధరించి ఉన్నవాళ్ళు అంటున్నాడు. అంతటితో ఆగలేదు. తన కోసం ప్రాణాలు సైతం తెగించి వచ్చారు అంటున్నాడు.

మళ్ళీ ఇదేమిటి? పేరు లేని వాళ్ళను ప్రస్తావిస్తూ, వాళ్ళందరూ గొప్ప ప్రావీణ్యము ఉన్నవాళ్ళట. అంటే, గడచిన శ్లోకంలో పేరు పేరున చెప్పినాడే, వాళ్ళందరూ ప్రావీణ్యము లేని వారా?

అలా ప్రావీణ్యత గల అనామధేయులు శస్త్రాస్త్రములను ధరించి ఉన్నారు అంటున్నాడు. మరి, ఎనిమిదవ శ్లోకంలో పేరు పేరున పలికిన ఏడు మంది విషయ మేమిటి? వాళ్ళు శస్త్రాస్త్రములు ధరించి లేరా? మరి ఎలా ఉన్నారు? గంగాళముల ప్రక్కన గరిటెలు పట్టుకొని నిలుచున్నారా? విస్తళ్ళ ముందు పద్మాసనాలలో విసన కఱ్ఱలు ధరించి విస్తరించి కూర్చున్నారా? ఎంత అర్థరహిత ప్రసంగం! అంతా స్వార్థపూరిత ప్రవచనం.

ఇంకా చూడండి, రాజు గారి వాక్చాతుర్యం! ఆ అనామధేయు లందరూ తన కోసం ప్రాణాలు ధారబోసి వచ్చారు అంటున్నాడు. ఇదొక భావ దారిద్ర్యం.

నిజమే. వాళ్ళందరూ ఈ మహారాజు గారి కోసం ప్రాణాలు త్యజించే వచ్చారు అనుకుందాం. కలం లేకుండా వచ్చిన వాడు కలం లేని వాడే కదా! కళ్ళజోడు లేకుండా వచ్చిన వాడు కళ్ళజోడు లేనివాడే కదా! ప్రాణాలు త్యజించి వచ్చిన వాళ్ళెవరు? ప్రాణాలు లేని వాళ్ళే కదా! ప్రాణాలు త్యజించి వచ్చిన అనామధేయ వీరులు శత్రుపక్షంలో ఎవరి ప్రాణాలు తీస్తారు? భయపడిన వాళ్ళవి తప్ప!

**త్యక్త జీవితాః** అనే మాటే అశుభ సూచకం. ప్రాణాలు త్యజించి వచ్చారు అనేది మాటలో వినపడుతున్నా,

ప్రాణాలు త్యజించ బోతారు అనేది మనస్సులో కనపడుతూనే ఉంది. అదే కాకుండా, ఆ ప్రాణాలు కూడా తన కోసం **(మదర్థం)** త్యజించి వచ్చారు అని అన్యాయంగా, అధర్మంగా పలుకు తున్నాడు. ప్రజల కొరకు రాజు బ్రతకాలి గాని, తన కొరకు వారు ప్రాణాలు త్యజించి వచ్చారని రాజు పలకడం శోచనీయం.

మహావీరులైన ఏడు మంది కౌరవ మహారథులను ప్రస్తావించిన తరువాత, అసందర్భంగా అనామధేయుల్ని ఆకాశాని కెత్తుతూ స్తుతించడం వెనుక హేతు వేమిటి? ఏముంది! ఆ ఏడు మంది తన బ్రతుకులో వేడుకను ఆవిష్కరించ లేరు అనే అనుమానమే. కారణ మేమిటి? దుర్యోధనుని ఆంతర్యమే.

**(1) ద్రోణుడు :-** బ్రాహ్మణుడు. వేదాధ్యయన తత్పరుడు. కౌరవులకు, పాండవులకు ఇరువురికీ గురువే. ఉభయులకు అస్త్రవిద్యను నేర్పిన వాడు. అర్జునునితో సమానమైన వాడు ఉండడు అని ఆశీర్వదించడమే గాక, నాకు సహకరించే ఏకలవ్యుని బొటనవ్రేలును దూరం చేసిన వాడు. ఇక ఇప్పుడు, యుద్ధంలో నాకు సహాయం చేయబోతాడు!

**(2) భీష్ముడు :-** రాజయ్యే లక్షణాలన్నీ ఉండి కూడా తండ్రి కోసం సమస్తాన్నీ త్యజించిన వాడు. వివాహము కూడా చేసుకోనని భీష్మించు కున్నాడు. అలాగే బ్రతుకును నీరసింప చేసుకున్నాడు. పైగా తలచుకోగానే తల వాలిపోయే వరాన్ని తండ్రి నుండి పొంది ఉన్నాడు. పొసగితే ఉంటాడు. విసిగిపోతే చెప్పకుండానే తన దారిన తాను పోతాడు. యుద్ధంలో పాండవులను చంప కూడదు అని నిర్ణయించుకున్న వాడు. నాకు యుద్ధంలో ఏదో చేసి పెడతాడు!

**(3) కర్ణుడు :-** ప్రాణానికి ప్రాణ మిచ్చే స్నేహితుడు. మతి గలవాడే. అతి ఎక్కువ. కవచ కుండలాలు ఉంటే, అతణ్ణి ఎవ్వరైనా మట్టు పెట్ట గలరా? ఇంద్రుడు వచ్చి అడుగుతాడు, ఇవ్వద్దు మొర్రో అని పుత్ర వాత్సల్యంతో ఏడు గుఱ్ఱాలను తోలుకుంటూ సూర్యుడు వచ్చి చెబితే, తండ్రి మాటను కూడా లెక్క చేయకుండా, 'నన్ను యాచించిన వాడు లేదనుకొంటూ తిరిగి పోవుటయా! అదే జరిగినచో, వెంబడించదా అతనిని నా ప్రాణం కూడా' అని నాటక వాచకం పలుకుతాడా? ఇంద్రుడు రానే వచ్చాడు. కవచ కుండలాలు పోనే పోయాయి. అసమాన శక్తివంతుడే. తన శక్తి అవసర సమయంలో ఉపయోగ పడదు అనే శాపం కూడా ఉన్నవాడు. నా మిత్రుడే. ప్రాణమిత్రుడే. యుద్ధంలో నా కేదో చేయబోతాడు!

**(4) కృపాచార్యుడు :-** అయోని సంభవుడు. ద్రోణుడికి బావమరిది. ద్రోణుడి లాగే మా అందరికీ గురువు. వాళ్ళకూ నేర్పాడు. మాకూ నేర్పాడు. మా సైన్యములో బండెక్కి ఉన్నాడు.

**(5) అశ్వత్థామ :-** ద్రోణుని కొడుకు. కృపునికి అల్లుడు. మహాకోపి. ఏదైనా చేయ గలడు. బ్రహ్మాస్త్ర ప్రయోగం కూడా చేసే శక్తి కలవాడు. కాని, దానిని ఉపసంహారము చేసే దెలాగో తెలియని వాడు. అర్జునుణ్ణి మించిపోతాడేమో నని తన తండ్రే ఆ రహస్యాన్ని చెప్పలేదు. అతడే అశ్వత్థామ. ప్రస్తుతం నా సైన్యం లోనే ఉన్నాడు.

**(6) వికర్ణుడు :-** మా తమ్ముడే. వందలో ఒకడు. మందలో చేరడు. ఉన్నట్లుండి నీతుల మూట విప్పుతాడు. ధర్మము - దయ అంటూ తెగ మాట్లాడుతాడు. ప్రస్తుతానికి మా వైపే ఉన్నాడు.

**(7) సౌమదత్తి :-** సోమదత్తుని కొడుకు. భూరిశ్రవుడు. కౌరవ పాండవు లిరువురికి పితృ సమానుడు. పాండవుల్ని జయించాలని శివుని ప్రార్థిస్తూ తపస్సు చేశాడు. శివుడు తృప్తి చెంది వరం ఇవ్వడానికి వచ్చాడు. శివుణ్ణి చూచి కూడా గర్వంతో ఊగిపోతూ లేచి నిలబడ లేదు. శివుడు క్రుద్ధుడై, యుద్ధంలో క్రూర మరణాన్ని పొందుతావు అని శాపం పెట్టి వెళ్ళాడు. ఆయనే ఇప్పుడు మా నాయకులలో ఒకడు.





**(8) జయద్రథుడు :-** పాఠాంతరంలో ఎనిమిదవ వాడు చేరితే, ఆయనే జయద్రథుడు. సైంధవుడు. మా చెల్లెలు దుస్సల మొగుడు. అతనికి అన్నీ బాగానే చూశాము. ఏ లోటు రానివ్వ లేదు.

సామాన్యుడు కాడు. అటు, ఇటుగా నా లక్షణాలు కలవాడే. పాండవుల ధర్మపత్ని ద్రౌపదిని అపహరించుకొని పోయాడు. భీముడు, అర్జునుడు వెంబడించి పట్టుకున్నారు. బావమరిది అని చంప లేదు గాని చంపినంత పని చేశారు.

ఆ తరువాత, పాండవులు ఏమి చేస్తారో అని భయం పట్టుకొంది. శివుణ్ణి గూర్చి చాలా కాలం తపస్సు కూడా చేశాడు. పాండవుల్ని కూడా జయించే వరాన్ని తపస్సు ద్వారా పొందాడు. కాని, అర్జునుణ్ణి చంపడం సాధ్యం కాదు అనే మెలిక కూడా ఆ వరంలో చోటు చేసుకొని ఉంది. ఆయన కూడా ప్రస్తుతం ధనుస్సు పట్టుకొని మా మధ్య లోనే ఉన్నాడు. నన్ను రక్షిస్తా నంటున్నాడు.

అందరి విషయంలో ఇలాంటి అందమైన భావాలే దుర్యోధన మహారాజు మనస్సులో ఉన్నాయి. అందరి పైనా అవిశ్వాసమే కనుక అనామధేయులపై అకుంఠిత విశ్వాసము. అంతా అయోమయం. ఆంబికేయం.

**అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్ ।**
**పర్యాప్తం త్విద మేతేషాం బలం భీమాభిరక్షితమ్ ॥** 10

*అపర్యాప్తం-తత్-అస్మాకం-బలం-భీష్మాభిరక్షితం*
*పర్యాప్తం-తు-ఇదం-ఏతేషాం-బలం-భీమాభిరక్షితం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| భీష్మాభిరక్షితం | = | భీష్మునిచే రక్షితమైన | భీమాభిరక్షితం | = | భీమునిచే రక్షితమైన |
| తత్ | = | అలాంటి | ఏతేషాం | = | వారి యొక్క |
| అస్మాకం | = | మన | ఇదం | = | ఈ |
| బలం | = | బలము | బలం తు | = | శక్తి అయితే |
| అపర్యాప్తం | = | అపారము | పర్యాప్తం | = | పరిమితము |
| తు | = | అయితే | | | |

**మన సైన్యము అపారము. దానిని భీష్ముడు రక్షిస్తున్నాడు. ఇక పాండవుల సైన్య మంటారా? అది చాలా పరిమితం. దానిని భీముడు కాపలా కాస్తున్నాడు.**

**వ్యాఖ్య**

తన సైన్యము పదకొండు అక్షౌహిణులతో ఉంది. పాండవ సైన్యము ఏడు అక్షౌహిణులతో ఉంది. కనుక తన బలం అపర్యాప్తం. పాండవులది పర్యాప్తం. ఇకపోతే అపరిమిత మైన తన సైన్యానికి భీష్ముడు రక్షకుడు. పరిమితమైన పాండవుల సైన్యానికి భీముడు రక్షకుడు అనేది శ్లోకార్థం. సుస్పష్టం.

**భీష్ముడు - భీముడు**

తన సైన్యాన్ని రక్షించే వాడు సర్వసేనాధిపతి భీష్ముడు అనేది అర్థ మవుతూ ఉంది. పాండవ సైన్యాన్ని భీముడు రక్షిస్తున్నాడు అంటూ భీష్మునికి ప్రత్యర్థిగా భీముణ్ణి ఎందుకు ఎన్నుకున్నాడో అర్థం కావాలి.

భీముడు రాజు కనుక అతణ్ణి పేర్కొన్నాడు అనుకొందామా? లేదా, జ్యేష్ఠుడు కనుక భీముణ్ణి ఉదహరించినాడు అనుకుందామా? ప్రభువు, జ్యేష్ఠుడు - ఈ రెండూ ధర్మరాజే కాని భీముడు కాదు. అలా చూచి నపుడు ధర్మరాజు పేరు చెప్పాలి గాని భీముడి పేరు కాదు.

జ్యేష్ఠుడు కాకపోయినా, శ్రేష్ఠత్వము లేకపోయినా, భీష్ముని లాగా సర్వసేనాధిపతి కనుక భీముడి పేరును ఉదహరించాడు అని అనుకుందా మంటే, పాండవసేనకు సర్వసేనాధిపతి ధృష్టద్యుమ్నుడే గాని భీముడు కాడు.

పోనీ జ్యేష్ఠత్వము, శ్రేష్ఠత్వము, సర్వసేనాధిపత్యము లేకపోయినా, నానాస్త్ర కోవిదుడు, అద్భుత శస్త్రాస్త్ర నిపుణుడు భీముడు అని భావించాడా అంటే, అది కూడా సరి కాదు అనిపిస్తోంది. అలాంటి లక్షణాలు కలవాడు అర్జునుడే గాని భీముడు కాడు.

చివరగా, ప్రత్యేకతలు ప్రదర్శించక పోయినా, పరిపూర్ణతలో దేదీప్యమానంగా ప్రకాశించే పరమాత్మ స్వరూప మని భీముణ్ణి తలచినాడా? అలా చూచి నపుడు, అర్జునుని రథంలో మందహాసంతో శోభిస్తున్న శ్యామసుందరమూర్తిని చెప్పాలి.

అందరినీ ప్రక్కన బెట్టి, తనకు అసలే గిట్టని నిత్య శత్రువు హిడింబి మొగుణ్ణి మొగసాలలో నిలపడ మేమిటి? గాంధారీ నందనుడు ఏది పలికినా గందరగోళాన్నే సృష్టిస్తూ ఉంది.

**ప్రతిజ్ఞలే ప్రతిభలు**

కౌరవ సైన్యాన్ని రక్షించ వలసిన సర్వసేనాధిపతి భీష్మాచార్యుడు. కాని, యుద్ధంలో ఎందరి నైనా వధిస్తాను గాని పాండవులను మాత్రం సంహరించను అని భీష్ముడు ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు.

ఇక భీముడు అంటారా! ధృతరాష్ట్రుని కొడుకు లందరినీ నేనే వధించి తీరుతాను అని ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు.

ఈ రెండూ దుర్యోధనుని మనస్సులో సాగర కెరటా ల్లాగా ఎగసి ఎగసి పడు తున్నాయి. అందుచేత భీష్మభీముల్ని ఉదహరించాడు. అలా భీతి చెందుతున్న సమయం లోనే తమ బలం అపరిమిత మని, పాండవుల బలం పరిమిత మని తాత్కాలిక ఆనందాన్ని అనుభవిస్తున్నాడు. సైన్యం లాగే భీష్ముని కన్నా భీముడు పరిమితుడు అని కూడా తృప్తి చెందు తున్నాడు. ఎందుకంటే, భీష్మ శబ్దంలో భీముడు చిక్కిపోయే ఉన్నాడు. 'భీష్మ' - భీష్-మ. . . 'భీమ' అనే రెండు అక్షరాలను తొలగించినా, భీష్మునిలో 'ష' కారము మిగిలే ఉంది కదా! ఆ 'ష' కారాన్ని పట్టుకొని సంతోషంతో ఆంతర్యంలో షికారు చేస్తున్నాడు దుర్యోధనుడు.

**మరో దారి మంచిది కాదు**

ఈ శ్లోకం యొక్క భావార్థము స్పష్టం గానే తెలుస్తున్నా, దీనికి భిన్నంగా అర్థాన్ని సృష్టించారు చాలా కాలంగా చాలా మంది వ్యాఖ్యాతలు.

*భీష్మాభి రక్షితం అస్మాకం తద్బలం అపర్యాప్తం*

*భీమాభి రక్షితం ఏతేషాం ఇదం బలం పర్యాప్తం* - అని సూటిగా తెలుస్తూ ఉన్నా,

*భీష్మాభి రక్షితం పర్యాప్తం*

*భీమాభి రక్షితం అపర్యాప్తం* - అంటే, భీష్ముని చేత రక్షింప బడుతున్న కౌరవ బలము పరిమితము. భీముని చేత రక్షింప బడుతున్న పాండవ బలము అపరిమితము అనే అర్థాన్ని నేశారు. ఇదంతా సంస్కృత భాషా వైభవము.

*అపర్యాప్తం* అంటే, అపరిమితము అని ఒక అర్థము. దానినే *న* + ***పర్యాప్తం*** గా గ్రహిస్తే, సమర్థవంతము కాదని అర్థము. అంటే కౌరవ సైన్యం పాండవ సైన్యంతో సరితూగ లేదని భావము. అలాగే భీముని సైన్యము





*పర్యాప్తం* అన్నప్పుడు పరిమిత మైనది అనే గాక, గెలవడానికి *పర్యాప్తం*, అంటే సరిపోతుంది అని భావం. సమర్థవంతంగా ఉంది అని అర్థం. ఇలాంటివి నాలుకలపై నర్తించేందుకు బాగుంటాయి. మనస్సులలో నిలిచేందుకు సరిపోవు.

భారతాన్ని సమగ్రంగా అధ్యయనం చేసిన వారికి ఇవన్నీ చాలా చిన్న విషయాలుగా మూల పడి ఉంటాయి. యుద్ధానికి ముందే ఈ విషయాన్ని సుస్పష్టం చేస్తూ సంజయుణ్ణి దుర్యోధనుడు హెచ్చరిస్తాడు కూడా.

***మాకు నక్షౌహిణులు పదనొకండు, వారికి నేడు. మా సైన్యంబు సారవంతంబు వారి బలంబు నిస్సారంబు*** - అని వ్యాసభారతాన్ని తెనిగిస్తూ తేటతెల్లం చేశాడు తిక్కన సోమయాజి. సారవంతము అంటే అపర్యాప్తం, నిస్సారము అంటే పర్యాప్తం. ఇక సందేహము ఏముంది? ఎక్కడుంది?

ఎంతో చెప్పావు. ఏదేదో చెప్పావు. ఇంతకీ నేను ఏమి చెయ్యాలి? అన్న ప్రశ్న ద్రోణుని కళ్ళల్లో చదివి ఉంటాడు దుర్యోధనుడు. అందుకని చెప్పబో తున్నాడు. మీరు ఏమీ చేయ నవసరం లేదు (ఎలాగూ చేయరని నాకు తెలుసు కనుక). అందరూ చేరి అసమాన పరాక్రమశాలి అయిన భీష్ముణ్ణి రక్షిస్తూ ఉండండి అంటాడు దుర్యోధనుడు.

భీష్ముడు సర్వసేనాధిపతి. గొప్ప యోధుడు. ఆయనను మేము రక్షించడ మేమిటి? తనను తాను రక్షించుకోలేని అసమర్థుడా? అని అనుకుంటారేమో కదా!

కాదు. కాదు. భీష్ముడు అసమర్థుడు కాడు. అతణ్ణి ఎవ్వరూ రక్షింప పనిలేదు. కాకపోతే, పాండవుల్ని వధించను అని శపథం చేశాడు కనుక, పాండవులే చెలరేగి భీష్ముణ్ణి చంపుతా రేమో అనే భయం. అందుకే అతణ్ణి రక్షించు కోవాలి. అతడు జీవించి ఉంటే విజయం తనదే అనేదే దుర్యోధనుని అభిమతం.

**అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః ।**
**భీష్మ మేవాభిరక్షన్తు భవన్తః సర్వ ఏవహి ॥** 11

*అయనేషు-చ-సర్వేషు-యథాభాగం-అవస్థితాః*

*భీష్మం-ఏవ-అభిరక్షంతు-భవంతః-సర్వే-ఏవ-హి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| భవంతః | = | మీరు | యథాభాగం | = | మీ మీ నియమిత |
| సర్వే ఏవ | = | అందరు | | | స్థానముల యందు |
| చ | = | అందువల్ల | అవస్థితాః | = | ఉండినవారై |
| సర్వేషు | = | అన్ని | భీష్మమేవ | = | భీష్మాచార్యుల వారిని |
| అయనేషు చ | = | స్థానాలలో | అభిరక్షంతు హి | = | చక్కగా రక్షింతురు గాక! |

**అన్ని చోట్ల మీరు ఉండ వలసిన స్థానాలను విడిచి పెట్టకుండా ఉండండి. అందరూ ఏకంగా భీష్మణ్ణి రక్షించుకుంటూ ఉండాలి.**

**వ్యాఖ్య**

దుర్యోధనుని గుండెల్లో ఒక వైపు నిరాశా గాలులు వీస్తున్నాయి. మరొక వైపు తన పక్షంలో నిలబడి పోరాడుతున్న నాయకుల మీద అనుమానపు నీడలు ప్రాకుతున్నాయి. ఈ దశలో ఒక్క భీష్ముని మీదే తన ఆశలన్నీ మూగి ఉన్నాయి. కనుకనే అందరూ కలసి భీష్ముణ్ణి రక్షించండి అని రాజుగా ఆజ్ఞాపిస్తున్నాడు దుర్యోధనుడు. భీష్ముని సమీపించే అవకాశం లేకుండా వ్యూహాన్ని నిర్మించి, ఆయా స్థానాలలో వీరుల్ని

నియమించారు. అలా నియమిత స్థానాలను వీడకుండా ఉండి, భీష్ముణ్ణి కాపాడు కోవాలి అంటున్నాడు.

ద్రోణాచార్యునికి సమీపం లోనే భీష్ముడు ఉన్నాడు. దుర్యోధనుని వ్యర్థ ప్రలాప మంతా పితామహునికి వినపడే ఉంటుంది. సమరారంభంలో ఇదొక అనారోగ్యకర మైన వాతావరణ మని భీష్ముడికి తెలుసు. వీరోత్సాహాన్ని ఇలాంటి సన్నివేశాలు నిస్సారంగా మారుస్తాయని కూడా తెలుసు.

దుర్యోధనుడు ఇంతగా ప్రేలుతున్నా, తిరిగి ఒక్క మాటైనా పలకని ద్రోణుని మౌనాన్ని భీష్ముడు అర్థం చేసుకోలేని వాడు కాదు. ఈ దారుణ సన్నివేశాన్ని ఇక కొనసాగించడం శ్రేయస్కరం కాదని భావించాడో ఏమో, పెద్దగా సింహనాదం చేసి శంఖారావం వినిపించాడు.

**తస్య సంజనయ న్హర్షం కురువృద్ధః పితామహః ।**
**సింహనాదం వినద్యోచ్చైః శఙ్ఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥** 12

*తస్య-సంజనయన్-హర్షం-కురువృద్ధః-పితామహః*
*సింహనాదం-వినద్య-ఉచ్చైః-శంఖం-దధ్మౌ-ప్రతాపవాన్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| తస్య | = | అతనికి | ఉచ్చైః | = | గట్టిగా |
| హర్షం | = | సంతోషము | సింహనాదం | = | సింహగర్జనము |
| సంజనయన్ | = | కలిగిస్తూ | వినద్య | = | చేసి |
| ప్రతాపవాన్ | = | ప్రతాపవంతుడు | శంఖం | = | శంఖమును |
| కురువృద్ధః | = | కురువృద్ధుడు | దధ్మౌ | = | పూరించాడు |
| పితామహః | = | పితామహుడు | | | |

**భీష్మపితామహుడు కురువృద్ధుడు. పరాక్రమవంతుడు. దుర్యోధనునికి సంతోషాన్ని కలిగించాలని భావించాడు. అంతే. పెద్దగా సింహనాదం చేసి, శంఖాన్ని పూరించాడు.**

### వ్యాఖ్య

**మాట పడింది - భావం లేచింది**

అందరూ కలసి భీష్ముణ్ణి రక్షించండి అని దుర్యోధనుడు పలికిన మాట భీష్ముల వారి చెవిన పడింది. పరశురాముని నిరసించి పోరాడిన తనను ఇతరులు రక్షించాలా? ఇక ఈ ఉన్మత్త ప్రలాపాన్ని ఆపాలని భావించాడో ఏమో, మాట పలక కుండా సింహగర్జన వంటి కేక వేసి శంఖాన్ని పూరించాడు భీష్ముడు.

తరగతి గదిలో విద్యార్థులు గోల చేస్తూ ఉంటే, ఉపాధ్యాయుడు బల్లను చరుస్తాడు. ఆ శబ్దానికి పిల్లలు నోళ్ళు కట్టేసు కుంటారు. దుర్యోధనా! ఇక పిల్లచేష్టలు, వ్యర్థ ప్రసంగాలు ఆపు! అని చెప్పకుండానే శంఖాన్ని పూరించి దుర్యోధనుని నోరు మూయించాడు భీష్ముడు.

దుర్యోధనుడు అసలు ఇలా ఎందుకు వాగుతున్నాడు? పాండవ సేనను చూచి భీతి చెందుతున్నాడు. భయ విహ్వలుడై, దిక్కు తోచక పూజార్హులను కూడా పరోక్షంగా తూలనాడు తున్నాడు. ఇతనికి ధైర్యం కావాలి. ఉత్సాహం కావాలి. నీరసించిన నాడీమండలం చైతన్యవంతం కావాలి అని భావించి శంఖాన్ని పూరించాడు భీష్ముడు.

ధృతరాష్ట్రకుమారా! దిగులు పడకు. అతులిత శౌర్య పరాక్రమాలు కలిగిన మేము నీ వైపు ఉన్నాం.





పాండవుల్ని మేము ఎదుర్కొంటాం. నువ్వు భీతి చెందకు, అని సంకేతాన్నిస్తూ, తమ శంఖనాదం ద్వారా దుర్యోధనునిలో ధైర్యోత్సాహాలను నింపే ప్రయత్నం చేశాడు భీష్ముడు.

సర్వ సేనాధిపతి భీష్మాచార్యుడు కౌరవ పక్షంలో నిలబడి, సింహనాదం చేసి శంఖాన్ని పూరించాడు. అంటే యుద్ధానికి శ్రీకారం చుట్టాడు అని అర్థం. పితామహుని పిలుపును అందుకొని, సేనలన్నీ వారి వారి నాదాలను వినిపిస్తూ సమ్మతిని తెలిపాయి. సిద్ధం అంటూ శబ్దంతో మారు పలికాయి.

**తతః శఙ్ఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః ।**
**సహసై వాభ్యహన్యన్త స శబ్ద స్తుములోఽభవత్ ॥** 13

*తతః-శంఖాః-చ-భేర్యః-చ-పణవానక గోముఖాః*
*సహసా-ఏవ-అభ్యహన్యంత-సః-శబ్దః-తుములః-అభవత్*

| | | | | |
|---|---|---|---|---|
| తతః | = తరువాత | అభ్యహన్యంత | = | మ్రోగింప బడ్డాయి |
| శంఖాశ్చ | = శంఖములు | స శబ్దః | = | ఆ శబ్దము |
| భేర్యశ్చ | = దుందుభులు | తుములః | = | భయంకరంగా |
| పణవానక గోముఖాః | =తప్పెటలు, రణభేరులు, బూరలు | అభవత్ | = | వ్యాపించింది |
| సహసా+ఏవ | = ఒకేసారి | | | |

**ఆ తరువాత శంఖాలు, దుందుభులు, తప్పెట్లు, రణభేరులు, బూరలు ఒకేసారి మ్రోగాయి. ఆ శబ్దము చాలా భయంకరంగా ఉండింది.**

### వ్యాఖ్య

జ్యేష్ఠుడు, శ్రేష్ఠుడు అయిన భీష్ముడు శంఖాన్ని పూరించ గానే కౌరవసేన లోని వారందరూ ఇక యుద్ధం ఆరంభ మైనట్లే నని భావించి, ఎవరికి వారుగా శబ్ద సంకేతాలను అందించారు.

భం భం అంటూ శంఖాలు ధ్వనించాయి. వారి పక్షం లోనే మరో వైపు నుండి ప్రతిధ్వనించాయి. దుందుభులు పెద్దగా మ్రోగాయి. తప్పెట్ల శబ్దాలు ఉరుముల మోతల్లా ఉన్నాయి. మేఘ గర్జనంలా రణభేరులు దిక్కులు పిక్కటిల్లేలా వినిపించాయి. కర్ణభేరులను బద్దలు చేస్తున్నట్లు బూరల శబ్దాలు చొచ్చుకు పోతున్నాయి.

భూమ్యాకాశాలు శబ్దమయంగా మారి పోయాయి. ఎటు చూచినా శబ్దాలే. ఏ వాయిద్యాలు లేని పదాతి దళాలు నోళ్ళ తోనే విచిత్రంగా అరుస్తూ వికృత ధ్వనులు వినిపించాయి.

కౌరవసేనలు ఇంతగా సంకుల సమరనాదాలు చేస్తూ ఉంటే, పాండవ సేనలు ఏమి చేశాయో! ఏమి చేస్తాయి? చర్యలు ఉన్నప్పుడు ప్రతిచర్యలు తప్పుతాయా? ధ్వనులు ఉన్నప్పుడు ప్రతిధ్వనులు లేకుండా ఉంటాయా? ఈ వైపు ఒకటి అంటే ఆ వైపు ఆరు అంటున్నారు. అదే కదా యుద్ధ మంటే. పాండవులు కూడా శంఖాలను పూరిస్తున్నారు. తరువాత శ్లోకం నుండి ఆరు శ్లోకాల వరకు ఆ నాదాలే. సునాదాలే.

**తతః శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ ।**
**మాధవః పాణ్డవ శ్చైవ దివ్యౌ శఙ్ఖౌ ప్రదధ్మతుః ॥** 14

*తతః-శ్వేతైః-హయైః-యుక్తే-మహతి-స్యందనే-స్థితౌ*
*మాధవః-పాండవః-చ-ఏవ-దివ్యౌ-శంఖౌ-ప్రదధ్మతుః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| తతః | = | తరువాత | స్థితౌ | = | ఉన్న |
| శ్వేతైః | = | తెల్లని | మాధవః | = | శ్రీకృష్ణుడు |
| హయైః | = | గుఱ్ఱములతో | పాండవశ్చైవ | = | అర్జునుడూ |
| యుక్తే | = | కూడిన | దివ్యౌ | = | శ్రేష్ఠములైన |
| మహతి | = | ఉత్తమమైన | శంఖౌ | = | శంఖాలను |
| స్యందనే | = | రథము నందు | ప్రదధ్మతుః | = | పెద్దగా పూరించారు |

**ఇక, ఆ తరువాత, తెల్లని గుఱ్ఱాలు కట్టిన రథంలో శ్రీకృష్ణుడు, అర్జునుడు ఉన్నారు. వారిద్దరు ఎంతో శ్రేష్ఠమైన శంఖాలను పూరించారు.**

### వ్యాఖ్య

కౌరవసేన నుండి భయంకరంగా సమర నాదాలు మ్రోగాయి. మేమూ సిద్ధమే నంటూ, తెల్లని గుఱ్ఱాలు కట్టిన గొప్ప రథము మీద ఆసీనులైన శ్రీకృష్ణార్జునులు దివ్యము లైన శంఖాలను పూరించారు.

**శుభమస్తు**

శ్రీకృష్ణార్జునుల దర్శనమే శుభదర్శనం. వారి శకటమే శుభ శకటం. గొప్పదైన రథంలో ఉన్నారు అంటున్నాడు సంజయుడు ***( మహతి స్యందనే ).*** యుద్ధభూమిలో ఎన్నో రథా లున్నాయి. ఇది అలాంటి సాధారణమైన రథం కాదు. ఖాండవ వనాన్ని దహించి నపుడు తృప్తి చెందిన అగ్నిదేవుడు ఆనందంతో ప్రసాదించిన సురలోక శకట మది.

ఆ రథానికి పూన్చిన గుఱ్ఱాలు కూడా సామాన్య మైనవి కావు. దేవ లోకమునకు సంబంధించినవి. అట్టి రథంలో ఉన్న శ్రీకృష్ణార్జునులు మ్రోగించిన శంఖములు కూడా మామూలు శంఖాలు కావు. ఓంకారంతో ధ్వనించే దేవతా శంఖములు. కనుకనే వాటి ధ్వని ప్రత్యేకంగా వినిపించింది. ఈ కారణం చేతనే ***'దధ్మతుః'*** అనకుండా 'ప్ర' అనే ఉపసర్గను చేర్చి ***'ప్రదధ్మతుః'*** అంటూ ధ్వని విశేషాన్ని శ్లాఘించాడు సంజయుడు.

అంతా ప్రత్యేకతే. అన్నీ ప్రత్యేకతలే. ఈ ప్రత్యేకతలలో ఉన్న దంతా దివ్యమైన ప్రభావమే. తెల్లని గుఱ్ఱాలు కట్టిన దేవతా రథము కనుక అన్నిటి కన్నా ప్రత్యేకంగా, దివ్యంగా శోభిస్తూ ఉంది. తెల్లదనము శాంతికి చిహ్నము. అపజయాలు, అవరోధాలు ఉన్న చోట శాంతి ఉండదు. కనుక తెల్లదనము విజయ చిహ్నము.

**విజయోస్తు**

శ్రీకృష్ణార్జునులు ఉన్న రథము, ఆ రథానికి కట్టిన గుఱ్ఱాలు, వారు మ్రోగించిన శంఖాలు అన్నిటిని విశేషణాలతో సంజయుడు వైభవోపేతంగా వర్ణించాడు. ఈ వర్ణన లోనే వివరణ లన్నీ ఉన్నాయి. అన్నీ విజయ చిహ్నాలే. ఇవన్నీ విని న తరువాత ధృతరాష్ట్రుడు మనస్సు మార్చుకుంటా డని, సంధి చేసుకోమని దుర్యోధనునికి ఆజ్ఞ లిస్తాడని సంజయుడు ఊహిస్తున్నాడు. ఆశిస్తున్నాడు. అలా జరిగితే, ఇరుపక్షాలకు విజయమే. లేదా, విజయము ఏకపక్షం గానే ఉంటుంది. ఆ పక్షము ఎవరిది? అనే సంశయానికి ఇక తావు లేదు. ఆ వివరణమే ఈ వర్ణనము. తనకు విజయమో! వినాశమో! ధృతరాష్ట్రుడే నిర్ణయించుకోవాలి.

ఇలా పలికి పాండవ సైన్యంలో ఎవరెవరు ఏయే నాదాలు వినిపించారో, ఏయే శంఖాలు పూరించారో విపులంగా వివరిస్తున్నాడు సంజయుడు.





పాఞ్చజన్యం హృషీకేశో దేవదత్తం ధనఞ్జయః ।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥ 15

*పాంచజన్యం-హృషీకేశః-దేవదత్తం-ధనంజయః*
*పౌండ్రం-దధ్మౌ-మహాశంఖం-భీమకర్మా-వృకోదరః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| హృషీకేశః | = | శ్రీకృష్ణుడు | వృకోదరః | = | భీముడు |
| పాంచజన్యం | = | పాంచజన్యమును | పౌండ్రం | = | పౌండ్రమనే |
| ధనంజయః | = | అర్జునుడు | మహాశంఖం | = | గొప్ప శంఖమును |
| దేవదత్తం | = | దేవదత్తమును | దధ్మౌ | = | పూరించారు |
| భీమకర్మా | = | భయంకరమైన పనులు చేసే | | | |

**శ్రీకృష్ణుడు పాంచజన్యాన్ని పూరించాడు. అర్జునుడు దేవదత్తాన్ని ఊదాడు. ఇక భీకర కృత్యాలు చేసే భీముడు మాత్రం, పౌండ్రం అనే గొప్ప శంఖాన్ని మ్రోగించాడు.**

### వ్యాఖ్య

**దైవ సన్నిధి**

కౌరవ పక్షంలో ప్రథమంగా భీష్ముడు శంఖాన్ని పూరించాడు. కాని, పాండవుల పక్షంలో ప్రథమంగా శ్రీకృష్ణ భగవానుడు పూరించాడు. సర్వ సేనాధిపతిగా ఆ వైపు భీష్ముడు మ్రోగించి నపుడు ఈ వైపు ధృష్టద్యుమ్నుడు మ్రోగించాలి. కాని, యుద్ధము చేయను అని ద్వారక లోనే దుర్యోధ నార్జునులకు ప్రతిజ్ఞ చేసిన శ్రీకృష్ణుడు యుద్ధంలో శంఖాన్ని పూరించాడు.

కౌరవుల సైన్యము వీరుల పరిరక్షణలో ఉంది. పాండవ సైన్యము దైవానుగ్రహంతో నడుస్తుంది అని దీని అర్థము. పాండవ పక్షానికి అధ్యక్ష స్థానంలో అచ్యుతుడు ఉన్నాడు. ఇక వారికి నశింపు లేదు అని భావము.

పరమేశ్వరుడు పూరించిన శంఖము పేరు పాంచజన్యము. శ్రీకృష్ణుడు తన గురుపుత్రుని అపహరించిన పంచజనుడు అనే రాక్షసుని సంహరించి, అతని ఎముకతో శంఖమును తయారు చేసుకోవడం చేత ఆ శంఖానికి పాంచజన్యము అనే పేరు వచ్చింది.

**శంఖము శల్యమే**

శంఖము అనేది ఒక ప్రాణి. అది జలచరము. చేప లాగా నీటిలో ఉంటుంది. మనకు మాంసము, ఎముకలు దేహం లోపల ఉంటాయి. పైన చర్మము ఉంటుంది. శంఖమునకు అలా కాదు. బయట ఎముక ఉండి లోపల మాంసము ఉంటుంది. కనుకనే శంఖంలో ప్రాణి ఉన్నప్పుడు నీళ్ళల్లో శంఖము కదులుతూ ఉండటాన్ని కూడా మనం చూడగలం.

సముద్రంలో పంచజనుడు అనే రాక్షసుని ఎముక నుండి గ్రహించుట చేత శ్రీకృష్ణుని శంఖమునకు పాంచజన్యము అనే పేరు వచ్చింది.

**శంఖాస్థి పావనం అపావన మస్థిమాణాం**

శంఖము యొక్క ఎముక చాలా పవిత్రము. ఇతర ప్రాణుల ఎముకలను మనం అపవిత్రంగా భావిస్తాము. శంఖము యొక్క ఎముక పవిత్రము కాబట్టే మనం లింగాభిషేకాన్ని శంఖము తోనే నిర్వహిస్తాము. ఒక పురుగు లేదా ప్రాణి యొక్క శల్యము పూజోపకరణంగా మారిపోయింది. ఎంత అద్భుతం!

శ్రీకృష్ణ పరమాత్మ పాంచజన్యాన్ని పూరించాడు. అది మామూలు శబ్దము కాదు. గీతాఘోషము. హృషీకములు అంటే ఇంద్రియాలు. వాటికి ప్రభువు కనుక శ్రీకృష్ణుడు హృషీకేశుడు. అట్టి శ్రీకృష్ణుడు పాండవుల వైపు ఉన్నాడు. కనుక కౌరవుల శక్తి సామర్థ్యాలు పాండవుల ముందు పని చేయవు అనేది సంజయుని అభిప్రాయం. యుద్ధం మానుకోమని ధృతరాష్ట్రునికి సంకేతం.

శ్రీకృష్ణదేవుని ఈ శ్లోకంలో హృషీకేశుడని పలికిన సంజయుడు ముందు శ్లోకంలో మాధవుడని అన్నాడు. మాధవుడు అంటే లక్ష్మీపతి అని అర్థము. 'మా' అంటే లక్ష్మీదేవి. ఆమెకు 'ధవుడు' అనగా భర్త కనుక మాధవుడు *( మాయాః శ్రియః ధనః పతిః మాధవః ).* ఇక్కడ లక్ష్మీదేవి అంటే ధాన్యలక్ష్మి, సంతానలక్ష్మి అని అర్థం కాదు. జయలక్ష్మి, విజయలక్ష్మి, రాజ్యలక్ష్మి అని అర్థము. విజయలక్ష్మి భర్త పాండవుల వైపు ఉన్నాడు కనుక విజయము వారిదే, ఇక నీ ఇష్టం, అని ధృతరాష్ట్రుని సూక్ష్మంగా హెచ్చరిస్తున్నాడు సంజయుడు.

**దైవ ప్రసాదం**

శ్రీకృష్ణుడు పాంచజన్యాన్ని పూరిస్తే, అర్జునుడు దేవదత్తాన్ని మ్రోగించాడు. దేవాసుర సంగ్రామంలో రాక్షసులతో పోరాడి విశేషంగా వారిని అర్జునుడు సంహరించి నపుడు అచ్చెరు వొందిన దేవతలు ఆనందంతో అనుగ్రహించిన శంఖమే దేవదత్తము. కనుక అర్జునుని శంఖారావము సాధారణ శంఖధ్వని కాకుండా అలౌకిక నాదాన్ని వినిపిస్తూ ఉంటుంది.

అర్జునాచ్యుతులు నరనారాయణులే అని మనకు తెలుసు. అర్జునుడు నరుడు. నరుడికి దేవతలు ప్రసాదించింది కనుక పార్థుని శంఖము దేవదత్తము. వాస్తవానికి ఒక్క నరుడికే కాదు, అర్జునుడికే కాదు, నరులందరికీ, సమస్త మానవాళికి దేవదత్త మనే శంఖము ప్రసాదించ బడింది. దానిని వినియోగించుకొనే సామర్థ్యం ఉంటే ప్రతి ఒక్కరు అలౌకిక నాదాలను ఆలకించ వచ్చు. ఆనంద స్వరాలను ఆస్వాదించ వచ్చు. సృష్టిలో ఏ ప్రాణికి దక్కని ఈ భాగ్యాన్ని భగవంతుడు నరులకే ప్రసాదించాడు. అందుకే అది దేవదత్తం.

మానవుని కంఠమే దేవదత్తం. పశుపక్ష్యాదులకు కంఠాలు ఉన్నాయి. అవి అరుపులకు పనికొస్తాయి. అక్షరాన్ని పలికేందుకు ఉపకరించవు. అనంతుని నామమే అక్షరం. దివ్యాక్షరం. వేద నాదమే అక్షరం. వేదవాణి అక్షరం. ఇవన్నీ పలికేందుకు, పాడేందుకు సహకరించే కంఠ మనే శంఖము దైవ ప్రసాదం. దేవదత్తం. పలికే వారికి భగవంతుడు పలుకుతాడు. పిలిచే వారికి భగవంతుడు పలుకుతాడు. నారదుడికి పలికాడు. ప్రహ్లాదునికి పలికాడు. మీరాబాయికి పలికాడు. త్యాగరాజుకు పలికాడు. దేవదత్తాన్ని మ్రోగించే వాళ్ళు ఎవరైనా కృష్ణ ప్రియులే. కృష్ణ సఖులే. అర్జునులే.

*జగతి కొలనులో వెలుగు చున్నది*
*కమల లోచనుని చరణ కమలము* *
*ఆడవే పాడవే అందాల తుమ్మెద*
*సుధలు గ్రోలి నిండును నీ యెద*
*పాడవే తుమ్మెద కృష్ణుని మీద*
*ఆడవే పాడవే హాయిగా తీయగా   ॥ పాడవే ॥*

అని దేవదత్తాన్ని పూరించే ప్రయత్నం చేసింది చైతన్య గీతిక.

దేవదత్తాన్ని పూరించిన అర్జునుని ధనంజయుడు అంటున్నాడు సంజయుడు. రాజసూయ యాగ సమయంలో రాజ్యాలను, రాజ్యాధిపతులను జయించి ధనరాశుల్ని తెచ్చి నందున అర్జునుడు ధనంజయు డని మహాభారతంలో వ్యాసుని మాట. అంటే ధనం అర్జునుని ముందు ఓడి పోయిందని భావము. దైవానికే



* పాదో౽స్య విశ్వాభూతాని - పురుషసూక్తము.



గాని ధనానికి పీట వేయని పార్థుడు ధనంజయుడు. అందుకే దైవాన్ని తన బండి లోనే కూర్చోబెట్టు కున్నాడు విజయుడు.

ఇక్కడ ధనంజయుడు అనే సంబోధనముతో మరొక సంకేతాన్ని కూడా ధృతరాష్ట్రునికి ఇచ్చాడు సంజయుడు. అర్జునుడు ధనం కోసం యుద్ధం చెయ్యడం లేదు. ధర్మం కోసం యుద్ధం చేస్తున్నాడు. ధర్మ రూపంలో ఉన్న దైవం ప్రక్కనే ఉన్నాడు. విజయము వాళ్ళనే వరించి తీరుతుంది. కనుక, సంధికి ఇంకా సమయం దాటి పోలేదు. ఇక నైనా మేలుకో అని పరోక్షంగా హెచ్చరిస్తున్నాడు.

అంతేకాదు. ఈ శ్లోకంలో అర్జునుని ధనంజయు డని పేర్కొనిన సంజయుడు ముందు శ్లోకంలో పాండవః అన్నాడు. అంటే, పాండురాజు కుమారుడు అని అర్థము. రాజ్యము పాండురాజుదే కనుక, ఏ విధంగా చూచినా రాజ్యము పాండవులదే అని మర్మంగా భాషించాడు కూడా.

**భీమం - భీకరం**

భయంకరమైన కార్యాలు చేసే భీముడు పౌండ్రము అనే గొప్ప శంఖాన్ని పూరించాడు. వృకము అనే అగ్నిని కుక్షిలో కలిగి ఉన్నాడు కనుక భీమునికి వృకోదరుడు అనే పేరు వచ్చింది. ఎంత ఆహారా న్నైనా జీర్ణించుకొనే శక్తి భీమునికి ఉంది. అలాగే యుద్ధంలో ఎందరి నైనా మట్టుపెట్టే సామర్థ్యం కూడా ఉంది. భయంకరమైన కర్మలు చేసే భీమసేనుడు పౌండ్ర మనే శంఖాన్ని భీకరంగా ఊదాడు. పాండవులలో మిగిలిన ముగ్గురు సోదరులు ఏయే శంఖాలను పూరించారో తరువాత శ్లోకంలో చెబుతున్నాడు సంజయుడు.

**అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః ।**
**నకులః సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ ॥** 16

*అనంతవిజయం-రాజా-కుంతీ పుత్రః-యుధిష్ఠిరః*
*నకులః-సహదేవః-చ-సుఘోష మణిపుష్పకౌ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కుంతీపుత్రః | = | కుంతీపుత్రుడు | నకులః | = | నకులుడు |
| రాజా | = | రాజైన | సహదేవశ్చ | = | సహదేవుడు |
| యుధిష్ఠిరః | = | ధర్మరాజు | సుఘోష మణిపుష్పకౌ | = | సుఘోష మణిపుష్పకము లనే శంఖాలను |
| అనంత విజయం | = | అనంత విజయమును | | | |

**కుంతీపుత్రుడు, మహారాజైన యుధిష్ఠిరుడు, అనంత విజయ మనే శంఖాన్ని పూరిస్తే, నకులుడు సుఘోషాన్ని, సహదేవుడు మణిపుష్పకాన్ని పూరించారు.**

వ్యాఖ్య

**అనంతం**

ధర్మరాజు అనంత విజయము అనే శంఖాన్ని పూరించాడు. అనంత విజయం అంటే సదా విజయమును దర్శించు వాడు అని అర్థము. ధర్మరాజును ప్రత్యేకంగా రాజు అని సంజయుడు సంబోధించడం గమనార్హం.

ప్రస్తుతం రాజ్యానికి రాజు దుర్యోధనుడే గాని ధర్మరాజు కాదు. దుర్యోధనుడు రాజ్యాన్ని మోసంతో చేజిక్కించుకున్నా, వాస్తవానికి ధర్మరాజే రాజు అని సంజయుడు ధర్మవచనాన్ని వినిపిస్తున్నాడు. అంతే కాదు. అనంత విజయము అనే శంఖాన్ని పూరించిన యుధిష్ఠిరుడు కురుక్షేత్రంలో విజయాన్ని సాధించి, రాజుగా సింహాసనాన్ని అధిష్ఠించేది తథ్యం అనేది కూడా సంజయుని మాటల్లో దోబూచు లాడుతోంది.

**సుఘోషం**

నకులుడు సుఘోషము అనే శంఖాన్ని పూరించాడు. సుఘోషము అంటే ఇంపైన శబ్దము. శ్రావ్యమైన శబ్దము. మంగళకరమైన ధ్వని. ధర్మరాజు అనంత విజయాన్ని ఊది విజయ కేతనాన్ని ఎగుర వేయడం ఖాయం అని సూచిస్తే, ఆ తరువాత మంగళ నాదాలతో ధర్మరాజు సింహాసనాన్ని అధిష్ఠించడం అక్షర సత్యం అని సుఘోషం ద్వారా నకులుడు చెప్పకనే చెబుతున్నాడు.

**మణిపుష్పకం**

సహదేవుడు మణిపుష్పకం అనే శంఖాన్ని పూరించాడు. ధర్మరాజు అనంత విజయాన్ని పూరించేశాడు. విజయ సూచకంగా నకులుడు సుఘోషాన్ని వినిపించాడు. మణిమయ నవరత్న ఖచిత సింహాసనం పై ధర్మరాజు ఆసీనుడు కావడం ఒక్కటే మిగిలి ఉంది. అది కూడా జరిగి తీరుతుంది అనే సంకేతా న్నిస్తూ సహదేవుడు మణిపుష్పకాన్ని పూరించాడు.

**విజయ సూచకం**

ఐదుగురు పాండవ సోదరులు దివ్యములైన ఐదు శంఖాలను పూరించారు. అన్నీ విజయ సూచకంగా, మంగళకరంగా వినిపించాయి. శంఖాలు ఐదు వినిపించినా విజయం ఒక్కటే అన్నట్లుగా ఉంది ఆ ఘోష. పైగా ఆ రోజు ఏకాదశి.

దివ్య నామాలతో శోభించే పాండవుల శంఖాలు శ్వేతవర్ణంతో పవిత్రంగా ప్రకాశిస్తున్నాయి. **పాండవాః** అంటే హంస రెక్కల వలె తెల్లగా ఉండే వారు, స్వచ్ఛమైన వారు అని అర్థము. ఇదంతా విజయ సూచకమే.

పాండవులకు ముందుగానే కౌరవులు శంఖములను పూరించారు. కాని, ఒక్క శంఖమున కైనా పేరు ఉన్నట్లు వినలేదు. అవి ప్రఖ్యాతికి నోచుకోని శంఖాలు. పాండవుల శంఖాలకు పేరు ప్రఖ్యాతు లున్నాయి. అంటే, ప్రసిద్ధమైన వని భావం. పంచ పాండవులతో పాటు పాండవ పక్షాన ఇంకా ఎవరెవరు శంఖాలను పూరించారో చెబుతున్నాడు సంజయుడు.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖణ్డీ చ మహారథః ।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః ॥ 17

*కాశ్యః-చ-పరమేష్వాసః-శిఖండీ-చ-మహారథః*
*ధృష్టద్యుమ్నః-విరాటః-చ-సాత్యకిః-చ-అపరాజితః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పరమేష్వాసః | = | శ్రేష్ఠమైన విల్లు గల | ధృష్టద్యుమ్నః | = | ధృష్టద్యుమ్నుడును |
| కాశ్యశ్చ | = | కాశీరాజు | విరాటః చ | = | విరాటుడును |
| మహారథః | = | మహారథుడైన | అపరాజితః | = | పరాజయ మెరుగని |
| శిఖండీ చ | = | శిఖండియు | సాత్యకిః చ | = | సాత్యకియును |

**గొప్ప ధనుస్సును పట్టుకొని కాశీరాజు, మహారథుడు శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరాటుడు, పరాజయం తెలియని సాత్యకి - ఇంకా,**

వ్యాఖ్య

మహా ధనుర్ధారి కాశీరాజు, మహారథు డైన శిఖండి, సర్వసేనాధిపతి ధృష్టద్యుమ్నుడు, విరాటరాజు, పరాజయ మెరుగని కృష్ణుని సోదరుడు సాత్యకి వారి వారి శంఖాలను మ్రోగించారు.





ఈ శ్లోకంలో కూడా చివరగా అపజయము లేదు అనే మాటను వినిపిస్తున్నాడు సంజయుడు. యుద్ధమును మొదట నుండి వ్యతిరేకిస్తున్న సంజయుడు అనుక్షణము ఆ ప్రయత్నం లోనే ఉన్నట్లు కనిపిస్తోంది.

కౌరవుల విజయం భీష్మద్రోణుల మీదే ఆధారపడి ఉంది. కాని, కేవలం వారిద్దరిని సంహరించ డానికే జన్మించిన వీరులు ఇద్దరు ఈ శ్లోకం లోనే ఒదిగి పోయారు. భీష్ముని పాలిట మృత్యువుగా శిఖండి, ద్రోణుని పాలిట కాలుడుగా ధృష్టద్యుమ్నుడు కనిపిస్తూనే ఉన్నారు. అందుచేత కూడా పాండవులు అపరాజితులు. పాండవ సేనలో శంఖనాదం చేసిన వీరులను తరువాత శ్లోకంలో కూడా చెప్పి, అక్కడికి ఆపుతున్నాడు.

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే ।
సౌభద్రశ్చ మహాబాహుః శఙ్ఖాన్ దధ్ముః పృథక్ పృథక్ ॥ 18

*ద్రుపదః-ద్రౌపదేయాః-చ-సర్వశః-పృథివీపతే*
*సౌభద్రః-చ-మహాబాహుః-శంఖాన్-దధ్ముః-పృథక్-పృథక్*

| | | | | | |
|---|---|---|---|---|---|
| పృథివీపతే | = | హే భూపతీ! | సర్వశః | = | అంతట |
| ద్రుపదః | = | ద్రుపదుడు | పృథక్ పృథక్ | = | వేరు వేరుగా |
| ద్రౌపదేయాః చ | = | ద్రౌపది కుమారులు | శంఖాన్ | = | శంఖములను |
| మహాబాహుః | = | గొప్ప భుజములు గల | దధ్ముః | = | పూరించారు |
| సౌభద్రః చ | = | సుభద్ర కొడుకు అభిమన్యుడు | | | |

**హే ధృతరాష్ట్ర మహారాజా! ద్రుపదరాజు, ద్రౌపది కొడుకులు, గొప్ప బాహువులతో శోభిస్తూ సుభద్ర కొడుకు అభిమన్యుడు - అందరూ అంతట ఎవరికి వారుగా శంఖాలను పూరించారు.**

వ్యాఖ్య

**క్రమం - సక్రమం**

ద్రుపదరాజు, ద్రౌపది కుమారులు (ఉప పాండవులు ఐదు మంది), గొప్ప బాహువులు కలిగిన సుభద్ర కుమారుడు అభిమన్యుడు, వీరందరూ శంఖాలను పూరించారు. కాని పాండవ పక్షం లోని వీరులు పూరించిన శంఖాలన్నీ వేరు వేరుగా ధ్వనించాయి (***పృథక్ పృథక్***) అంటున్నాడు సంజయుడు.

కౌరవులు పూరించి నపుడు నేటి చట్టసభల్లో ప్రజా ప్రతినిధు లందరూ మూకుమ్మడిగా లేచి, ఒకేసారి అర్థం కాకుండా అరచినట్లు ఉంటే, పాండవులు పూరించిన శంఖాలు ఒక దాని తరువాత ఒకటిగా సునాద భరితంగా, పూర్వపు రోజుల్లో క్రమశిక్షణ కలిగిన నాయకులు చట్టసభల్లో ఒకరి తరువాత ఒకరు భావగర్భితంగా ప్రసంగించినట్లు ఉన్నాయని అర్థము.

కౌరవుల క్రమశిక్షణా రాహిత్యానికి, పాండవుల క్రమశిక్షణకు ఈ శంఖారావాల లోని వ్యత్యాసాలే అద్దం పడుతున్నాయి.

ఈ శ్లోకంలో ధృతరాష్ట్రుని పృథివీపతీ! అని సంజయుడు సంబోధించడం వాస్తవానికి విశేషమే. ప్రస్తుతం నీవు భూపతివి. పాండవుల భూమిని వారికి పంచి ఇచ్చి నట్లైతే, ఈ భీకర పోరాటము ఉండేది కాదు. కాని, నీవే పృథివీపతిగా శోభించా లనుకున్నావు. ఇక ఆ స్థానము ఉండబోదు. నీకు రాజ్యం మిగలదు. నీవు రాజుగా ఉండలేవు. అందుకే చివరి సారి పృథివీపతీ! అని పిలుస్తున్నా. కళ్ళు ఎలాగూ తెరువలేవు. మనస్సు నైనా తెరచి చూడు. వాళ్ళ రాజ్యాన్ని వాళ్ళకు అప్పగించడం క్రమం. సక్రమం. లేదా, అంతా అక్రమమే. అధర్మమే. ఇది, సంజయుని పిలుపు లోని అంతర్భావం.

ఇంతవరకు పాండవుల శంఖనాదాలను వినిపించిన సంజయుడు, వాటి ప్రభావము ఎలా ఉందో చెబుతున్నాడు.

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్ ।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్ ॥ 19

*సః-ఘోషః-ధార్తరాష్ట్రాణాం-హృదయాని-వ్యదారయత్*
*నభః-చ-పృథివీం-చ-ఏవ-తుములః-వ్యనునాదయన్*

| | | | |
|---|---|---|---|
| తుములః | = భయంకరమైన | వ్యనునాదయన్ | = మారు పలికిస్తూ |
| సః ఘోషః | = ఆ శబ్దము | ధార్తరాష్ట్రాణాం | = ధృతరాష్ట్రుని బిడ్డల |
| నభః చ | = ఆకాశమును | హృదయాని | = గుండెలను |
| పృథివీం చ ఏవ | = భూమిని కూడా | వ్యదారయత్ | = చీల్చి వేసింది |

**పాండవులు భయంకరంగా శంఖాల్ని పూరించారు. ఆ శబ్దాలు భూమ్యాకాశాలను ప్రతిధ్వనింప చేశాయి. ధృతరాష్ట్రుని బిడ్డల గుండెల్లో దడ పుట్టించాయి.**

వ్యాఖ్య

పాండవ సైన్యము చేసిన శంఖనాదాలు భూమ్యాకాశాలను ప్రతిధ్వనింప చేశాయి. దారుణమైన ఆ సంకుల శంఖ ధ్వనికి దుర్యోధనాదుల గుండెలు జారి పోయాయి.

అంతకన్నా ముందే కౌరవులు శంఖనాదాలు వినిపించడం మనం చూశాం. ఆ శబ్దాలకు పాండవులు చలించ లేదు. కాని, పాండవుల భయంకర మైన శంఖ నాదాలకు కౌరవుల హృదయాలు బ్రద్ద లైనట్లు వింటున్నాం.

హృదయ విదారకమైన ఈ పరిస్థితికి పాండవుల వీర్య శౌర్యాలు, దివ్యములైన శంఖములు వినిపించిన భీకర ధ్వనులు ఒక కారణ మైతే, కౌరవులలో దోష స్పృహతో కూడిన ఆంతరంగిక సంఘర్షణ మరొక కారణము.

పాండవుల శంఖనాదాలకు కౌరవులలో అధైర్యం చోటు చేసుకున్నట్లు స్పష్టంగా తెలుస్తూ ఉంది. కాని, కౌరవుల శంఖనాదాలకు పాండవులు భీతి చెందక పోగా, రెట్టించిన ధైర్యోత్సాహాలతో ప్రతిస్పందనను వినిపించారు.

కౌరవుల భయానికి వారి అధర్మ వర్తనమే కారణము. పాండవుల ధైర్యానికి వారి ధర్మవర్తనము, గతంలో ఆర్జించిన పుణ్యమే కారణము.

అథ వ్యవస్థితా న్దృష్ట్వా ధార్తరాష్ట్రా న్కపిధ్వజః ।
ప్రవృత్తే శస్త్రసమ్పాతే ధను రుద్యమ్య పాణ్డవః ॥ 20
హృషీకేశం తదా వాక్య మిదమాహ మహీపతే ।

*అథ-వ్యవస్థితాన్-దృష్ట్వా-ధార్తరాష్ట్రాన్-కపిధ్వజః*
*ప్రవృత్తే-శస్త్రసంపాతే-ధనుః-ఉద్యమ్య-పాండవః*
*హృషీకేశం-తదా-వాక్యం-ఇదం-ఆహ-మహీపతే*





| | | | |
|---|---|---|---|
| అథ | = తరువాత | దృష్ట్వా | = చూచి |
| మహీపతే | = ఓ భూపతీ! | ధనుః | = వింటిని |
| శస్త్రసంపాతే | = ఆయుధ ప్రయోగము | ఉద్యమ్య | = ఎత్తి పట్టుకొని |
| ప్రవృత్తే | = జరుగ బోతుండగా | తదా | = అప్పుడు |
| కపిధ్వజః | = పతాకము నందు కపిరాజు గల | హృషీకేశం | = శ్రీకృష్ణునితో |
| పాండవః | = పాండు కుమారుడు | ఇదం | = ఈ |
| వ్యవస్థితాన్ | = సిద్ధంగా ఉన్న | వాక్యం | = మాటను |
| ధార్తరాష్ట్రాన్ | = ధృతరాష్ట్రుని బిడ్డల్ని | ఆహ | = పలికాడు |

**ధృతరాష్ట్ర మహారాజా! ఆయుధ ప్రయోగానికి సమయం ఆసన్నమైంది. జండా పై కపిరాజును పెట్టుకున్న అర్జునుడు నీ కొడుకుల్ని చూశాడు. ధనుస్సును పైకెత్తి కృష్ణుడితో చెబుతున్నాడు.**

వ్యాఖ్య

శస్త్రాస్త్ర ప్రయోగానికి సమయం ఆసన్న మైంది. జండాపై కపిరాజును కలిగిన అర్జునుడు దుర్యోధనాదుల్ని చూశాడు. గాండీవాన్ని ఎత్తి పట్టుకున్నాడు. ఏదో చెప్పాలని శ్రీకృష్ణుని వైపు చూశాడు.

రణరంగంలో అందరి రథాలకు పతాకాలు ఉంటాయి. కొందరివి ప్రత్యేక చిహ్నాలతో ఉంటాయి. అర్జునుని రథానికి అమర్చిన పతాకంపై కపీశుడు హనుమంతుడు ఉన్నాడు.

మహాభారతము - అరణ్యపర్వములో గంధమాదన పర్వత ప్రదేశము గుండా సౌగంధికా వనం వైపు సాగి పోతున్న భీమసేనుడికి హనుమంతుడు దర్శన మిచ్చి, కురుక్షేత్ర సంగ్రామంలో అర్జునుని రథముపై రెపరెప లాడే ధ్వజముపై తాను ఉంటాడని మాట ఇచ్చాడు. అలాగే ఇప్పుడు అర్జునుని స్యందన ధ్వజంపై ఆంజనేయుడు శోభిస్తున్నాడు.

**అర్జున ఉవాచ :**

సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత ॥ 21
యావ దేతా న్నిరీక్షేఽహం యోద్ధుకామా నవస్థితాన్ ।
కైర్మయా సహ యోద్ధవ్య మస్మి న్రణ సముద్యమే ॥ 22

*సేనయోః-ఉభయోః-మధ్యే-రథం-స్థాపయ-మే-అచ్యుత*
*యావత్-ఏతాన్-నిరీక్షే-అహం-యోద్ధుకామాన్-అవస్థితాన్*
*కైః-మయా-సహ-యోద్ధవ్యం-అస్మిన్-రణసముద్యమే*

| | | | |
|---|---|---|---|
| అచ్యుత | = శ్రీకృష్ణా! | అస్మిన్ | = ఈ |
| ఉభయోః | = రెండు | రణసముద్యమే | = యుద్ధ సమయాన |
| సేనయోః | = సేనల | మయా | = నా చేత |
| మధ్యే | = నడుమ | కైః+సహ | = ఎవరితో |
| మే | = నా యొక్క | యోద్ధవ్యం | = యుద్ధము చేయాలో |
| రథం | = రథమును | యోద్ధుకామాన్ | = సమరవాంఛ గల |
| స్థాపయ | = ఉంచు | అవస్థితాన్ | = ఉన్న |

| | | | |
|---|---|---|---|
| ఏతాన్ | = వీళ్ళను | యావత్ నిరీక్షే | = ఎక్కడ నుండి చూడగలనో |
| అహం | = నేను | | |

**అర్జునుడు అంటున్నాడు :**

**కృష్ణా! నా రథాన్ని నడిపించు. రెండు సేనల మధ్యన ఉంచు. నే నెవరితో యుద్ధం చేయాలి? యుద్ధానికి ఎవరెవరు సిద్ధంగా ఉన్నారు? వాళ్ళను నేను చూచేటట్లు నా రథాన్ని ఉంచు.**

**వ్యాఖ్య**

మహాభారత యుద్ధము ప్రారంభమయ్యే సమయం సమీపించింది. మహాభారతానికి ముందు ఎన్నో యుద్ధాలు జరిగాయి. కాని మహాభారతము లాంటి యుద్ధము మును పెన్నడూ జరగ లేదు. అందుకే అది మహా సంగ్రామము.

ఉభయ సైన్యాలు సమరానికి సిద్ధంగా ఉన్నాయి. ఏనుగులు ఘీంకరిస్తున్నాయి. అశ్వములు సకిలిస్తున్నాయి. అంతా కోలాహలం. రథాశ్వముల డెక్కల చప్పుళ్ళు వినిపిస్తున్నాయి. యావద్భారతం లోని రాజు లందరూ యుద్ధభూమిలో ఏదో ఒక పక్షాన నిలబడి ఉన్నారు.

ఏ క్షణం కొరకు అర్జునుడు నిరీక్షించాడో ఆ క్షణం రానే వచ్చింది. ఒక దారుణ బీభత్స సన్నివేశానికి తెర లేవబోతోంది. దుర్యోధనుని దుర్మార్గ కృత్యాలతో విసిగి పోయిన పాండవులు ధర్మానికి పట్టాభిషేకం చేసేందుకు కురుక్షేత్రంలో ఆయుధాలతో నిలబడ్డారు.

కృష్ణా! నా రథాన్ని ఉభయ సేనల మధ్య ఉంచు అన్నాడు అర్జునుడు. తాను ఎవరితో యుద్ధం చేయాలో వారిని చూడాలి అంటున్నాడు. ఎక్కడ రథాన్ని ఉంచితే, శత్రుపక్షం లోని వీరుల్ని చూచే అవకాశం ఉంటుందో అక్కడ ఉంచ మంటున్నాడు. శ్రీకృష్ణుణ్ణే ఆజ్ఞాపిస్తున్నా నేమో? అనే సందేహం కూడా అర్జునునిలో ఉదయించ లేదు. యుద్ధ సమయంలో ఉభయ సేనల మధ్య రథాన్ని ఉంచడము ప్రమాదం కాదా? అనే ఆలోచన కూడా పార్థునికి తట్టలేదు. అవన్నీ కృష్ణుడే చూసుకుంటా డనే విశ్వాస మేమో! అచ్యుతా! అని సంబోధించడం లోని ఆంతర్యం అదే నేమో!

*కౌరవుల లోన నిప్పు డెవ్వారి తోడ న*
*నికి గడగుదు నో చూచి కొనగ వలయు*
*నరద మల్లన యుభయ సైన్యముల నడిమి*
*నేల కటు వోవగా నిచ్చి నిలుపు మచట ,*

అని తిక్కన సోమయాజి ఆంధ్రానువాదము.

యోత్స్యమానా నవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః ।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః ॥ 23

*యోత్స్యమానాన్-అవేక్షే-అహం-యే-ఏతే-అత్ర-సమాగతాః*
*ధార్తరాష్ట్రస్య-దుర్బుద్ధేః-యుద్ధే-ప్రియచికీర్షవః*

| | | | |
|---|---|---|---|
| దుర్బుద్ధేః | = దుష్టబుద్ధి యైన | ప్రియ చికీర్షవః | = మేలు చేయదలచిన వారై |
| ధార్తరాష్ట్రస్య | = దుర్యోధనునకు | య ఏతే | = ఏ వీరులు |
| యుద్ధే | = యుద్ధము నందు | అత్ర | = ఇక్కడ |





| | | | |
|---|---|---|---|
| సమాగతాః | = సమావేశ మయ్యారో | అహం | = నేను |
| యోత్స్యమానాన్ | = అలా యుద్ధము చేసే వాళ్ళని | అవేక్షే | = చూస్తాను |

**దుర్యోధనుడిది పాడు బుద్ధి. అతడికి మేలు చేయాలని యుద్ధానికి వచ్చిన వాళ్ళెవరో వాళ్ళను చూస్తాను.**

**వ్యాఖ్య**

దుర్యోధనుడు దుర్బుద్ధి కలవాడు. అతనికి మేలు చేయాలని, ప్రియమును చేకూర్చాలని ఎవరెవరు వచ్చి యున్నారో వాళ్ళను చూస్తాను అంటున్నాడు అర్జునుడు. ఇక్కడ అర్జునుని ఆంతర్యాన్ని కొద్దిగా ఆలోచించాలి. దుష్టుడైన దుర్యోధనుని వైపు ఉన్న వీరులు ఏదో కారణం చేత అతనికి మేలు చేయాలని వచ్చిన వారు ఉంటారే గాని, మాకు కీడు చేయాలి అనే ఆలోచనతో వచ్చి ఉంటారని నేను అనుకోను. యుద్ధాన్ని నివారించే ప్రయత్నం వాళ్ళు కూడా చేసే ఉంటారు. దుర్యోధనుడిది దుష్టబుద్ధి కనుక వాళ్ళు చెప్పినా విని ఉండడు. అందుచేత, వాళ్ళ కున్న ప్రత్యేక కారణాల వల్ల యుద్ధానికి అనివార్యంగా వచ్చి ఉంటారే గాని, మాకు కీడు చేయాలని ఎవ్వరూ భావించరు. మేము ఎవరికి కీడు చేశామని మాకు కీడు తల పెడతారు? భీష్మద్రోణాదులు కూడా దుర్యోధనుని తృప్తి పరచేందుకే వచ్చారు కదా! మేము గాయ పడటాన్ని వాళ్ళు తట్టుకో గలరా? కృష్ణా! అందుకని ఎక్కడ నువ్వు రథాన్ని ఉంచితే నేను అందరినీ చూడ గలనో అక్కడ ఉంచు అన్నాడు అర్జునుడు.

**సంజయ ఉవాచ :**

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయో రుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥ 24

*ఏవమ్-ఉక్తః-హృషీకేశః-గుడాకేశేన-భారత*
*సేనయోః-ఉభయోః-మధ్యే-స్థాపయిత్వా-రథోత్తమమ్*

| | | | |
|---|---|---|---|
| భారత | = ఓ ధృతరాష్ట్రుడా! | ఉభయోః | = రెండు |
| ఏవం | = ఈ విధముగా | సేనయోః | = సైన్యముల |
| గుడాకేశేన | = అర్జునుని చేత | మధ్యే | = నడుమ |
| ఉక్తః | = చెప్పబడిన | రథోత్తమం | = గొప్పది యగు రథమును |
| హృషీకేశః | = శ్రీకృష్ణుడు | స్థాపయిత్వా | = నిలిపి |

**సంజయుడు చెప్పాడు :**

**ధృతరాష్ట్ర మహారాజా! అర్జునుడు అలా చెప్పాడు. అంతే. శ్రీకృష్ణుడు రథాన్ని తీసికెళ్ళి రెండు సేనల నడుమ ఉంచాడు.**

భీష్మద్రోణ ప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతా న్సమవేతాన్ కురూ నితి ॥ 25

*భీష్మద్రోణ ప్రముఖతః-సర్వేషాం-చ-మహీక్షితాం*
*ఉవాచ-పార్థ-పశ్య-ఏతాన్-సమవేతాన్-కురూన్-ఇతి*

భీష్మద్రోణ ప్రముఖతః = భీష్మద్రోణుల ఎదుట
చ = మరియు
సర్వేషాం = సర్వులైన
మహీక్షితాం = రాజుల ఎదుట
పార్థ = ఓ అర్జునా
సమవేతాన్ = సన్నద్ధులైన
ఏతాన్ = ఈ
కురూన్ = కౌరవులను
పశ్య = చూడు
ఇతి = అని
ఉవాచ = పలికెను

**రాజు లందరి ముందు, భీష్ముడికి ద్రోణుడికి ఎదురుగా శ్రీకృష్ణుడు రథాన్ని నిలిపాడు. అర్జునా! యుద్ధానికి నడుం కట్టిన కౌరవుల్ని చూడు! అన్నాడు.**

**వ్యాఖ్య**

గుడాకేశు డైన అర్జునుడు చెప్పినట్లే చేశాడు హృషీకేశుడైన శ్రీకృష్ణుడు. నిద్రను జయించిన వాడు గుడాకేశుడు. ఇంద్రియాలను ప్రేరేపించే వాడు హృషీకేశుడు. అర్జునుడు అవధానంతో ఉన్నాడు. శ్రీకృష్ణుడు ఉద్యమించే స్థాయిలో, పురికొల్పే స్థితిలో ఉన్నాడు.

ప్రస్తుతానికి రథాన్ని తీసుకెళ్ళి అర్జునుడు చెప్పినట్లు ఉభయ సేనల మధ్య ఉంచాడు. రథం లోనే ఉన్నాడు కనుక పాండవ మధ్యముడు కూడా మధ్యకే చేరాడు. అందరి దృష్టి ఆ రథం మీదనే ఉంది. అది ఉత్తమ మైన రథం కదా! *(రథోత్తమమ్).*

అగ్నిదేవుడు ప్రసాదించిన రథం. మంగళకరంగా తెల్లని దేవతాశ్వములు కట్టిన రథం. జండాపై హనుమంతుడు. రథం నడుమ నరుడు. నడిపే చోట నారాయణుడు. ఇక, ఆ రథం యొక్క గొప్పతనాన్ని ప్రత్యేకించి చెప్పే దేముంది? కనిపిస్తూనే ఉంది కదా!

ప్రతి మానవ శరీరము రథమే. ఎవరి మనస్సులో మాధవుడు కొలువై ఉంటాడో అది ఉత్తమ మైన రథము *(రథోత్తమమ్).* మాధవుడు అందరి లోను ఉన్నాడు. కాని మాధవ స్పృహ అందరిలో లేదు. మాధవ స్మరణము అందరి మనస్సులు చేయ లేవు. అలా చేసే మనస్సులను కలిగిన శరీరాలే ఉత్తమ రథాలు.

**పెట్ట మన్నాడు - చిచ్చు పెట్టమన లేదు**

రెండు సేనల నడుమ రథాన్ని పెట్టమన్నాడు అర్జునుడు. అంతే. ఎవరి ముందు పెడితే అర్జునుని బుద్ధి కలత పడుతుందో అక్కడ రథాన్ని పెట్టాడు శ్రీకృష్ణుడు. ఎవరిని చూస్తే కయ్యానికి కాళ్ళు తడబడతాయో, గుండెలు అదురుతాయో వాళ్ళ ఎదురుగా బండిని ఆపాడు. రాజు లందరి ముందు, భీష్మద్రోణులకు ఎదురుగా రథాన్ని నిలిపాడు. అంతటితో ఆగాడా? 'అర్జునా! యుద్ధం చేయడానికి సిద్దంగా ఉన్న కౌరవులను చూడు!' అన్నాడు *( ఉవాచ పార్థ! పశ్యైతాన్ సమవేతాన్ కురూన్ ఇతి ).* మొదటి అధ్యాయంలో శ్రీకృష్ణుడు పలికిన ఒకే ఒక వాక్యం ఇది. అది కూడా శ్రీకృష్ణుడు ఇలా అన్నాడని సంజయుడు చెప్పిన వాక్యం.

**పార్థ! పశ్య**

అర్జునా! సమరాభిలాషు లైన కురుసేనను చూడు అన్నాడు శ్రీకృష్ణుడు. చూడాలనే ఉద్దేశం తోనే అర్జునుడు రెండు సేనల నడుమ రథాన్ని ఉంచ మన్నాడు. అలాగే ఉంచాడు శ్రీకృష్ణుడు. కళ్ళెదుట *(ప్రముఖతః)* కనిపిస్తున్న వారిని, చూడు *(పశ్య)* అని ప్రత్యేకంగా చెప్ప వలసిన అవసరం లేదు. అయినా, శ్రీకృష్ణుడు చెప్పాడు. ఆ సన్నివేశంలో, ఆ పరిస్థితిలో 'చూడు' అనే ఆ చిన్న మాట అనూహ్యమైన రీతుల్లో అర్జునుని అంతఃకరణమును కుదిపేసింది. ఆంతర్యంలో కల్లోలాన్ని రేపింది. వివేకాన్ని కలత పెట్టింది.





విషాదానికి పీట వేసింది. కొండంత గుండెను పిండి చేసింది. ద్వేషాగ్నితో రగిలి పోతున్న మనస్సును మమకారంతో నిర్వీర్యం చేసింది.

**ఎదురు పడగానే ఎద పగిలింది**

భీష్మద్రోణుల ఎదుట రథం ఆగింది. చూడు! అన్నాడు కృష్ణుడు. ఏమి చూడాలి? ఏదో చూశాడు అర్జునుడు. ఏదేదో చూశాడు. ఎదలో దాగిన మమకారా న్నంతా చూశాడు. ఏదో అయ్యాడు. ఎదురాడే శక్తిని కోల్పోయాడు. ఎదురుకొనే పటిమను పడేసు కున్నాడు. ఎదబాధతో ఎదురీద లేక నిశ్చేష్టుడై నిలబడి పోయాడు.

చూడు! అనే ఒక్క మాటే పలికాడు మాధవుడు. ఆ ఒక్క మాటను పట్టుకొని ఏకంగా ఏకేస్తోంది అర్జునుని మనస్సు.

అర్జునా! చూడు! ఎదురుగా ఎవరున్నారో చూడు! భీష్మ తాతయ్య! మీ కురు వంశాభివృద్ధికి ఆయన ఎన్ని త్యాగాలు చేశాడు? ఎన్ని సుఖాలు త్యజించాడు? జీవితంలో ఆయన సుఖపడిం దెప్పుడు? మీ సుఖానికి ఆయన ఆరాట పడని క్షణ మేదో కాస్త ఆలోచించు. పుణ్యాత్ముడు. ధర్మాత్ముడు. వేదవిదుడు. సత్యవ్రతుడు. అసమాన పరాక్రమవంతుడు. ఆయన ఒడి లోనే కదా నువ్వు పెరిగింది! బాల్యంలో నీకు కథలు చెప్పిన తాతయ్య! యౌవ్వనంలో మీ ప్రగతికి బాటలు వేసిన తాతయ్య! ఆ వృద్ధ పితామహుణ్ణి పూజించ వలసిన నీవు, గౌరవించ వలసిన నీవు, ఆయనపై శరవర్షం కురిపించి, ఆ ముసలి ప్రాణం నేల కొరిగితే చూడాలని ఉన్నావా? పార్థ! పశ్య! చూడు! చూడు! బాగా చూడు! ఆయన త్యాగానికి ఇదా ఫలితం? ఆయన ప్రేమకు ఇదేనా నీవు పట్టే నీరాజనం? పార్థ! పశ్య! అర్జునా! చూడు! ఇలాగే చూచి ఉంటుంది అర్జునుని మనస్సు. ఇలాగే చూపి ఉంటుంది పార్థుని హృదయం.

అర్జునా! అటు చూడు! ఆ ప్రక్కనే ఎవ రున్నారో చూడు! ఆచార్యా! అని నీవు ప్రణామం చేసే నీ గురువు ద్రోణాచార్యుడు. తన బిడ్డ అశ్వత్థామ కన్నా నిన్నే ఎక్కువగా ప్రేమించిన వాడు. తన కుమారునికి చెప్పని ధనుర్విద్యా రహస్యాల్ని నీకు చెప్పాడు. నిన్ను సవ్యసాచిగా తీర్చి దిద్దాడు. అర్జునునికి మించిన విలుకాడు మరొకడు ఉండటానికి వీలు లేదని బహిరంగంగా ప్రతిజ్ఞ బూనిన బ్రాహ్మణుడు. నిన్ను మించి పోతాడేమో నని ఏకలవ్యుని బొటనవ్రేలును గురుదక్షిణగా గ్రహించి మాయని మచ్చ తెచ్చు కున్నాడు. అలాంటి ఆచార్యునిపై సుమవర్షాన్ని కురిపించ వలసిన నువ్వు, శరవర్షాన్ని కురిపించి, ఆ మహాత్ముని పవిత్ర దేహం రక్తపు మడుగులో పడి ఉంటే చూడాలని ఉబలాట పడుతున్నావా? పార్థా! పశ్య! అర్జునా! చూడు. చూడు. బాగా చూడు. గురువులకు శిష్యు లిచ్చే గురుదక్షిణ ఇదేనా? గురువు ఋణం తీర్చుకొనే మార్గం ఇదేనా? భావితరాలలో శిష్యు లందరూ నిన్నే ఆదర్శంగా తీసుకుంటే, ఇక ఆ తరువాత గురువుల గతేమిటో ఆలోచించు! పార్థ! పశ్య! అర్జునా! చూడు. ఇలాగే అవలోకించి ఉంటాడు అర్జునుడు. ఇలాగే కలతపడి ఉంటుంది అర్జునుని ఆంతర్యం.

అంతే. తాను దగా పడింది అంతా మరచి పోయాడు మహాత్ముడైన అర్జునుడు. దయతో చలించి పోయాడు. కరుణతో కదలి పోయాడు. తాను చేస్తున్న దేమిటి? అని పునరాలోచన చేశాడు. ఏదో తప్పు చేస్తున్నట్లు తడబడి పోయాడు.

**ఊహల ఊయల**

మరొక కోణం నుండి చూద్దాం! ఒకవేళ రథాన్ని భీష్మద్రోణుల ముందు ఉంచకుండా దుశ్శాసనుని ముందు గాని, దుర్యోధనుని ముందు గాని, శకుని ముందు గాని, (కర్ణుడు యుద్ధభూమిలో లేడు కనుక) నిలిపి ఉంటే ఎలా ఉండేది? ఏమో! ద్రౌపది వస్త్రాపహరణం స్మృతిలో మెదిలి, వెంటనే గాండీవాన్ని చేబూని గడగడ లాడించేవా డేమో గాండీవి.

అంటే, రణరంగంలో భీష్మద్రోణులు ఉన్నపళంగా ఊడి పడ్డారా? వారుభయులు రణభూమిలో ఎదురుగా దర్శన మిస్తారని ధనంజయునికి ముందు తెలియదా? తెలిసే కదా వచ్చాడు? పైగా సవ్యసాచి సామాన్యుడా! పశుపతితో పోరాడిన దిట్ట! అలాంటి వాడు ఇలా ఎందు కయ్యాడు?

అందుకే అంటున్నాను మాధవుని పశ్య గుళిక బాగా పని చేసిందని! కొన్ని సందర్భాలలో మామూలు మాటలే మారణహోమాల్ని సృష్టిస్తాయి. లేదా, మంగళ తోరణాలు కట్టిస్తాయి. కోటలు కట్టేవీ మాటలే. కోటలు కూల్చేవి కూడా మాటలే.

భీష్మద్రోణుల రూపాలు కౌంతేయుని కలత పెట్టాయా? లేక పరంధాముడు పలికిన పశ్య సూత్రం ఫలించిందా? లేక ఈ రెండు దోహదం చేశాయా? కాకపోతే, అర్జును డంతటి మహావీరుడు అలా నీరసించడ మేమిటి? అని ఆలోచించి నపుడు, ఏది ఏమైనా, కనిపించిన రూపాలో, వినిపించిన శబ్దాలో, ఏవైనా గాని, భీష్మద్రోణుల ప్రభావం ఆ క్షణంలో పార్థుని బుద్ధిపై పడింది అని మాత్రం అనిపిస్తోంది. కారణం కూడా కనిపిస్తోంది. భగవద్గీత, రెండవ అధ్యాయం సాంఖ్యయోగం లోని నాల్గవ శ్లోకంలో అర్జునుడు చెప్పిన దానిని విశ్లేషిస్తే, ఆధారానికి సంబంధించిన ద్వారం తెరచు కుంటుంది.

*కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన।*

*ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన॥*

కృష్ణా! భీష్మద్రోణులు పూజింప దగిన వారు. వారిని యుద్ధంలో బాణాలతో ఎదుర్కొని ఎలా పోరాడేది? అన్నాడు అర్జునుడు. ఇది ఊహల ఊయలో, లేక వాస్తవాల పల్లకీయో పట్టింపు లేదు కాని, ఇది మనం పట్టించుకో వలసిన విషయమా, కాదా! అనేదే మీమాంస.

**జగన్నాటకం - జగన్నాథ రథం**

అయితే, ఇదంతా కృష్ణుడు ఆడిన నాటకమా? అర్జునుణ్ణి బలహీన పరచింది కృష్ణుడేనా? కృష్ణుడు ఇదంతా ఎందుకు చేసినట్లు? ఎవరు అడగాలి? ఎవర్ని అడగాలి? పరమేశ్వర లీలల్ని ప్రశ్నించే శక్తి ఎవరి కుంది? సమాధానం చెప్పే సామర్థ్యం మాత్రం ఎవరి కుంది? ఈశ్వర సంకల్పాలు ఈశ్వరునికే ఎరుక.

కురుక్షేత్రంలో శ్రీకృష్ణుడు ఉన్నాడని మనకు తెలుసు. కృష్ణుని హృదయంలో ఏముందో ఎవరికి తెలుసు? కృష్ణుని ముందు అర్జును డున్నాడు. కాని, అనాదిగా అజ్ఞానాంధకారంలో మగ్గుతున్న జీవు లెందరో శ్రీకృష్ణుని మనస్సులో కదిలి ఉంటారు. మహారణ్యంగా గోచరిస్తున్న ఉపనిష ద్వనంలో విహరించలేని సామాన్య జనులకు సైతం ఉపనిషత్సారాన్ని అందించాలని అచ్యుతుడు భావించి ఉంటే, అది మానవాళికి మహాభాగ్యం కాదా! ఆశీర్వాదం కాదా! అనుగ్రహం కాదా! భగవద్గీత మానవాళికి ఎనలేని, కొనలేని ఐశ్వర్యం కాదా!

**సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః**

ఉపనిషత్తు లనే ఆవుల నుండి గీతామృతాన్ని పితికిన గోపాలుడు కురుక్షేత్రాన్ని అక్షయ గోశాలగా ఎన్నుకొని ఉంటే, లోక కళ్యాణానికి ఇంకేమి కావాలి? అదే జరిగిందేమో! అర్జునుణ్ణి నిమిత్తంగా చేసికొని ఉపనిషత్సారాన్ని గీతా పీయూషంగా మానవాళికి అందించాడేమో (*'అర్జున నిమిత్తీ కృత్య' అని శ్రీ శంకర భాష్యము*).

ఇదే వాస్తవ మైతే, కురుక్షేత్రంలో అర్జునుడికి ఎదురైన సమస్య కల్పిత మేనా? అర్జునుని విషాదము కేవలం మానవాళి కొరకు మాధవుడు సృష్టించిందేనా? అర్జునుని సమస్యకు పరిష్కారంగా గీత ఆవిర్భవించింది అంటున్నారు కదా! సమస్యే కల్పిత మైనపుడు, పరిష్కారం సత్యం ఎలా అవుతుంది? భగవద్గీతను అందించాలనే ఉద్దేశాన్ని సఫలం చేసుకోవడానికి అర్జునుని ప్రయత్న పూర్వకంగా కృష్ణుడు కలత పెట్టడం సమంజసమా?





సర్వజ్ఞుడైన పరమేశ్వరునికి గీతను అందించటానికి మరొక మార్గమే లేకపోయిందా? ఇలా ప్రశ్నల వర్షం కురిస్తే ఆశ్చర్యపో నవసరం లేదు.

అర్జునుడిలో ఉత్పన్నమయ్యే మమకార జనిత శోక మోహాలను ముందే గుర్తించి శ్రీకృష్ణుడు రథాన్ని అక్కడ ఉంచాడేమో! అందరి భావాలను గ్రహించి, ప్రేరేపించే శక్తి పరమేశ్వరునికి ఉంది అనే కదా ఆ దివ్యాత్ముని 'హృషీకేశుడు' అని ఈ శ్లోకం లోనే తెలుసుకున్నాం! అంతా ఈశ్వరలీల.

**త త్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్।**
**ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీం స్తథా॥** 26
**శ్వశురా న్సుహృద శ్చైవ సేనయో రుభయో రపి।**

*తత్ర-అపశ్యత్-స్థితాన్-పార్థః-పితౄన్-అథ-పితామహాన్*

*ఆచార్యాన్-మాతులాన్-భ్రాతౄన్-పుత్రాన్-పౌత్రాన్-సఖీన్-తథా*

*శ్వశురాన్-సుహృదః-చ-ఏవ-సేనయోః-ఉభయోః-అపి*

| | | | | | |
|---|---|---|---|---|---|
| అథ | = | తరువాత | భ్రాతౄన్ | = | అన్నదమ్ములను |
| పార్థః | = | అర్జునుడు | పుత్రాన్ | = | కొడుకులను |
| తత్ర | = | అక్కడ | పౌత్రాన్ | = | మనుమలను |
| ఉభయోః సేనయోః | = | రెండు సేనలలో | సఖీన్ | = | మిత్రులను |
| అపి | = | కూడా | తథా | = | అలాగే |
| స్థితాన్ | = | ఉన్నట్టి | శ్వశురాన్ | = | మామలను |
| పితౄన్ | = | తండ్రులను | సుహృదః చ | = | స్నేహితులను |
| పితామహాన్ | = | తాతలను | ఏవ | = | కూడా |
| ఆచార్యాన్ | = | గురువులను | అపశ్యత్ | = | చూశాడు |
| మాతులాన్ | = | మేనమామలను | | | |

**అర్జునుడు సైన్యంలో ఇరువర్గాలను చూశాడు. తండ్రులు, తాతలు, గురువులు, మేనమామలు, అన్నదమ్ములు, కొడుకులు, మనుమళ్ళు, స్నేహితులు, మామలు, మిత్రులు - అందరూ వీళ్ళే కనిపించారు.**

**వ్యాఖ్య**

ఉభయ సేనల మధ్య నిలిచిన రథము నుండి వీక్షించిన అర్జునునికి ఇరుపక్షాల లోని వీరు లందరూ కనిపించారు. కౌరవ సైన్యములో దుర్యోధనాదులకు బంధువు లెవరో వారు తమకు కూడా బంధువులే. తమ సైన్యములో తమకు ఎవరు బంధువులో వారందరూ కౌరవులకు కూడా బంధువులే. ఇక ఎవరికి ఎవరితో యుద్ధము? కుడి చేత్తో ఎడమ చేతిని, ఎడమ చేత్తో కుడి చేతిని మెలిపెడితే ఒరిగే దేముంటుంది?

శత్రువులతో యుద్ధం చేయడం కష్టం కాక పోవచ్చు. ఇక్కడ శత్రువు లెవరు? పరిశీలించి చూస్తే అందరూ తన వాళ్ళే. ఒక్కచోట కలసి భోం చేయవలసిన వాళ్ళు. ఒకరి కష్టాన్ని మరొకరు పంచుకో వలసిన వాళ్ళు. కలసి తినడానికి బదులు కలసి తన్నుకో వలసిన పరిస్థితి వస్తే, వినడానికే రుచించదు. ఇక పాల్గొనే వారికి ఎలా ఉంటుంది?

యుద్ధం చేయాలి అంటే శత్రుభావం ఉండాలి. ద్వేష వృత్తి ప్రకోపించాలి. కాని, ఇక్కడ ఎవరితో శత్రుత్వము? ఎవరిపై ద్వేషము? అందరినీ వీక్షించాడు విజయుడు. రెండు సేనలు రెండు కళ్ళుగా కనిపిస్తున్నాయి. ఏ కన్ను పోయినా తనకే నష్టం. కళ్ళు రెండైనా చూపు ఒకటే అయినట్లు, సేనలు రెండైనా, అర్జునుడికి ఒక్కటి గానే గోచరిస్తున్నాయి.

ఇరుపక్షాల వారిని కలయ చూశాడు. తండ్రులు, తాతలు, గురువులు, మేనమామలు, అన్నదమ్ములు, బిడ్డలు, మనుమళ్ళు, స్నేహితులు, మామలు, మిత్రులు అందరూ వీళ్ళే. వీళ్ళతో పాటు ఏ పాపము ఎరుగని సామాన్య జనులు. అందరినీ చూశాడు.

తా న్సమీక్ష్య స కౌన్తేయః సర్వా న్బన్ధూ నవస్థితాన్ ॥ 27
కృపయా పర యావిష్టో విషీద న్నిద మబ్రవీత్ ।

*తాన్-సమీక్ష్య-సః-కౌంతేయః-సర్వాన్-బంధూన్-అవస్థితాన్*
*కృపయా-పరయా-ఆవిష్టః-విషీదన్-ఇదం-అబ్రవీత్*

| | | | |
|---|---|---|---|
| సః | = ఆ | పరయా | = అత్యంత |
| కౌంతేయః | = అర్జునుడు | కృపయా | = కరుణతో |
| అవస్థితాన్ | = సన్నద్ధులై యున్న | ఆవిష్టః | = కూడుకొని |
| తాన్ | = ఆ | విషీదన్ | = బాధ పడుతూ |
| సర్వాన్ | = సమస్తమైన | ఇదం | = ఈ విధముగా |
| బంధూన్ | = బంధువులను | అబ్రవీత్ | = అన్నాడు |
| సమీక్ష్య | = బాగా చూచి | | |

**యుద్ధానికి సిద్ధంగా ఉన్న బంధువు లందరినీ చూశాడు అర్జునుడు. అపార మైన కరుణతో చలించి పోయాడు. బాధ పడుతూ చెబుతున్నాడు.**

### వ్యాఖ్య

మనస్సు చాలా విచిత్ర మైంది. విడ్డూర మైంది. కౌరవులను మట్టుపెట్టే సమయం ఎప్పుడు వస్తుందా అని ఇంతకాలం అర్జునుడు నిరీక్షించాడు. అలాంటి అవకాశం దానంతటదే నడచి వచ్చి ముందు నిలబడిన క్షణాన, అర్జునుడు అపార కృపతో నీరసించి పోతున్నాడు. ఒకప్పుడు తాను ఆశించిందే. కాని, దానిని అందుకొనే స్థితిలో ఇప్పుడు లేడు.

బంధువు లందరినీ చూశాడు. మమకార పాశంతో బందీ అయ్యాడు. కృపా పరవశు డయ్యాడు. వీళ్ళను ఎలా వధించాలి? అని తనను తాను ప్రశ్నించు కున్నాడు. ఎంత ప్రశ్నించుకున్నా సమాధానం చిక్కలేదు. దొరక లేదు.

సంధి ప్రయత్నా లన్నీ విఫల మయ్యాయి. దుర్యోధనుని దురాగతాలు శ్రుతి మించాయి. క్రూరాత్ము లైన కౌరవులను ఇక విస్మరించ కూడదు. వీళ్ళను చంప వలసిందే అనే దృఢ నిశ్చయంతో యుద్ధానికి వచ్చిన అర్జునుడు, వీళ్ళనా నేను చంప వలసింది? అని ఇప్పుడు, ఇక్కడ తనలో తాను కుమిలి పోతున్నాడు. మమకారం వల్ల ఏర్పడిన కృపా పారవశ్యంతో చలించి పోతున్నాడు. ఇది మామూలు విషయం కాదు. సాధారణ సమస్య కాదు.





అర్జునుడు సాదాసీదా వ్యక్తి కాడు. తొందరపడి ఏ పనీ చేసే వాడు కాడు. వివేకంతో, విచక్షణతో జీవించేవాడు. విశ్లేషించుకుంటూ కార్యాచరణలో నిమగ్న మయ్యేవాడు. అందుకనే, యుద్ధానికి ముందే ఉభయ సేనల మధ్య రథాన్ని ఉంచ మన్నాడు. తాను చంప వలసిన వాళ్ళందరూ తన వారే. తన వాళ్ళతో కలసి శత్రువులను చంపడం వేరు. తన వాళ్ళనే శత్రువులుగా భావించి చంపడం వేరు.

కౌరవుల వల్ల అష్టకష్టాలు అనుభవించి ధర్మబద్ధంగా యుద్ధరంగంలో కాలు పెట్టిన అర్జునుడు, యుద్ధం ప్రారంభమయ్యే సంక్లిష్ట సమయంలో ఇలా నీరసించడ మేమిటి? అనేది సామాన్యమైన ప్రశ్న. దారుణమైన బాధల్ని అనుభవించి, కౌరవుల క్రూర కృత్యాలకు బలై కూడా, యుద్ధానికి విముఖంగా ఉన్నాడంటే, హేతువు ఏమై ఉంటుంది? ఆ హేతువు ఎంత బలీయ మైనది కాకపోతే గీత ఆవిర్భవిస్తుంది? అనేవి సామాన్యమైన ప్రశ్నలు కావు. విశేషమైన విశ్లేషణలు.

**అర్జున ఉవాచ :**

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ॥ 28
సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥ 29

*దృష్ట్వా-ఇమం-స్వజనం-కృష్ణ-యుయుత్సుం-సముపస్థితం*
*సీదంతి-మమ-గాత్రాణి-ముఖం-చ-పరిశుష్యతి*
*వేపథుః-చ-శరీరే-మే-రోమహర్షః-చ-జాయతే*

| | | | |
|---|---|---|---|
| కృష్ణ | = ఓ కృష్ణా! | సీదంతి | = శిథిల మౌతున్నాయి |
| యుయుత్సుం | = యుద్ధము చేయగోరి | ముఖం చ | = నోరు కూడా |
| సముపస్థితం | = చేరి యున్న | పరిశుష్యతి | = ఎండిపోతూ ఉంది |
| ఇమం | = ఈ | మే | = నా యొక్క |
| స్వజనం | = బంధుజనమును | శరీరే | = దేహము నందు |
| దృష్ట్వా | = చూచి | వేపథుః చ | = వణుకు కూడా |
| మమ | = నా యొక్క | రోమహర్షః చ | = గగుర్పాటు కూడా |
| గాత్రాణి | = అవయవములు | జాయతే | = కలుగుతూ ఉంది. |

**అర్జునుడు అంటున్నాడు :**

**కృష్ణా! యుద్ధం చేయాలని వచ్చిన నా బంధువుల్ని చూశాను. నా అవయవాలు పట్టు తప్పుతున్నాయి. నోరు ఎండిపోతోంది. దేహంలో దడ పుడుతోంది. గగుర్పాటు కలుగుతోంది.**

### వ్యాఖ్య

ఉభయ సేనల మధ్య రథాన్ని నిలిపి, కళ్ళెమును లాగి పట్టుకొని, 'పార్థా! చూడు' అని ఇరవై ఐదవ శ్లోకంలో పలికిన పార్థసారథి, తాను కూడా కౌరవసైన్యాన్ని చూస్తూనే ఉన్నాడు. అర్జునుడు కృష్ణా! అని పిలిచి, తన దీన స్థితిని ఈ శ్లోకంలో వివరించ డానికి ప్రారంభించాడు. ఆ సంబోధనతో శ్రీకృష్ణుడు తన ఎడమ భుజముపై నుండి తలను తిప్పి అర్జునుని తదేకంగా చూశాడు. ఒక చేతితో కళ్ళెమును అందముగా లాగి

పట్టుకొని, రెండవ చేతిలో మునికోలను ధరించి, అర్జునుడు చెప్పే విషయాన్ని వెనుదిరిగి అవధానంతో ఆలకించే పార్థసారథి అద్భుత దృశ్యం ఈ సందర్భము లోనిదే. తేరులో ఈ తీరు లోనే ఉండి ఆలకిస్తున్న శ్రీకృష్ణుడు, తాను గీతను బోధించే సమయంలో దేహ స్థితిని మార్చి, అర్జునుని సూటిగా చూస్తూ పలుకుతాడు. అంతవరకు అలాగే వెను దిరిగి పార్థుని పలుకుల్ని ఓర్పుతో వింటూ ఉంటాడు.

కృష్ణా! అంతా చూశాను. అందరినీ చూశాను. వీళ్ళల్లో సుజను లున్నారు. కుజను లున్నారు. కాని, అందరూ స్వజనులే. నా వాళ్ళే. అటు వైపు నుండి నా వాళ్ళు వేసే బాణాలు ఇటు నా వాళ్ళకే తగుల్తాయి. ఇటు వైపు నుండి మేము ప్రయోగించే అస్త్రశస్త్రాలు అటు నా వాళ్ళకే తగుల్తాయి. నా వాళ్ళను నా వాళ్ళే చంపాలి. చచ్చే నా వాళ్ళు చంపే నా వాళ్ళ చేతి లోనే చావాలి. ఈ పరిస్థితిని నేను తట్టుకోలేక పోతున్నాను. దుర్భర దుఃఖంతో నలిగి పోతున్నాను.

ఈ దారుణ పరిస్థితిని చూచి నా అవయవాలు ముక్క లౌతున్నాయి. నోటిలో తడి ఆరి పోతోంది. శరీరం వణకుతోంది. రోమాంచ మవుతోంది.

మమకారం కొట్టిన దెబ్బకు అర్జునుని మనస్సు విలవిల లాడింది. మనస్సు పట్టు తప్పగానే, దేహం పట్టును కోల్పోయింది.

శత్రువుల దేహాంగాలను విడగొట్ట వలసిన వాడు నా అవయవాలు ముక్క లౌతున్నాయి అంటున్నాడు. ఎందుకు అలా అయ్యాయి? ఎవరు వాటిని అలా శిథిలం చేసింది? మమకారం వల్లే అంగాలు ముక్క లయ్యాయి. అహంకారమే అలా మమకారాన్ని వాటేసుకొని అంగాలను శిథిలం చేసింది.

ముక్కలైన అవయవాలు ఏ పని చేస్తాయి? ఏ పనీ చేయలేని అంగాలు సంగ్రామానికి పనికొస్తాయా? కాళ్ళు కదలడం లేదట. చేతులు చలనాన్ని కోల్పోయాయట.

నోటిలో తడి ఆరి పోయిందట *(ముఖం చ పరిశుష్యతి).* శుష్యతి అంటే ఆరిపోవడం. కాని, ఇక్కడ పరిశుష్యతి *(పరితః శుష్యతి)* అంటున్నాడు పార్థుడు. అంటే తడి ఏ మాత్రం లేకుండా నోరు ఎండి పోయింది అంటున్నాడు. దీనిని బట్టి అర్జునుని విషాదము ఏ స్థాయికి చేరుకుందో మనం ఊహించు కోవచ్చు.

ఎక్కువ దూరం నడిస్తే, దాహం వేసి నోరు ఎండి పోవచ్చు. అధికంగా వ్యాయామం చేస్తే నోటిలో తడి ఆరి పోవచ్చు. ఏ శ్రమ లేకపోయినా, కేవలం రథంలో ఆసీనమై ఉన్నా, నోటిలో తడి ఆరి పోయింది అంటే, అర్జునునిలో దుఃఖాగ్ని ఎలా రగులుతోందో ఆలోచిస్తే ఎవరి కైనా అర్థ మవుతుంది.

ఈ విపత్కర పరిస్థితిని ఎదుర్కోలేక శరీరం వణకుతోంది. గగుర్పాటు చెందుతోంది అంటూ, ఇంకా తన శారీరక లక్షణాలు, చిహ్నాలు ఎలా ఉన్నాయో వివరిస్తున్నాడు విజయుడు.

**గాణ్డీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే ।**

**న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥** 30

*గాండీవం-స్రంసతే-హస్తాత్-త్వక్-చ-ఏవ-పరిదహ్యతే*

*న-చ-శక్నోమి-అవస్థాతుం-భ్రమతి-ఇవ-చ-మే-మనః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| హస్తాత్ | = | చేతి నుండి | త్వక్ చ ఏవ | = | చర్మము కూడా |
| గాండీవం | = | గాండీవము | పరిదహ్యతే | = | మండిపోతూ ఉంది |
| స్రంసతే | = | జారిపోతూ ఉంది | అవస్థాతుం చ | = | నిలుచుటకు కూడా |





| | | | | | |
|---|---|---|---|---|---|
| న శక్నోమి | = | శక్తి లేకుండా ఉన్నాను | మనః | = | మనస్సు |
| మే | = | నా యొక్క | భ్రమతీవ | = | భ్రమించి నట్లుంది |

**గాండీవము చేతి నుండి జారి పోతోంది. చర్మం కాలి పోతోంది. నిలబడలేక పోతున్నాను. నా తల తిరుగుతోంది.**

## వ్యాఖ్య

గాండీవము అర్జునుని ధనుస్సు. తనకు ఎంతో ప్రియమైనది. కాని, అది కూడా చేతి నుండి జారిపోతూ ఉంది అంటున్నాడు అర్జునుడు. అంటే, తాను ప్రయత్నంతో పడేయడం లేదు. దానంతట అదే జారిపోతూ ఉంది అంటున్నాడు. అంటే సమరవాంఛ దానంతట అదే ఆవిరై పోతూ ఉంది అని అర్థం.

చర్మం కాలి పోతోందట. అంటే, దేహంలో మంట లెత్తుతున్నాయి. అందుకే చర్మము కాలి పోతోంది. మనసు మరిగి పోతోంది కనుకనే దేహములో మంటలు పుట్టు కొస్తున్నాయి. మమకారం దేహ మనస్సులను ఒకేసారి భయంకరంగా కాల్చేస్తూ ఉంటే ఆరాటపడి పోతున్నాడు అర్జునుడు.

ఈ దశలో అర్జునుడు రథంలో కూర్చొని ఉన్నాడు. యుద్ధం చేయాలి అంటే లేచి నిలబడాలి. లేచే పరిస్థితిలో లేడు. ఆ మాత్రం శక్తి కూడా లేదంటున్నాడు. నిజమేనా? అయితే ఎందుకిలా అయింది? ఉభయ సేనల మధ్య రథాన్ని ఉంచమని చెప్పి కొన్ని నిముషాలు మాత్రమే అయింది. ఈ లోగా లేవలేని విధంగా శక్తిహీను డెలా అయ్యాడు?

ప్రాణతుల్య మైన తమ వారు ప్రాణాపాయ స్థితిలో చికిత్స పొందుతూ ఉన్న సమయంలో, వైద్యుడు రోగి గది నుండి బయటికి రాగానే, డాక్టరు గారు! ఎలా ఉంది? అని పరుగెత్తుకుంటూ వెళ్ళి అడుగుతారు. చెప్పలేము. ఏదైనా, ఏ క్షణమైనా జరగవచ్చు అని వైద్యుడు చెప్పగానే, ఆ అడిగిన వ్యక్తి అక్కడే కుప్పకూలి పోవడం మనం చూస్తేనే ఉంటాం. క్షణం క్రితం పరుగెత్తుతూ వచ్చి, వార్త వినగానే అశక్తుడై పడిపోవడం జరుగుతూ ఉంది. మనస్సు అశక్త మైనపుడు దేహం కూడా శక్తిహీన మవుతుంది. అందుకనే, తల తిరుగుతోంది *(భ్రమతీవ చ మే మనః)* అంటున్నాడు అర్జునుడు.

**నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।**

**న చ శ్రేయోఽను పశ్యామి హత్వా స్వజన మాహవే ॥** 31

*నిమిత్తాని-చ-పశ్యామి-విపరీతాని-కేశవ*

*న-చ-శ్రేయః-అనుపశ్యామి-హత్వా-స్వజనం-ఆహవే*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కేశవ | = | ఓ కేశవా! | స్వజనం | = | బంధువులను |
| చ | = | ఇంకను | హత్వా | = | వధించి |
| విపరీతాని | = | విపరీతము లైన | అను | = | ఆ తర్వాత |
| నిమిత్తాని | = | శకునములను | శ్రేయః చ | = | శ్రేయమును |
| పశ్యామి | = | చూస్తున్నాను | న పశ్యామి | = | చూడలేక పోతున్నాను |
| ఆహవే | = | యుద్ధము నందు | | | |

**కేశవా! అపశకునాలు కనిపిస్తున్నాయి. యుద్ధంలో బంధువు లందరినీ చంపుకొని, నేను బావుకొనే దేమిటో ఊహించలేక పోతున్నాను.**

### వ్యాఖ్య

**శకునాలు - నిమిత్తాలు**

అపశకునాలు అగుపిస్తున్నాయి అంటున్నాడు అర్జునుడు. అపశకునాలు అనర్థ సూచకాలు. పక్షుల ద్వారా తెలిసేవి శకునాలు. అవి శుభములే. ఒకవేళ అశుభ మైతే దుశ్శకునాలు అనాలి. పక్షి కూస్తే శకునం. కాకి అరిస్తే శకునం. అసలు శకునం అంటేనే పక్షి అని అర్థము. ఆంధ్రంలో శకునము. సంస్కృతంలో **శకునః**

**శకున్తిః శకునిః శకున్తః శకునః ద్విజః (పక్షీ)**

అని అమరకోశము. నక్క అరిస్తే, కుక్క ఏడిస్తే అది శకునం కాదు. ఎందుకంటే, కుక్కలు, నక్కలు పక్షులు కావు కనుక. మరి, అప్పుడు దాని నేమనాలి? నిమిత్తం అనాలి. ఏదో ఆపద సూచితమే నిమిత్తం. విపరీతము లైన నిమిత్తాలను నేను చూస్తున్నాను అంటున్నాడు అర్జునుడు. విపరీతా లంటే అనర్థ సూచకాలు.

**స్వపక్షమా? ప్రతిపక్షమా?**

అర్జునుడి లాంటి వీరుడు చివరికి శకున శాస్త్రము నీడలో రక్షణ పొందాలని యత్నిస్తున్నాడు. విపరీత మైన నిమిత్తాలు, దుశ్శకునాలు కనిపిస్తున్నాయి అంటున్నాడు. అవి బాహ్యంలో కనిపించే రూపాలు, శబ్దాలు కావచ్చు. లేదా, తన శరీరము లోనే కంపించే అవయవాలు కావచ్చు.

బాగానే ఉంది. మరి, ఈ శకునాలు, నిమిత్తాలు ఎవరికి వర్తిస్తాయి? స్వపక్షం వారికా? లేక, ప్రతిపక్షం వారికా? ఎందుకంటే, ఈ శకునాలు, నిమిత్తాలు ఉభయులకూ కనిపిస్తున్నాయి కనుక.

**ఎటైనా పోటే**

ఎవరి కైతే ఏముంది? ఏ చెంపను వాయించినా కన్నీళ్ళే కదా వస్తాయి! ఎవరికి చెడు జరిగినా ఇరువురికీ అశుభమే. ఇరువురూ స్వజనులే. యుద్ధములో స్వజనులను చంపుట వలన *(హత్వా స్వజన మాహవే)* నాకు జరిగే మేలేమిటో గోచరించడం లేదు *(న చ శ్రేయోஉ ను పశ్యామి)*. ఎటు చూచినా ఈ యుద్ధము అనర్థ దాయకం గానే కనిపిస్తూ ఉంది. అంతా శూన్య ప్రయోజనం. బ్రతుకుకు అర్థ మేమిటో బోధ పడటం లేదు అని ఆవేదన చెందుతున్నాడు అర్జునుడు.

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవిన్ద కిం భోగై ర్జీవితేన వా ॥ 32

*న-కాంక్షే-విజయం-కృష్ణ-న-చ-రాజ్యం-సుఖాని-చ*
*కిం-నః-రాజ్యేన-గోవింద-కిం-భోగైః-జీవితేన-వా*

| | | | |
|---|---|---|---|
| కృష్ణ | = హే కృష్ణా! | గోవింద | = హే గోవిందా! |
| విజయం | = విజయమును | నః | = మాకు |
| కాంక్షే | = కోరుట | రాజ్యేన | = రాజ్యముతో |
| న | = లేదు | కిం | = ఏమి లాభము? |
| రాజ్యం చ | = రాజ్యమును | భోగైః | = భోగముల చేత గాని |
| సుఖాని చ | = సుఖములను | జీవితేన వా | = బ్రతుకుట చేత గాని |
| న | = లేదు | కిం | = ఏమి లాభము? |





**కృష్ణా! నేను విజయాన్ని కోరుకోవడం లేదు. రాజ్యాన్ని ఆశించడం లేదు. సుఖాలకు ఆరట పడటం లేదు. హే గోవిందా! రాజ్యము వల్ల గాని, భోగాల వల్ల గాని మాకు ఒరిగే దేముంది? బ్రతుకే నిరర్థక మనిపిస్తోంది.**

### వ్యాఖ్య

యుద్ధం చేయడం వలన తనకు శ్రేయస్సు కలగదు అంటున్నాడు అర్జునుడు. అంటే, తనకు శ్రేయస్సు కావాలి. అది యుద్ధం చేయడం వల్ల లభించే అవకాశము లేదు అనే అభిప్రాయం అర్జునునికి ఉంది.

**విజయ మెందుకు?**

యుద్ధం చేస్తే మాకు ఒరిగే దేమిటి? అనేది ప్రశ్న. అంటే, విజయాన్ని సాధించడం ప్రయోజనం కాదా? అలాగైతే, ఇప్పటి వరకు యుద్ధాలు చేసి విజయాల్ని సాధించిన వారు ఎందుకు చేసినట్లు? యుద్ధాలలో విజయాలు సాధించక పోతే రాజ్యా లెలా ప్రాప్తించినట్లు?

పైగా, నీ పేరు విజయుడు కదా! విజయాన్ని సాధించే వాడివి కాబట్టే కదా, నీకు విజయుడు అనే పేరు వచ్చింది? మరి ఇలా యుద్ధానికి విముఖుడవై, విజయాన్ని చేజార్చుకుంటే, విజయుడు అనే పేరు పోదా?

కృష్ణా! పోతే పోనీ. పేరు ప్రఖ్యాతులే శ్రేయస్సు అని నాకు అనిపించడం లేదు. నేను విజయాన్ని కోరుకోవడం లేదు *(న కాంక్షే విజయం)*. విజయం సాధిస్తేనే రాజ్యం వస్తుంది అనేదే ప్రధాన విషయ మైతే, నాకు రాజ్యం కూడా అవసరం లేదు *(న కాంక్షే రాజ్యం)*.

**రాజ్య మెందుకు?**

కృష్ణా! రాజ్యాన్ని పొంది సాధించే ప్రయోజన మేమిటో కూడా నాకు తెలియడం లేదు. ***కారే రాజులు రాజ్యముల్ గలుగవే... వారేరి?*** రాజ్యము దుర్యోధనుడికి ఉంది కదా! మరి అతడు సుఖంగా ఉన్నాడా? కనుక, నేను రాజ్యాన్ని కోరుకోవడం లేదు అంటున్నాడు అర్జునుడు. మరి, అదే నిజమైతే, యుద్ధభూమికి ఎందుకు వచ్చినట్లు? రథం నడుప మని కృష్ణుని ఎందుకు అడిగినట్లు? నిజమే! యుద్ధం చేయాలనే కిరీటి కదన రంగంలో కాలు మోపాడు. కాని, యుద్ధభూమిలో బంధు జనాన్ని చూసిన తరువాత, సమరవాంఛ సన్నగిల్లింది. యుద్ధ విముఖత బుద్ధిలో జనించింది. మరి, రాజ్యం లేకపోతే, రాజ్యసుఖాలు ఎలా ప్రాప్తిస్తాయి? రాజ్యసుఖాలు కూడా అవసరం లేదు అంటున్నాడు *(సుఖాని న కాంక్షే)*.

**సుఖా లెందుకు?**

సుఖాల వల్ల ఏమి ప్రయోజనం? సుఖాలు మానవులకు తెలియనివి కావు. సాగర మంత దుఃఖాన్ని అనుభవించింది వాస్తవమే అయినా, కొద్దో గొప్పో కూప తటాకాది స్థాయిలో సుఖాలు కూడా మానవుల అనుభవంలో ఉన్నాయి. ఇంత వరకు అనుభవించిన సుఖాల వల్ల సాధించింది ఏముంది? అలాంటప్పుడు ఇక మున్ముందు కలిగే సుఖాల వల్ల మాత్రం ఒరిగేది ఏముంటుంది? మతాబుల కాంతి లాంటి సుఖాలు మనుగడకు వన్నె తెస్తాయా? మనిషికి తృప్తి నిస్తాయా?

రాజ్యాలు పొందినా, భోగాలలో రమించినా, వాటి వల్ల కలిగే ప్రయోజనము శ్రేయోదాయకమా? కానప్పుడు, ఈ రాజ్యా లెందుకు? విజయా లెందుకు? యుద్ధా లెందుకు? సరే, అదంతా బాగానే ఉంది అర్జునా! కాని, యుద్ధము చేయనంత మాత్రాన శ్రేయస్సు కలుగుతుందా? శ్రేయస్సు మాట దేవు డెరుగు. అసలు జీవనము సాగుతుందా?

జీవించడానికి ఇల్లు కావాలి. ధనం కావాలి. ఇవన్నీ ఎలా వస్తాయి? అర్జునుడు యుద్ధాన్ని విరమించాడు

కనుక, అతని కష్టసుఖాలు మేమే చూసుకుంటా మని దుర్యోధనుడు ముందుకు వస్తాడా? ఇంతెందుకు? అసలు రాజ్యంలో ఉండ నిస్తాడా? ఈ వేధింపుల మధ్య బ్రతికే దెలా? అదంతా ఏమో. అసలు బ్రతకడ మెందుకు? బ్రతికి ఏమి సాధించాలి? *(జీవితేన వా కిం?)* అంటున్నాడు అర్జునుడు.

**బ్రతికి ఏమి సాధించాలి?**

ఎందుకు జీవించాలి? జన్మించాము కనుక జీవించాలా? లేక, మరణం రాలేదు కనుక బ్రతకాలా? బ్రతికి సాధించే దేమిటి? ఎన్ని సాధించినా, ఒకనాడు మృత్యువు బాధించక తప్పదు *(మరణాంతం జీవితం)*. ఇలాంటి బ్రతుకు కోసం ఎంత మంది బ్రతుకుల్ని బలి తీసుకోవాలి? బ్రతుకు ఏమిటో, దేని కొరకో స్పష్టంగా అర్థం కాకపోవడం చేత బ్రతుకు మీదే విజయునికి విరక్తి పుట్టింది.

**భావము నీదే - భారమూ నీదే**

ఈ శ్లోకంలో పరమేశ్వరుని కృష్ణా! గోవిందా! అనే రెండు పవిత్ర నామాలతో సంబోధించాడు అర్జునుడు. తనకు ఏమి కావాలో నిర్ణయించుకో లేని స్థితిలో అర్జునుడు ఉన్నాడు. గోల పెట్టే మనసును గోప్యంగా ఉంచుకో లేక గోవిందా! అంటూ మొర పెట్టు కుంటున్నాడు.

**గారేషా తు యతో వాణీ తాం చ విన్దయతే గోవిందః**

'గో' అంటే వాక్కు. 'విందయతే' అంటే ఇవ్వడ మని అర్థము. వాక్కును అనుగ్రహించే వాడు, లేదా ప్రసాదించే వాడు కనుక శ్రీకృష్ణుడు 'గోవింద' శబ్దవాచ్యు డయ్యాడు.

కృష్ణా! మాట లైతే నా నుండి దొర్లుతున్నాయి. వాటి లోని మర్మ మేమిటో నాకు బోధ పడటం లేదు. మాటల్ని కదిలించే వాడివి నీవు. అవి ఎందుకు కదుల్తున్నాయో నీకే తెలుసు. గోవిందా! భావము నీదే. భావము తెలిసిన వాడివి కనుక, నా బాధను తొలగించే భారము కూడా నీదే.

మానవుని ఆలోచనలు సహజంగా బాహ్య ప్రపంచానికి సంబంధించే ఉంటాయి. మానవుడు ఆచరించే కర్మ లన్నీ బాహ్యం లోనే సాగుతుంటాయి. కాని, వాటికి కారణమైన భావాలు ఆంతర్యంలో మెదులుతూ ఉంటాయి. అంతర్యామిని ఆశ్రయించుకొని బాహ్యానికి కదులుతూ ఉంటాయి. ఇలా ఆంతర్యాన్ని ప్రేరేపించే గోవిందుని వైభవము బాహ్యంలో కూడా విరాజిల్లితే బ్రతుకు భగవన్మయ మవుతుంది. అందుకే నేమో, తాళ్ళపాక అన్నమయ్య ఆ దిశలో మనస్సుకు మార్గ నిర్దేశం చేశాడు.

*భావము లోనా బాహ్యము నందును*
*గోవింద గోవింద యని కొలువవో మనసా ॥ ॥ భావము ॥*

తన సమస్యను గోవిందుని ముందు పెడుతూ, తన మనసును గోవిందుని చేతికి అందిస్తూ, తాను వాంఛించే శ్రేయస్సును ప్రసాదించ మని గోవిందుని ప్రార్థిస్తున్నాడు పార్థుడు. ఆ భారము నీదే నంటూ గోవిందుని 'కృష్ణా' అని సంబోధించాడు.

**సచ్చిదానందాత్మకః కృష్ణ వర్ణాత్మక త్వా ద్వా కృష్ణః**

సచ్చిదానంద స్వరూపుడు కనుక భగవంతుడు 'కృష్ణ' శబ్ద వాచ్యు డయ్యాడు. కనుక, భావము నెరిగిన గోవిందా! నాకు నిత్యానందాన్ని (శ్రేయస్సు) ప్రసాదించే భారము కూడా నీదే నంటూ 'కృష్ణా' అని సంబోధించాడు అర్జునుడు.

అర్జునా! నీకు రాజ్యము అవసరం లేక పోవచ్చు. కాని, యుద్ధంలో నీవు ఒక్కడి వేనా ఉండేది? నీ వాళ్ళు లేరా? మనకు ఇష్టం లేకపోయినా, మన వాళ్ళ కోసం కొన్ని పనులు చేయాలి కదా! అలాగే, నీకు రాజ్యము





అవసరం లేకపోయినా, యుద్ధము ఇష్టం లేకపోయినా, నీ వాళ్ళ కోసమైనా చేయవచ్చు కదా! ఈ ప్రశ్నకు సమాధానమే తరువాత శ్లోకంలో అర్జునుని ఆవేదన.

**యేషా మర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ ।**
**త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ ॥ 33**

*యేషాం-అర్థే-కాంక్షితం-నః-రాజ్యం-భోగాః-సుఖాని-చ*
*తే-ఇమే-అవస్థితాః-యుద్ధే-ప్రాణాన్-త్యక్త్వా-ధనాని-చ*

| | | | |
|---|---|---|---|
| యేషాం అర్థే | = ఎవరి కొరకు | త ఇమే | = అట్టి వీరందరు |
| నః | = మనకు | యుద్ధే | = యుద్ధము నందు |
| రాజ్యం | = రాజ్యము | ప్రాణాన్ | = ప్రాణములను |
| భోగాః | = భోగములు | ధనాని చ | = ధనమును |
| సుఖాని చ | = సౌఖ్యములు | త్యక్త్వా | = విడిచి |
| కాంక్షితం | = కోరబడినవో | అవస్థితాః | = నిలబడి యున్నారు |

**కృష్ణా! రాజ్యాన్ని, రాజ్య భోగాల్ని, రాజ్య సుఖాల్ని మనం ఎవరి కొరకు ఆశించామో, వాళ్ళే యుద్ధంలో నిలబడి ఉన్నారు. సంపదల్ని వదిలేసు కున్నారు. ప్రాణాల్ని కూడా లెక్క చేయకుండా నిలిచి ఉన్నారు.**

**వ్యాఖ్య**

లోకంలో ఎవరు ఏది సంపాదించినా - సుఖాలైనా, భోగాలైనా తన వారితో కలసి అనుభవించడం కొరకే. ప్రస్తుతం యుద్ధం చేసి రాజ్యాన్ని సాధించడం కూడా తన వాళ్ళ కొరకే అనేది అర్జునుని ఆలోచన. అదే వాస్తవ మైతే, తాను, తన వాళ్ళు మాత్రమే కలసి యుద్ధంలో పోరాడాలి. అలా కాకుండా, ఏడు అక్షౌహిణుల సైన్యం తన పక్షాన ఎందుకు వచ్చి నిలిచిందో అర్జునుడు ఆలోచించలేక పోతున్నాడు.

రాజ్యం తన వారి కొరకే అయితే, రాజ్యం కొరకు యుద్ధం చేయడం అనివార్య మైతే, ఈ యుద్ధం అనర్థ మని అర్జునుని అభిప్రాయం. నా వాళ్ళ కొరకు యుద్ధం చేయాలి. ఎవరితో చేయాలి? నా వాళ్ళ తోనే చెయ్యాలి. ఎవరి కొరకు *(ఏషా మర్థే కాంక్షితం)* యుద్ధం చెయ్యాలో, వారే వచ్చి యుద్ధంలో నిలబడి ఉన్నారు.

పైగా ప్రాణాలపై ఆశను వదలుకొని *(ప్రాణాన్ త్యక్త్వా)* యుద్ధానికి సిద్ధంగా ఉన్నారు. యుద్ధం జరిగితే, వారి ప్రాణాలు మిగలవు. రాజ్యం మిగుల్తుంది. ఏమి చేసుకోవాలి ఆ రాజ్యాన్ని? ఎవరితో కలసి రాజ్య సుఖాలు అనుభవించాలి?

యుద్ధభూమిలో ఉన్న నా వాళ్ళు వీరులు. అంతేకాదు. రాజ్యాలున్న వాళ్ళు. భాగ్యాలున్న వాళ్ళు. ధనమున్న వాళ్ళు. అయినా ధనంపై వారి కున్న ఆశను త్యజించారు. ధనాన్ని విడిచిపెట్టి *(ధనాని త్యక్త్వా)* తగాదాకు వచ్చారు. ఇప్పుడు తాను యుద్ధం చేసి ధనాన్ని సంపాదించి బావుకొనే దేముంటుంది? రాజ్యభోగాలు వీరి తోనే కదా కలసి అనుభవించాలి? వాటిని త్యజించే కదా వాళ్ళందరూ రణభూమిలో ఉన్నారు? ఇక రాజ్య మెందుకు? భోగా లెందుకు? రాజ్య భోగాల కొరకు రణ మెందుకు? సరే. ఇంతకీ ఆ తన వాళ్ళు ఎవరో చెబుతున్నాడు, చూద్దాం.

**ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః ।**
**మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాః సమ్బన్ధిన స్తథా ॥ 34**

**ఆచార్యాః-పితరః-పుత్రాః-తథా-ఏవ-చ-పితామహాః**
**మాతులాః-శ్వశురాః-పౌత్రాః-శ్యాలాః-సంబంధినః-తథా**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆచార్యాః | = | గురువులు | శ్వశురాః | = | మామలు |
| పితరః | = | తండ్రులు | పౌత్రాః | = | మనుమలు |
| పుత్రాః | = | కుమారులు | శ్యాలాః | = | బావలు |
| తథా ఏవ చ | = | అలాగు ననే | తథా | = | అట్లే |
| పితామహాః | = | తాతలు | సంబంధినః | = | చుట్టాలు |
| మాతులాః | = | మేనమామలు | | | |

**వాళ్ళెవరంటే - గురువులు, తండ్రులు, కొడుకులు, తాతలు, మేనమామలు, మామలు, మనుమళ్ళు, బావలు - ఒక్క మాటలో చెప్పాలంటే చుట్టా లందరూ.**

వ్యాఖ్య

తాను యుద్ధం చేసేది ఎవరి కొరకని అర్జునుడు భావిస్తున్నాడో, ఎవరు చనిపోతే, రాజ్యం లభించినా సుఖం ఉండదని చింతిస్తున్నాడో వాళ్ళను గూర్చి చెబుతున్నాడు.

ద్రోణుడు, కృపుడు మొదలైన గురువులు, సోమదత్తి మొదలైన తండ్రులు, లక్ష్మణ అభిమన్యాది కుమారులు, భీష్ముడు, సోమదత్తుడు మొదలైన తాతలు, శైబ్యుడు, ద్రుపదుడు మొదలైన మామలు, కుంతిభోజుడు, శకుని మొదలైన మేనమామలు, జయద్రథుడు మొదలైన బావలు, భీమ దుర్యోధన దుశ్శాసనాది సోదరులు - అందరూ వీళ్ళే. అర్జునుడికి వీళ్ళే కనిపిస్తున్నారు. మనస్సులో ఉన్న వాళ్ళే బయట కనిపిస్తున్నారు. వాస్తవానికి యుద్ధభూమిలో వీళ్ళే కాదు. పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యం నిలబడి ఉంది. వాళ్ళెవ్వరినీ ప్రస్తావించడం లేదు. వీరుడైన అర్జునుడు కాదు ప్రస్తుతం మాట్లాడేది. మమకారం బరి తెగించి మాట్లాడుతోంది. కట్లు త్రెంచుకొని పరుగిడుతోంది.

ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్య రాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥ 35

**ఏతాన్-న-హన్తుం-ఇచ్ఛామి-ఘ్నతః-అపి-మధుసూదన**
**అపి-త్రైలోక్య రాజ్యస్య-హేతోః-కిం-ను-మహీకృతే**

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఏతాన్ | = | వీరిని | ఇచ్ఛామి | = | కోరుట |
| ఘ్నతః అపి | = | చంపుతున్న వారైనా | న | = | లేదు |
| హంతుం | = | హింసించుటకు | మధుసూదన | = | హే మధుసూదనా! |
| త్రైలోక్య రాజ్యస్య | = | త్రిలోకాధిపత్యము | మహీకృతే | = | భూమి కొరకు |
| హేతోః అపి | = | కొరకు గాని | ను కిమ్ | = | ఎలా కోరను? |

**ముల్లోకాల రాజ్యాధిపత్యము వచ్చి పడినా నేను వీళ్ళ నెవ్వరినీ చంపలేను. ఇక భూమి కోసం చంపుతానా? మధుసూదనా! ఒకవేళ వీళ్ళల్లో ఎవరైనా నన్ను చంపాలని ప్రయత్నించినా, నేను మాత్రం వాళ్ళను చంపను.**

వ్యాఖ్య

సరే. అర్జునుడు కరుణా హృదయుడు. బంధువులను వధించలే నని బాధ పడుతున్నాడు. అలాగని,





దుర్యోధనాదులు వదిలి పెడతారా? అర్జునుడు చంపడం మానేసినా, వాళ్ళు విజృంభించి అర్జునుని వధించరా? ఆ మాత్రం సాహసం చేయలేని వాళ్ళా?

బాల్యం నుండి వాళ్ళు చేసిందంతా అదే కదా! భీముణ్ణి గంగలో ముంచలేదా? లక్క ఇంటికి నిప్పు పెట్టలేదా? విష ప్రయోగం చేయలేదా? ఈ కార్యాల వెనుక ప్రేమ లున్నాయా? మమకారా లున్నాయా? ఇన్ని చేసిన వాళ్ళు ఈ రోజు వారిని విడిచి పెడతారా? కారుణ్యంతో అర్జునుడు వారిని కనికరించినా, కాఠిన్యంతో అర్జునాదుల్ని మట్టు బెట్టే ప్రయత్నం చేయరా?

అది నిజమే. అయినా ఫరవాలేదు అంటున్నాడు అర్జునుడు. వాళ్ళు నన్ను చంపితే చంపనీ. నేను మాత్రం వాళ్ళను వధించను అంటున్నాడు (*ఏతాన్ న హన్తుం ఇచ్ఛామి ఘ్నతోఽపి*). తన వాళ్ళు, మన వాళ్ళు అనే మమకారం లేకుండా వాళ్ళు ప్రవర్తిస్తే అది వాళ్ళ వ్యవహారం. వాళ్ళు అలా వ్యవహరిస్తున్నా రని నేనెందుకు అలా వర్తించాలి? అనేది అర్జునుని ఆంతర్యం.

స్వర్గలోకము, మానవ లోకము, పాతాళము - ఇవే త్రిలోకములు. ఈ మూడు లోకాల రాజ్యాధిపత్యాన్ని ఇచ్చినా, తన వాళ్ళను వధించడం సాధ్యం కాదు. అలాంటప్పుడు భూలోకంలో ఏదో కొద్దిపాటి రాజ్యం కొరకు వధించడం సాధ్యమా? అనేది అర్జునుని వాదము.

ఇంతవరకు ఇహలోక సంబంధమైన సుఖాల కొరకు తన వారిని వధించడం సాధ్యం కాదని వాదించిన విజయుడు, ఈ శ్లోకం నుండి పరలోక సుఖాల కొరకు కూడా యుద్ధం చేయ లేనని చెబుతున్నాడు.

నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతిః స్యా జ్జనార్దన ।
పాప మేవా శ్రయే దస్మా న్హత్వైతా నాతతాయినః ॥ 36

**నిహత్య-ధార్తరాష్ట్రాన్-నః-కా-ప్రీతిః-స్యాత్-జనార్దన**
**పాపం-ఏవ-ఆశ్రయేత్-అస్మాన్-హత్వా-ఏతాన్-ఆతతాయినః**

| | | | | | |
|---|---|---|---|---|---|
| జనార్దన | = | హే జనార్దనా! | ఆతతాయినః | = | దురాత్ములైన |
| ధార్తరాష్ట్రాన్ | = | ధృతరాష్ట్రుని కొడుకుల్ని | ఏతాన్ | = | వీరిని |
| నిహత్య | = | చంపితే | హత్వా | = | చంపి |
| నః | = | మాకు | అస్మాన్ | = | మమ్ములను |
| కా | = | ఏమి | పాపమేవ | = | పాపమే |
| ప్రీతిః | = | సంతోషము | ఆశ్రయేత్ | = | ఆశ్రయిస్తుంది |
| స్యాత్ | = | కలుగును? | | | |

**జనార్దనా! ధృతరాష్ట్రుని బిడ్డల్ని చంపితే మా కేమి సుఖం? వాళ్ళు పాపాత్ములు. పాపుల్ని చంపితే, మమ్మల్ని కూడా పాపమే చుట్టుకుంటుంది.**

వ్యాఖ్య

దుర్యోధనాదులను వధించి సుఖించే దేముంటుంది? అనేది అర్జునుని ప్రశ్న. యుద్ధంలో దుష్టుడైన దుర్యోధనుడు ఒక్కడే లేడు. అతనికి సహకరించే వీరులు అనేక మంది వచ్చి ఉన్నారు. వారిలో ధర్మాత్ములు కూడా ఉన్నారు. ఈ సంగ్రామంలో వాళ్ళు నశించే ప్రమాదం కూడా ఉంది.

ఇకపోతే, కౌరవ సైన్యము కూడా పాండవ సైన్యములో కొందరిని సంహరించ వచ్చు. ఈ విధంగా

ఉభయ పక్షాలలో ఉత్తములైన వారు ఎందరో హతులయ్యే ప్రమాదం ఉంది. అదే జరిగితే, ఇహ లోకంలో మనం పరితపించక తప్పదు. పరలోకంలో పాప ఫలితాన్ని అనుభవించక తప్పదు. దుర్యోధనాదులు ఆతతాయులే. ఆ విషయంలో సందేహము లేదు. కాని, మనం అందరినీ వదలి ఆతతాయుల్ని మాత్రమే చంపలేము కదా! కనుక ఆతతాయుల్ని వధించడంలో దుష్టులే గాక పుణ్యాత్ములు, అమాయకులు కూడా వధింపబడే ప్రమాదం ఉన్నందున, ఆతతాయుల్ని వధించడంలో తమకు పాపమే చుట్టుకుంటుంది అనేది అర్జునుని వాదము. పాపము అనేది నేడు చేసినా, పాప ఫలాన్ని ఏదో ఒకనాడు, ఎక్కడో ఒక చోట అనుభవించక తప్పదు అనే జన్మాంతర పాపపుణ్యాలను కూడా స్పృశిస్తూ, పరలోక అనుభవాలను కూడా తెర పైకి తెచ్చాడు పార్థుడు. ఇంతకీ ఆతతాయులు అంటే ఎవరు?

*అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణి ర్ధనాపహృత్*
*క్షేత్ర దార హరశ్చైవ షడేతే హ్యాతతాయినః ॥*

ఇంటికి నిప్పు పెట్టేవాడు (*అగ్నిద*), విషం పెట్టేవాడు (*గరద*), మారణాయుధాలు ధరించే వాడు (*శస్త్రపాణి*), పరుల ధనాన్ని అపహరించే వాడు (*ధనాపహృత్*), ఇతరుల భూములను ఆక్రమించే వాడు (*క్షేత్ర హరః*), అన్యుల భార్యలను అవమానించే వాడు, లేదా అపహరించే వాడు (*దారహరః*). ఈ ఆరు మందిని ఆతతాయులు అంటారు. వీరు వధార్హులే అని శాస్త్రము నిర్ధారణ చేసింది.

పైన తెలిపిన ఆరు దోషాలలో ఏ ఒక్కటి ఉన్నా అట్టి ఆతతాయి వధార్హుడు. కాని, దుర్యోధనాదులు ఈ ఆరు దోషాలనూ పూర్ణంగా కలిగి ఉన్నారు. (1) లక్క ఇంటికి నిప్పు పెట్టారు. (2) భీముడిపై విష ప్రయోగం చేశారు. (3) శస్త్రాలు ధరించి అరణ్యవాసంలో ఉన్న పాండవుల్ని మట్టు పెట్టాలని చూశారు. (4) పాండవుల ఐశ్వర్యాన్ని అపహరించారు. (5) ధర్మబద్ధంగా పాండవులకు రావలసిన భూమిని కాజేశారు. (6) పాండవుల పట్టమహిషి అయిన ద్రౌపదిని అవమాన పరచారు. ఈ ఆరు దోషాలు కలిగిన దుర్యోధనాదులను కేవలం ఆతతాయులని కాదు; నికృష్ట ఆతతాయులు అని పిలవాలి.

ఒక వైపు కౌరవులను ఆతతాయులు అంటూనే, మరో వైపు వధార్హు లైన ఆతతాయులను చంపితే పాపము అంటుతుందని అర్జునుడు విచిత్రంగా వాదిస్తున్నాడు. పాపాత్ముల్ని చంపితే పాపము వచ్చే టట్లైతే, పుణ్యాత్ముల్ని చంపితే పుణ్యం వస్తుందా? అర్జునుని భావం అది కాదు. పాపి ఎలాగూ పాపం చేస్తాడు. పాపి విషయంలో కూడా ధర్మాత్ములు పాపం చేయ కూడదు (*న పాపే ప్రతిపాపః స్యాత్*) అనేదే పుణ్యాత్ముడైన అర్జునుని అభిప్రాయం.

తస్మా న్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రా న్స్వబాంధవాన్ ।
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ ॥ 37

*తస్మాత్-న-ఆర్హాః-వయం-హంతుం-ధార్తరాష్ట్రాన్-స్వబాంధవాన్*
*స్వజనం-హి-కథం-హత్వా-సుఖినః-స్యామ-మాధవ*

| | | | | | |
|---|---|---|---|---|---|
| మాధవ | = | కృష్ణా! | అర్హాః న | = | అర్హులము కాము |
| తస్మాత్ | = | అందువలన | స్వజనం | = | తన వారిని |
| వయం | = | మేము | హత్వా | = | చంపుకొని |
| స్వబాంధవాన్ | = | బంధువులైన | కథం | = | ఏ విధముగా |
| ధార్తరాష్ట్రాన్ | = | ధృతరాష్ట్రుని సంతానాన్ని | సుఖినః | = | సుఖవంతులము |
| హంతుం | = | చంపుటకు | స్యామ హి | = | కాగలము |





**కృష్ణా! బంధువు లైన ధృతరాష్ట్రుని బిడ్డల్ని చంపడం మా వల్ల కాదు. మాధవా! తన వాళ్ళను చంపుకొని ఎవరైనా ఎలా సుఖపడ గలరు?**

**వ్యాఖ్య**

**ధర్మము - మమకారము**

ధర్మస్పృహతో అర్జునుడు రణరంగంలో ప్రవేశించాడు. యుద్ధభూమిలో స్వజనుల్ని చూచిన తరువాత అతని మనస్సును మమకారం చుట్టుకొంది. మరీ గట్టిగా పట్టుకుంది. మమకారాన్ని తట్టుకోలేక ధర్మం మరుగున పడి పోయింది. ధర్మానికి, మమకారానికి మధ్య ఘర్షణ ప్రారంభ మైంది. ప్రస్తుతం మమకారానిదే పై చేయిగా నిలిచింది. స్వజనుల్ని చంపడం పాపం కనుక, ఇహలోక సుఖాలే కాదు, పరలోక సుఖాలు కూడా తమకు మిగలవు అనేది అర్జునుని ఉద్దేశ్యం.

ప్రతి కర్మకు ఫలితం ఉంటుంది. స్థూల కర్మకు స్థూల ఫలితం ఉన్నప్పుడు, సూక్ష్మ కర్మకు సూక్ష్మ ఫలితం ఉండాలి కదా! స్వజనుల్ని వధించడం స్థూలకర్మ. దానికి ఫలితం రాజ్యం కావచ్చు. రాజ్యం సరే వస్తుంది. దానిని ఎవరితో కలసి అనుభవించాలి? ఎవరితో కలసి విజయోత్సవాలు జరుపు కోవాలి? స్వజనుల్ని వధించి సాధించిన రాజ్యంలో జరుపుకొనే ఉత్సవాలలో ఉత్సాహాలు కూడా ఉంటాయా?

అయ్యో! ఆతతాయులనే గాక అమాయకుల్ని, సుజనులైన స్వజనుల్ని కూడా చంపుకున్నామే! అనే బాధను మరచి పోగలమా? ఇలా దుఃఖించడం దృష్టఫల మైతే, వారిని చంపాలి అనే భావన ఏదైతే యుద్ధానికి ముందే మనస్సులో ఉందో, అది సూక్ష్మకర్మ. స్థూలకర్మకు స్థూల ఫలిత మున్నట్లే, సూక్ష్మకర్మకు సూక్ష్మ ఫలితం ఉంటుంది. ఆతతాయుల్ని చంపడం పుణ్య మైతే, దానికి ఫలితంగా పుణ్య లోకాలకు ద్వారాలు తెరుచుకో వచ్చు. కాని, కేవలం ఆతతాయుల్నే కాదు కదా యుద్ధంలో వధించేది? సజ్జనులు కూడా చనిపోతారు. ఆతతాయుల్ని చంపడం వల్ల పుణ్యం ప్రాప్తిస్తే, అమాయకుల్ని, సుజనుల్ని వధించడం వల్ల పాపం సంభవించి నరకం ప్రాప్తిస్తుంది. కనుక బంధువుల్ని చంపడానికి మేము సిద్ధంగా లేము అంటున్నాడు. స్వజనుల్ని చంపుకొని, ఆ తరువాత సుఖించే దేముంటుంది అని ప్రశ్నిస్తున్నాడు.

కౌరవులు పాండవులకు స్వజను లైతే, పాండవులు మాత్రం కౌరవులకు స్వజనులు కారా? మరి, వాళ్ళు యుద్ధాన్ని ఎందుకు విరమించు కోవడం లేదు? ఈ ఆలోచన వారికి ఎందుకు రాలేదు? అనే ప్రశ్నకు కూడా సమాధానం చెబుతున్నాడు సవ్యసాచి.

యద్య ప్యేతే న పశ్యన్తి లోభోపహత చేతసః ।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్ ॥ 38

*యద్యపి-ఏతే-న-పశ్యంతి-లోభోపహత చేతసః*
*కులక్షయకృతం-దోషం-మిత్రద్రోహే-చ-పాతకం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| లోభోపహత చేతసః | = | లోభము చేత చెదరగొట్ట బడిన మనస్సు గల | మిత్రద్రోహే | = | మిత్ర ద్రోహము వలన కలుగు |
| ఏతే | = | వీరు | పాతకం చ | = | పాపమును |
| కులక్షయ కృతం | = | కులనాశము వలన కలుగు | పశ్యంతి | = | చూచుట |
| దోషం | = | చెడును | యద్యపి న | = | లేక పోయినా |

**కులం నశిస్తే కలిగే చెడు ఏమిటో, మిత్ర ద్రోహము వల్ల ఏర్పడే పాతక మెలాంటిదో వాళ్ళకు కనిపించక పోవచ్చు. వారికి రాజ్యమే కావాలి. అంతా లోభమే.**

**వ్యాఖ్య**

**తెలివి - వెలితి**

యుద్ధంలో స్వజనులు మరణిస్తారు. దాని వలన కుల నాశము జరుగుతుంది. స్వజనులే కాదు, సుహృత్తులు కూడా చనిపోతారు. అది మిత్రద్రోహ మవుతుంది. ఈ ఆలోచన అర్జునునికే ఎందుకు వచ్చింది? అర్జునుని పరిస్థితిలో దుర్యోధనాదులు కూడా ఉన్నారు కదా! వాళ్ళెందుకని అలా ఆలోచించడం లేదు. వాళ్ళకు ధర్మాలు తెలియవా? వివేకము లేదా? అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. వారికి ధర్మాలు తెలిసినా ప్రయోజనం లేదు. వాళ్ళ తెలివిలో ఒక వెలితి ఉంది. అదే లోభము. వాళ్ళ తెలివిని లోభం తినేసింది. అమాంతం మింగేసింది. అందుకే వాళ్ళను లోభోపహత చేతసులు అంటున్నాడు అర్జునుడు.

లోభం మనిషి చేత ఏ పాపా న్నైనా చేయిస్తుంది. లోభికి లాభమే ప్రధానం, ధర్మం కాదు. లోభం గురువుల్ని గుర్తించదు. బంధువుల్ని ప్రేమించదు *(అర్థాతురాణాం న గురుః న బంధుః)*. దుర్యోధనాదులు రాజ్య లోభంతో పాడై పోయారు. అందువల్ల కులక్షయం వల్ల కలిగే దోషాన్ని వాళ్ళు పట్టించుకో లేదు. అందుకే కదా పాండవుల్ని లక్క యింటిలో కరిగించేయా లని చూశారు! కులక్షయం వల్ల కలిగే దోషం తెలిస్తే అలా చేస్తారా? తెలియక కాదు. లోభము వారి బుద్ధిని నాశనం చేసింది.

సంధికి వెళ్ళిన అచ్యుతుని బంధించే ప్రయత్నం ఎవరైనా చేస్తారా? అది మిత్రద్రోహం కాదా? ఈ విషయం వాళ్ళకు తెలియదా? తెలుసు. కాని లోభం ముందు ధర్మాలు ఆవిరై పోయాయి. పుణ్యపాపాలు, ధర్మాధర్మాలు, ఇవేవీ పట్టించుకోరు లోభులు.

కావచ్చు. దుర్యోధనాదులు లోభులే కావచ్చు. మరి, ఆ వైపు భీష్మద్రోణులు కూడా ఉన్నారు కదా! వారు కూడా లోభులేనా? ధనాశ, రాజ్యకాంక్ష వారికి కూడా ఉన్నాయా? కులక్షయ దోషము, మిత్రద్రోహ పాతకము వారికి కూడా తెలియదా?

భీష్మద్రోణులు దుర్యోధనాదుల లాగా లోభోపహత చేతసులు కారు. దుర్యోధనాదుల బుద్ధుల్నే లోభం పాడు చేసింది. కాని, లోభంతో పాడై పోయిన దుర్యోధనుని అధీనంలో ఉండటం చేత, ధర్మస్పృహ కలవారే అయినా, ప్రస్తుతము ధర్మం విషయంలో భీష్మద్రోణులు అశక్తులై ఉన్నారు. కాని, అన్నీ తెలిసి లోభం తెలియని మనం పోరుకు దిగడ మేమిటి? అనేదే అర్జునుని వాదము.

యుద్ధం చేయడం తన వల్ల కావడం లేదు అంటూ ఇంత వరకు స్వజన ప్రియ వాదాన్ని వినిపించిన పార్థుడు, ఇక్కడి నుండి యుద్ధాన్నే ఆపి వేయాలి అనే ప్రయత్నంలో పడ్డాడు.

**కథం న జ్ఞేయ మస్మాభిః పాపా దస్మా న్నివర్తితుమ్ ।**
**కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన ॥** 39

*కథం-న-జ్ఞేయం-అస్మాభిః-పాపాత్-అస్మాత్-నివర్తితుం*
*కులక్షయకృతం-దోషం-ప్రపశ్యద్భిః-జనార్దన*

| | | | | | |
|---|---|---|---|---|---|
| జనార్దన | = హే జనార్దనా! | | దోషం | = దోషమును | |
| కులక్షయకృతం | = కులనాశము వలన కలుగు | | ప్రపశ్యద్భిః | = చక్కగా గ్రహించిన | |





| | | | |
|---|---|---|---|
| అస్మాభిః | = మా చేత | కథం | = ఎలా |
| అస్మాత్ | = ఈ | జ్ఞేయం | = తెలియ దగింది |
| పాపాత్ | = పాపము నుండి | న | = కాదు |
| నివర్తితుం | = తొలగుటకు | | |

**జనార్దనా! కులక్షయము వల్ల కలిగే దోష మేమిటో మనకు తెలుసు కదా! అలాంటప్పుడు ఈ పాపం నుండి మన మెందుకు తప్పించుకో కూడదు?**

**వ్యాఖ్య**

**స్వార్థమా? ధర్మమా?**

యుద్ధాన్ని దుర్యోధనాదులు వాంఛించారు. వారిది లోభమే కావచ్చు. మరి అరణ్యవాస, అజ్ఞాతవాస కాలంలో మీరు మాత్రం యుద్ధాన్ని వాంఛించ లేదా? అది లోభం క్రిందికి రాదా? ఇకపోతే, దుర్యోధనుని అధీనంలో ఉన్న భీష్మద్రోణాదులు ధర్మస్పృహను త్యజిస్తే, యుద్ధాభిలాషులై వచ్చిన మీ పక్షం లోని ధర్మాత్ములు కూడా భీష్మద్రోణాదుల లాగే అశక్తులు కారా?

కానే కారు. దుర్యోధనునిది లోభం. అధర్మం. మాది అలోభం. ధర్మం. కనుక, లోభ జనిత పాపం మమ్మల్ని గాని, మా అధీనంలో ఉండే రాజుల్ని గాని అంటదు అనేదే అర్జునుని అభిమత మైతే; మరి అలాంటప్పుడు ధర్మం కోసం చేసే పోరాటములో దోషాలు, పాతకాలు ఎక్కడున్నాయి? ధర్మ నిర్వహణలో మమకారానికి చోటెక్కడుంది? అనేది మరో ప్రశ్న.

ధర్మబద్ధంగా రాజ్యం కావాలని మేము ఆశించాము. అధర్మంగా నైనా రాజ్యాన్ని చేజిక్కించుకోవాలని దుర్యోధనుడు ఆరాట పడ్డాడు. ఉభయులమూ రణరంగానికి చేరాము. ఇక్కడ స్వజనుల్ని చూచిన తరువాత, మిత్రులను వీక్షించిన తరువాత మా మనస్సు మెత్త పడింది. లోభముతో పాడై పోయిన దుర్యోధనుని మనస్సు మారలేదు. మారలేదు కనుక అతడు మారణహోమం నుండి మరలి పోలేడు. కాని, ధర్మ మెరిగి, దయాగుణం కల మేమైనా రణాన్ని ఎందుకని విరమించు కోకూడదు? కులక్షయం వల్ల సంభవించే ప్రమాదాలు చాలా ఉన్నాయి అంటున్నాడు పాండునందనుడు.

**కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాః సనాతనాః ।**
**ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత ॥** 40

*కులక్షయే-ప్రణశ్యంతి-కులధర్మాః-సనాతనాః*
*ధర్మే-నష్టే-కులం-కృత్స్నం-అధర్మః-అభిభవతి-ఉత*

| | | | |
|---|---|---|---|
| కులక్షయే | = కులనాశము జరిగితే | కృత్స్నం | = సమస్తమైన |
| సనాతనాః | = అనాదిగా వస్తున్న | కులం | = కులమును |
| కులధర్మాః | = కుల ధర్మములు | అధర్మః | = అధర్మము |
| ప్రణశ్యంతి | = నశిస్తాయి | అభిభవతి ఉత | = వ్యాపించును కదా! |
| ధర్మే నష్టే | = ధర్మము నశిస్తే | | |

**కులక్షయం జరిగితే, అనాదిగా, ఆచారంగా వస్తున్న కులధర్మాలు నశిస్తాయి. ధర్మం నశిస్తే, కులమును అధర్మం ఆక్రమిస్తుంది.**

వ్యాఖ్య

కులక్షయం వల్ల అనాదిగా వస్తున్న ఆచారాలు నశిస్తాయి. అనాచారాలు, దురాచారాలు ప్రబలుతాయి. శాస్త్రాలు బోధించే ధర్మాలు పాండిత్యము ఉన్న వారికే తెలుస్తాయి. ఇవన్నీ శాస్త్ర ప్రబోధితాలు. అలా కాకుండా, సదాచారవంతులైన పెద్దలు బోధించే ధర్మాలు కులధర్మాలు. అట్టి సాంప్రదాయక ధర్మాల వలన కులంలో ధర్మ జీవనం కొన సాగుతుంది.

అయితే, యుద్ధంలో కులధర్మాలు తెలిసిన పెద్దలు నశించి పోతే, ఆ తరువాత కులధర్మాలు, సంప్రదాయాలు కనుమరు గవుతాయి. ధర్మజీవనం అడుగంటి పోతుంది. అధర్మం ప్రబలుతుంది. కులంలో అధర్మం పెచ్చు పెరిగితే ఆ తరువాత అంతా దోషయుత మవుతుంది. ఎలాగో చెబుతున్నాడు.

**అధర్మాభి భవాత్ కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ।**
**స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః ॥** 41

*అధర్మాభిభవాత్-కృష్ణ-ప్రదుష్యంతి-కులస్త్రియః*
*స్త్రీషు-దుష్టాసు వార్ష్ణేయ-జాయతే-వర్ణసంకరః*

| | | | | | |
|---|---|---|---|---|---|
| కృష్ణ | = | ఓ కృష్ణా! | వార్ష్ణేయ | = | కృష్ణా! |
| అధర్మాభిభవాత్ | = | అధర్మము వ్యాప్తి చెందితే | స్త్రీషు దుష్టాసు | = | స్త్రీలు చెడిపోవుట వలన |
| కులస్త్రియః | = | కులాంగనలు | వర్ణసంకరః | = | వర్ణసంకరము |
| ప్రదుష్యంతి | = | చెడి పోతారు | జాయతే | = | కలుగుతుంది |

**కృష్ణా! అధర్మం వ్యాప్తి చెందితే స్త్రీలు పాడై పోతారు. స్త్రీలు చెడిపోతే వర్ణ సంకరం జరుగుతుంది.**

వ్యాఖ్య

**ఇంటి దీపం ఆరిపోతుంది**

ధర్మం నశిస్తే కులమును అధర్మం ఆక్రమిస్తుంది (*అధర్మః అభిభవతి*) అని ముందు శ్లోకంలో చెప్పిన అర్జునుడు, అలా అధర్మము కులమును ఆక్రమిస్తూ వ్యాప్తి చెందడం వల్ల (*అధర్మ అభిభవాత్*) కులస్త్రీలు చెడి పోతారు (*ప్రదుష్యన్తి*) అంటున్నాడు.

గృహంలో ధర్మనిష్ఠను కొనసాగించే బాధ్యత, పరిరక్షించే సమర్థత రెండిటిని స్త్రీకే కట్టబెట్టింది సనాతన ధర్మం. కనుక గృహంలో ధర్మదీపాన్ని వెలిగించేది, ఆరిపోకుండా కాపాడేది స్త్రీ మూర్తియే.

**ధర్మ ప్రజా సంపత్యర్థం స్త్రియ ముద్వహే**

ధర్మ, సంతానముల సంపదను వాంఛించి నేను స్త్రీని వివాహము చేసుకుంటున్నాను అని వివాహానికి ముందే వరుడు ఈ పుణ్య సంస్కృతిలో వాగ్దానం చేస్తాడు. అంతేకాదు.

**ఆవాభ్యాం కర్మాణి, ఆశ్రమ ధర్మ కర్మాణి కర్తవ్యాని, ప్రజా శ్చోత్పాదయితవ్యాః**

ఇక మీదట మన మిద్దరము గృహస్థాశ్రమ ధర్మాలను చక్కగా ఆచరిస్తూ, అట్టి ధర్మాచరణ ఫలంగా చక్కని సంతానాన్ని పొందుదాము అని వరుడు వధువుతో చెబుతాడు.

వాస్తవానికి భార్య వల్లనే భర్త అన్ని విధాల అద్భుత ప్రయోజనాలను సాధిస్తాడు. అర్ధాంగి వల్లే భర్తకు





సర్వమూ సమకూరుతాయి అని ధర్మశాస్త్ర ప్రబోధము. (1) ఉత్తమ సంతానం (*అపత్యం*), (2) ధర్మ కార్యాచరణము (*ధర్మకార్యాణి*) (3) పతిసేవ (*శుశ్రూషా*), (4) ఉత్తమమైన రతి సుఖము (*రతి రుత్తమా*), (5)తనకు, తన పితృ దేవతలకు స్వర్గప్రాప్తి (*స్వర్గః పితౄణా మాత్మన శ్చహ*), ఇవన్నీ భార్యల వల్లనే భర్తలకు ప్రాప్తిస్తాయి. అందుచేత, సత్సంతానాన్ని ప్రసాదించి ఇటు భర్తకు, అటు భర్త పూర్వీకులకు మహోపకారం చేస్తున్న మహిళలు ఇంటికి మణిదీపాలు అన్నది మనుధర్మ శాస్త్రం.

*ప్రజానార్థం మహాభాగా పూజార్హా గృహదీప్తయః*
*స్త్రియ శ్శ్రియశ్చ గేహేషు న విశేషోఽస్తి కశ్చన ॥*

సత్సంతానాన్ని అందించి, భర్తలకు మహోపకారం చేస్తున్న మహిళామూర్తులు భర్తల గృహాలకు మణిదీపాల వంటి వారు (అందుకే అర్ధాంగిని భార్యామణి అంటూ ఉంటారు). స్త్రీలు శ్రీమహాలక్ష్మి వంటి వారు కనుక పూజార్హులు అని ధర్మ శాస్త్రము స్త్రీని శ్లాఘించింది. ఇదంతా పూర్వపు రోజుల్లో హిందూ సమాజం నుండి స్త్రీ మూర్తులు అందుకున్న నీరాజనాలు.

ఇన్ని విధాల గృహాలను రక్షిస్తూ పురుషులను ఆదుకుంటున్న స్త్రీ మూర్తులను పురుషులు రక్షించాలి. ఆదుకోవాలి. పురుషుడు ధనాన్ని సంపాదించ వచ్చు. కాని, దానిని భద్రపరచే బాధ్యత, ఖర్చు చేసే యోగ్యత స్త్రీకే అప్పగించింది హిందూధర్మం.

**అర్థస్య సంగ్రహే చైనాం వ్యయే చైవ నియోజయేత్**

పురుషుడు సంపాదించి తీసికొని వచ్చిన ధనమును ఇల్లాలే భద్ర పరచాలి. అవసరాన్ని బట్టి ఇల్లాలే ఖర్చు చేయాలి. భర్తకు అవసరం వచ్చినా భార్యనే అడిగి తీసుకోవాలి. ఈ విధంగా గృహస్థాశ్రమంలో విశిష్ట మైన విలువలు పరిరక్షింప బడ్డాయి.

ఈ విధంగా గృహాలను పరిరక్షిస్తున్న స్త్రీలను రక్షింప వలసిన బాధ్యత పురుషుల పైనే ఉంది. కాని, యవ్వనంలో ఉన్న పురుషులు లక్షలాది మంది కురుక్షేత్రంలో ఉన్నారు. యుద్ధంలో వారు మరణిస్తే, యువతులకు వైధవ్యం ప్రాప్తిస్తుంది. స్త్రీలను రక్షించే వారు లేకుండా పోతారు. అలాంటి అయోమయ పరిస్థితిలో స్త్రీలు అభద్రతలో పడిపోయి బలహీనతలకు తల వంచుతా రేమో! అదే జరిగితే, సాంఘిక సంక్షేమం కుంటు పడుతుంది. సమాజ అభ్యుదయం అడుగంటి పోతుంది. ఇంటికి దీపం ఇల్లాలు అన్నారు పెద్దలు. ఇల్లాలికే భద్రత లోపిస్తే, ఇంటిదీపమే ఆరిపోతే, ఇక ఇల్లు ఎలా భద్రంగా ఉంటుంది? అంతా అభద్రతే. ఇదంతా యుద్ధ ఫలితమే నని అర్జునుని అభిమతం. కులస్త్రీలు అభద్రతలో పడి, గృహదీపాలు ఆరిపోతే వర్ణసంకరం ఏర్పడు తుందని భీతి చెందుతున్నాడు పార్థుడు. వంశనాశం ఇదే నేమో అని ఆందోళన చెందు తున్నాడు.

ఈ సందర్భంలో, శ్రీకృష్ణుని వార్ష్ణేయా! అని సంబోధించాడు అర్జునుడు. శ్రీకృష్ణుడు వృష్ణి వంశమునకు చెందిన వాడు కనుక ఆయన వార్ష్ణేయుడు. ఈ సంబోధన ద్వారా అర్జునుడు శ్రీకృష్ణునికి రెండు సంకేతాలు పంపుతున్నాడు.

అయ్యా! శ్రీకృష్ణ మహాశయా! మాది కురువంశము. నీది వృష్ణివంశము. నీ కేమి? ఎన్నైనా చెబుతావు. రాలేది, కూలేది నా వంశమే కదా! అందుకే నేను ఆందోళన పడుతున్నా అనేది ఒక సంకేతము. అదేమిటయ్యా! అర్జునా! యుద్ధంలో మా వంశం వారు కూడా ఉన్నారు కదా! మాకూ నష్టమే కదా? అని శ్రీకృష్ణుడు అంటాడేమో నని, అందుకే చెబుతున్నానయ్యా అచ్యుతా! ఇద్దరికీ తంటాయే కనుక, వెంటనే బండి వెనక్కి తిప్పు. ఇద్దరం ఎవరింటికి వాళ్ళం పోదాము అనేది రెండవ సంకేతము.

అధర్మ వ్యాప్తి వల్ల కులస్త్రీలు చెడి పోతారు. వర్ణ సంకరం ఏర్పడుతుంది అని చెప్పిన అర్జునుడు ఆ వర్ణ సంకరము యొక్క ఫలితం ఎలా ఉంటుందో చెబుతున్నాడు.

**సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ ।**
**పతన్తి పితరో హ్యేషాం లుప్తపిణ్డోదకక్రియాః ॥** 42

*సంకరః-నరకాయ-ఏవ-కులఘ్నానాం-కులస్య-చ*
*పతంతి-పితరః-హి-ఏషాం-లుప్త పిండోదకక్రియాః*

| | | | |
|---|---|---|---|
| సంకరః | = వర్ణసంకరము | ఏషాం | = వీరి యొక్క |
| కులఘ్నానాం | = కులమును చెడిపిన వారికి | పితరః | = పితరులు |
| కులస్య చ | = కులమునకు | లుప్తపిండోదక క్రియాః | = శ్రాద్ధతర్పణ క్రియలు లేనివారై |
| నరకాయ ఏవ | = నరకము కొరకే | పతంతి హి | = పతన మవుతారు |

**వర్ణసంకరము వల్ల కులానికి, కుల భ్రష్టులకు మిగిలేది నరకమే. అలాంటి వారి పితృ దేవతలు శ్రాద్ధ తర్పణాలకు కూడా నోచుకోరు. అధోగతి పాలవుతారు.**

**వ్యాఖ్య**

**అంతా పాపమయం**

అధర్మం వ్యాప్తి చెందడం వల్ల ఏర్పడిన వర్ణ సంకరము నరకాన్ని అందిస్తుంది. కులాన్ని నాశనం చేసిన వారికి, ఆ వినాశంలో నశించకుండా మిగిలిన వారికి ఇరువురికీ నరకమే నంటున్నాడు నర నామధేయుడు.

అధర్మ వ్యాప్తికి, కుల నాశానికి, వర్ణ సంకరానికి కారకులైన వారికి ఎలాగూ నరకం ప్రాప్తిస్తుంది. అలా కాకుండా, వినాశములో నశించకుండా మిగిలిన వారు ఉంటారు కదా! వారికి కూడా నరకమే ప్రాప్తిస్తుంది అనేది అర్జునుని అభిప్రాయం.

ధర్మం తెలిసిన వారు, కుల ధర్మాలను క్షుణ్ణంగా ఎరిగిన వారు యుద్ధంలో దివంగతు లౌతారు కనుక, మిగిలియున్న వారికి మార్గ నిర్దేశం చేసేవారు లేకుండా పోతారు. వీరు ఏది విహితమో, ఏది అవిహితమో ఎరుగరు కనుక కులధర్మాలను విస్మరించి పాపాన్ని సంపాదించు కుంటారు. ఇలా యుద్ధ కారణంగా అంతా పాపమయమై పోతుందని పార్థుని ఆవేదన.

**పెద్దలు చిన్నబోతారు**

కులమును నశింప చేసిన వారికి, కులధర్మాలు పాటించలేని అసమర్థులకు మాత్రమే కాదు నరకం ప్రాప్తించేది. పూర్వీకులు కూడా పిండోదకాలు అందక అధోగతి పాలవుతారు అంటున్నాడు అర్జునుడు.

కులములో పూర్వీకులు చేసిన పాపాలకు నిష్కృతిగా ఆ కులంలో జీవించి యున్న వారి సంతతి పిండోదకాలు సమర్పిస్తారు. ఈ విధంగా పితరుల ఋణాన్ని తీర్చుకుంటారు. గృహస్థాశ్రమ ధర్మంలో వివాహానికి ఇదొక ముఖ్య ప్రయోజనం.

**వివాహస్య ఫలం దేవ పితృర్ణాఽపకరణం**

దేవ ఋణాన్ని, పితృ ఋణాన్ని పూర్తిగా తీర్చడమే వివాహానికి ఫలం. గడచిన మూడు తరాల లోని పితృ దేవతలు వారు జీవించి ఉన్నప్పుడు తెలిసో, తెలియకో, ఎన్నో పాపాలు చేసి ఉంటారు. ఆ పాపాలను తటస్థ





పరచి, గతించిన పితరులు యాతన లేకుండా సుఖించడానికి, వారి సంతతి వారు ప్రతి మాసము తర్పణాదులు నిర్వహిస్తారు. పిండోదకాలు సమర్పిస్తారు.

యుద్ధంలో పెద్ద లందరూ నశిస్తే, పిండోదకాలు పితరులకు అర్పించేవా రెవరుంటారు? చనిపోకుండా మిగిలి యున్న వాళ్ళు అర్పిస్తారు అనుకుందాము. వాళ్ళ కైనా విధి విధానాలు తెలిపే వాళ్ళెవ రుంటారు? ఈ విధంగా పితరులు పిండోదకాలు లేనివారై తీవ్ర యాతనను, దుఃఖాన్ని అనుభవిస్తారు. ఇదంతా యుద్ధ ఫలితమే కదా? అనేది పార్థుని ప్రశ్న.

**చిరునామాలు చిక్కవు**

కులస్త్రీలు రక్షణ లేక పాడైతే, వర్ణ సంకరము ఏర్పడుతుంది. అలాంటప్పుడు పిండోదకాలు సమర్పించే వారు ఎవరు? ఎవరు సమర్పించేవి ఎవరికి చెందుతాయి? అనేది చాలా సంక్లిష్ట మైన విషయం. బీజ ప్రదాతలు ఒకరు, పిండోదకాలు స్వీకరించే వారు వేరొకరు అయ్యేందుకు వీలు లేదు. ఎవరికి ఎవరు బీజప్రదాతలో, వారికే చెందుతాయి తత్సంబంధమైన పిండోదకాలు. ఇదంతా వర్ణ సంకరంలో అర్జునుడు చూస్తున్న గందరగోళం.

ఈ గందరగోళ మంతా గాండీవికే గాని గోవిందునికి లేనే లేదు. ఈ ప్రశ్న లన్నిటికీ సమాధానాలు గోవిందుని వద్ద ఉన్నాయి. ఈ చిక్కుముడు లన్నీ సాంఖ్యంలో వాటంతటవే విడి పోతాయి.

**దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకర కారకైః ।**
**ఉత్సాద్యన్తే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః ॥** 43

*దోషైః-ఏతైః-కులఘ్నానాం-వర్ణసంకర కారకైః*
*ఉత్సాద్యంతే-జాతిధర్మాః-కులధర్మాః-చ-శాశ్వతాః*

| | | | |
|---|---|---|---|
| ఏతైః | = ఈ | జాతిధర్మాః | = జాతిధర్మములు |
| వర్ణసంకర కారకైః | = వర్ణ సంకరమునకు కారణమైన | చ | = మరియు |
| దోషైః | = దోషముల చేత | కులధర్మాః | = కులధర్మములు |
| కులఘ్నానాం | =వర్ణసంకర మొనర్చిన వారి యొక్క | ఉత్సాద్యంతే | = నశించి పోతాయి |
| శాశ్వతాః | = శాశ్వతములైన | | |

**ఈ విధంగా వర్ణ సంకరానికి కారకులైన వ్యక్తుల దోషం వల్ల, శాశ్వత మైన జాతిధర్మాలు, కులధర్మాలు నశించి పోతాయి.**

**వ్యాఖ్య**

వర్ణసాంకర్యము సృష్టించిన పాపము వల్ల కులము కుప్ప కూలుతుంది. కుల నాశము వల్ల కులధర్మాలు దెబ్బ తింటాయి. జాతిధర్మాలు నశిస్తాయి. ధర్మాలు తెలిసిన తలలు యుద్ధంలో రాలి పోవడం చేత, తరతరాల నుండి అందుతూ వస్తున్న ఈ ధర్మాలు తరువాత తరాల వారికి అందకుండా పోతాయి. ఆచరించ వలసిన ధర్మాలను ఆచరించక పోవడం వల్ల పాపము సంక్రమిస్తుంది. అలాగే ఆచరించ కూడని అకృత్యాలను ఆచరించడం వల్ల కూడా నరకము ప్రాప్తిస్తుంది.

ఏది సామాన్య ధర్మము, ఏది విశేష ధర్మము, ఏది స్త్రీ ధర్మము, ఏది పురుష ధర్మము, అనేది ధర్మం తెలిసిన వాళ్ళ నుండే కదా మనం గ్రహించాలి! అలాంటి విశిష్ట వ్యక్తులను సంగ్రామంలో శాశ్వతంగా సాగ నంపితే, ఆ తరువాత ధర్మం విషయంలో కుటుంబాలకు, సమాజానికి మార్గనిర్దేశం చేసే వారు ఎవ రుంటారు?

ధర్మాన్ని రక్షించే దెలా? ధర్మాన్ని రక్షించలేక పోతే, ధర్మం చేత రక్షింపబడే దెలా? ఇన్ని అనర్థాలకు మూలమైన యుద్ధంలో సాధ్గాని సాధించే దేముంటుంది? ఏదైనా ఉంటే, అది నరకమే నని తన అభిప్రాయం. తాను వినింది కూడా ఇదే అంటున్నాడు అర్జునుడు.

ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన ।
నరకే నియతం వాసో భవతీ త్యనుశుశ్రుమ ॥ 44

*ఉత్సన్నకులధర్మాణాం-మనుష్యాణాం-జనార్దన*
*నరకే-నియతం-వాసః-భవతి-ఇతి-అనుశుశ్రుమ*

| | | | | |
|---|---|---|---|---|
| జనార్దన | =జనార్దనా! | వాసః | = | నివాసము |
| ఉత్సన్న కులధర్మాణాం | =చెడిన కులాచారములు గల | భవతి | = | కలుగుతుంది |
| మనుష్యాణాం | =మనుష్యులకు | ఇతి | = | అని |
| నరకే | =నరకము నందు | అనుశుశ్రుమ | = | వింటున్నాము |
| నియతం | =అనివార్యంగా | | | |

**జనార్దనా! కులధర్మాలు పాడు చేసిన మనుష్యులకు నరకము తప్పనిసరి అని వింటున్నాము.**

**వ్యాఖ్య**

బంధుజన నాశము, కులక్షయ దోషము, మిత్రద్రోహ పాతకము, జాతిధర్మ నాశము, అధర్మ వ్యాప్తి పితరుల అధోగతి - ఇలా ఇప్పటికే అర్జునుడు శ్రుతి మించిన రాగాన్ని వినిపించాడు. తన కున్న పాండిత్యాన్నంతా ప్రబలంగా, ప్రముఖంగా ప్రదర్శించాడు.

అర్జునుడు సదాచార గాడిలో పెరిగిన వాడు. శిష్టాచార సంప్రదాయంలో, క్రమశిక్షణతో, పెద్దల మార్గంలో నడచిన వాడు. ఇప్పుడు యుద్ధభూమిలో తనను ముంచిన మమకార మాయలో పడి, అధికుల ముందు అధిక ప్రసంగం చేశానని తనలో తాను శంకించు కున్నాడో ఏమో తెలియదు గాని, కులధర్మాలను పాడు చేసిన వారికి నరకవాసము తప్పదని పెద్దల ద్వారా విని ఉన్నాను (*అనుశుశ్రుమ*) అని అంటున్నాడు.

**ఇహము లేదు - పరము మిగలదు**

యుద్ధములో విజయాన్ని సాధిస్తే రాజ్యము వస్తుంది. కాని, బంధు జనము నశించడం వల్ల రాజ్యం వచ్చినా సుఖం ఉండదు. తన వాళ్ళు లేరు అనే బాధ, తన వాళ్ళను చంపుకొని రాజ్యభోగాలను అనుభవిస్తున్నా ననే వ్యథ మనిషిని క్రుంగదీస్తూ ఉంటాయి కనుక, ఇక బ్రతికినంత కాలము సుఖశాంతులు ఉండవు.

పోనీ, మరణించిన తరువాత స్వర్గాది ఉత్తమ లోకాలు ప్రాప్తిస్తాయా అంటే, అదీ లేదు. కులక్షయానికి కారణం కావడం చేత నరకమే ప్రాప్తిస్తుంది గాని స్వర్గము లభించదు. ఇలా పెద్దల ద్వారా (**ఇతి శుశ్రుమ పూర్వేషాం**) తాను విని ఉన్నాడు. కనుక, యుద్ధం నుండి బయట పడలేక పోతే తనకు నరకమే గతి అని వాపోతున్నాడు విజయుడు.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
యద్రాజ్య సుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః ॥ 45

*అహో-బత-మహత్పాపం-కర్తుం-వ్యవసితాః-వయం*
*యత్-రాజ్యసుఖలోభేన-హంతుం-స్వజనం-ఉద్యతాః*





| | | | |
|---|---|---|---|
| యత్ | = ఏ కారణము వలన | పాపం | = పాపమును |
| రాజ్యసుఖలోభేన | = రాజ్యసుఖము పై ఆశ చేత | కర్తుం | = చేయుటకు |
| స్వజనం | = బంధువులను | వయం | = మేము |
| హంతుం | = చంపుటకు | వ్యవసితాః | = ప్రయత్నించిన వాళ్ళ మయ్యాము |
| ఉద్యతాః | = ఉద్యమించామో | అహో బత | = అయ్యో! |
| మహత్ | = గొప్పదైన | | |

**బంధువుల్ని హతమార్చి, పాపాన్ని మూట గట్టుకోవడానికి నడుం బిగించాము. ఇదంతా రాజ్యసుఖాలపై ఆశ తోనే కదా! అయ్యో!**

**వ్యాఖ్య**

రాజ్యభోగాలపై ఆశతో భీష్మద్రోణాది మహాత్ములను వధించ డానికి సాహసించామా? అని తనలో తాను క్రుంగి పోతున్నాడు ధనంజయుడు. ఒక వైపు తన మనసే తనను నిలదీస్తుంటే, మరో వైపు ఇదే విషయం రేపు ప్రజల నుండి అభియోగంగా వినవలసి వస్తుందేమో నని కూడా సంశయిస్తున్నాడు.

**రాజ్య సుఖము ఎంత? పాపమే అంతా!**

దారుణంగా పోరాడి, స్వజనుల్ని వధించి రాజ్యాన్ని పొంద వచ్చు. రాజ్య సుఖాలను అనుభవించ వచ్చు. ఎంతకాలం ఉంటుంది భోగానుభవము? దేహాలే శాశ్వతం కానపుడు రాజ్యాలు శాశ్వతమా? రాజ్య భోగాలు నిత్యమా? ఏదో కొంత కాలం అల్ప సుఖాలు అనుభవిస్తే అనుభవించ వచ్చు. ఆ తరువాత శాశ్వతంగా నరక కూపంలో పడి, దుర్భర దుఃఖాన్ని అనుభవించాలి కదా! రాజ్య లోభంతో ఇంత పాపాన్ని మూటకట్టు కుంటున్నామా? అని అర్జునుడు బాధతో నలిగి పోతున్నాడు. అంతేకాదు, ఈ విషయా లన్నీ యుద్ధభూమికి రాక ముందే ఎందుకని ఆలోచించలేక పోయాను? అని పశ్చాత్తాపంతో కుమిలి పోతున్నాడు.

స్వల్ప కాలం రాజ్య సుఖాలు అనుభవించ డానికి స్వజనుల్నే చంపుకోవాలా? స్వజనులకు దూరమై, భారమైన హృదయాలతో అనుభవించే సుఖాలు ఎంతవరకు తృప్తి నిస్తాయి? ఇలాంటి ప్రశ్నలు అర్జునుని అంతర్యాన్ని కుదిపేస్తున్నాయి.

విచిత్ర మేమిటంటే, రాజ్య సుఖాభిలాష అనేది దుర్యోధనునికి సంబంధించిందే గాని అర్జునునికి సంబంధించింది కాదు. ధర్మస్పృహతో అర్జునుడు యుద్ధభూమికి వచ్చాడే గాని, రాజ్యలాభము కోసం కాదు. రాజ్య లోభము ఉండీ కాదు. మమకారం పీడిస్తూ ఉంటే, తాను యుద్ధానికి ఎందుకు వచ్చాడో కూడా మరచి పోతున్నాడు పార్థుడు.

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః ।
ధార్తరాష్ట్రా రణే హన్యు స్తన్మే క్షేమతరం భవేత్ ॥ 46

*యది-మాం-అప్రతీకారం-అశస్త్రం-శస్త్రపాణయః*
*ధార్తరాష్ట్రాః-రణే-హన్యుః-తత్-మే-క్షేమతరం-భవేత్*

| | | | |
|---|---|---|---|
| అప్రతీకారం | = ప్రతీకారము చేయని | శస్త్రపాణయః | = శస్త్రధారులైన |
| అశస్త్రం | = శస్త్రమును పట్టని | ధార్తరాష్ట్రాః | = దుర్యోధనాదులు |
| మాం | = నన్ను | రణే | = యుద్ధము నందు |

| | | | |
|---|---|---|---|
| హన్యుః యది | = చంపుదురేని | క్షేమతరం | = శ్రేయస్కరము |
| తత్ | = అది | భవేత్ | = అగును |
| మే | = నాకు | | |

**నేను వాళ్ళను ఎదిరించను. ఆయుధాన్ని పట్టను. అయినా ధృతరాష్ట్రుని కొడుకులు ఆయుధాల్ని పట్టుకొని వస్తారా? యుద్ధంలో నన్ను చంపుతారా? అలాగే చంపనీ! అదే నాకు మంచిది.**

**వ్యాఖ్య**

అర్జునుడు సరే వాళ్ళను వధించడు. అలాగని వాళ్ళు కూడా అర్జునుణ్ణి వధించకుండా ఉంటారా? ఇందుకు సమాధానంగా, ఆయుధాలు ధరించి కౌరవులను చంపడం కన్నా, నిరాయుధుడిగా ఉండి, వాళ్ళ చేతిలో చావడమే మంచిది అంటున్నాడు అర్జునుడు.

**చంపడమా? చావడమా?**

స్వజనుల్ని, పెద్దల్ని వధించి నరకానికి పోవడమా? లేక నిరాయుధులుగా నిలబడి శత్రువుల చేతిలో మరణించడమా? చంపి నరకానికి పోవడం కన్నా, చచ్చి నరక ప్రవేశాన్ని నివారించు కోవడమే మంచిది అని భావించాడు అర్జునుడు.

కదనరంగంలో కాలు మోపిన తరువాత ఆయుధాల్ని ధరించి పోరాడాలి. అది వద్దని భావించి నపుడు, ఆ తరువాత ప్రత్యామ్నాయంగా రెండే మార్గాలు ఉన్నాయి. ఒకటి, యుద్ధం నుండి పారి పోవడం. రెండు, నిరాయుధులుగా నిలబడి శత్రువుల చేతిలో హతులు కావడం. యుద్ధం నుండి పారిపోవడం పిరికితనం అనిపించు కుంటుంది కనుక, బ్రతికి పాప ఫలాన్ని అనుభవించడం కన్నా, పాప నివారణోపాయంగా మరణించడమే మేలు అనే నిర్ణయానికి వచ్చేశాడు అర్జునుడు. హింసతో విజయాన్ని సాధించడం కన్నా, అహింసా మార్గంలో మరణించడమే ఉత్తమ ధర్మంగా భావిస్తున్నాడు. యుద్ధంలో కొందరిని చంపి, ఆ తరువాత యుద్ధభూమి లోనో, లేదా రాజ్యాధికారము అనుభవించిన తరువాతనో చావడం కన్నా, ఎవరినీ చంపకుండా చావడమే శ్రేయోదాయకము అని అనుకుంటున్నాడు.

ఇక దుర్యోధనాదుల విషయ మంటారా? వారు ఇప్పటికే ఎన్నో పాపకార్యాలు చేసి ఉన్నారు. మా విషయంలో వారు చేసిన దురాగతాలు, దురితాలు దుస్తరాలు.

ఇపుడు నిరాయుధులుగా ఉన్న మమ్మల్ని చంపి, ఈ పాపం కూడా మూట కట్టుకో నివ్వండి. ధర్మస్పృహ కలిగిన అహింసావ్రతులం మేము. అధర్మయుతులు, హింసా ప్రవృత్తి కలవారు కౌరవులు.

**సంజయ ఉవాచ :**

**ఏవముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ।** 47
**విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥**

**ఏవం-ఉక్త్వా-అర్జునః-సంఖ్యే-రథోపస్థే-ఉపావిశత్**
**విసృజ్య-సశరం-చాపం-శోకసంవిగ్నమానసః**

| | | | |
|---|---|---|---|
| అర్జునః | = అర్జునుడు | శోకసంవిగ్న మానసః | = దుఃఖము చేత చలించిన మనస్సు కలవాడై |
| ఏవం | = ఈ విధముగా | సశరం | = బాణంతో కూడా |
| ఉక్త్వా | = పలికి | చాపం | = ధనుస్సును |





| | | | |
|---|---|---|---|
| విసృజ్య | = విడిచి | రథోపస్థే | = రథము మధ్యలో |
| సంఖ్యే | = యుద్ధభూమిలో | ఉపావిశత్ | = కూర్చున్నాడు |

**సంజయుడు చెబుతున్నాడు :**

**అర్జునుడు యుద్ధభూమిలో అలా మాట్లాడాడు. ధనుర్బాణాలను పడేశాడు. దుఃఖంతో కుమిలి పోయాడు. రథం మధ్యలో జారబడ్డాడు.**

**వ్యాఖ్య**

పాపాచరణం కన్నా ప్రాణ త్యాగమే మంచిదని భావించింది అర్జునుని సున్నిత హృదయం. యుద్ధాన్ని త్యజించాలనే నిర్ణయానికి అర్జునుడు వచ్చేశాడు. ధనుర్బాణాలు ధరించి ఉన్నంత వరకు తనను యుద్ధం చేయ వలసిందిగా అందరూ వేధిస్తూనే ఉంటారు అని అభిప్రాయపడి, అంతకు ముందే చేజారి పోతున్న గాండీవాన్ని ( *గాండీవం స్రంసతే హస్తాత్ - 30 వ శ్లో* ) ఇప్పుడు ప్రయత్న పూర్వకంగా క్రింద పడేశాడు పార్థుడు.

ఉభయ సైన్యాలను వీక్షించాలని ఇంతవరకు రథంలో నిలబడి యున్న అర్జునుడు, దారుణ మైన దుఃఖంతో కదిలిపోతూ ( *శోకసంవిగ్న మానసః* ), ఇక నిలబడుటకు కూడా అశక్తుడై, రథోపస్థ ప్రదేశంలో జారబడ్డాడు.

**అస్పష్ట అవగాహన**

యుద్ధం చేసే ఆలోచన లేనపుడు అర్జునుడు యుద్ధరంగం నుండి వెళ్ళి పోకుండా అక్కడే ఎందుకు కూర్చుండి పోయాడు? యుద్ధం చేసే ఆలోచన లేదు కనుక నిలబడ్డవాడు కూర్చున్నాడు, బాగుంది. మరి విరమించి వెళ్ళేవాడు కూర్చో నవసరం లేదు కదా!

తన వాదనలో ఏదో స్పష్టత లోపించిందని అర్జునునికే అనిపిస్తోంది. తన భావాలతో తానే పూర్తిగా ఏకీభవించలేక పోతున్నాడు. అందుకే కూర్చున్నాడు. శ్రీకృష్ణుడు ఏదైనా చెబుతాడేమో! తన అవగాహనలో లోపం ఉంటే సరి దిద్దుతా డేమో అని నిరీక్షిస్తున్నాడు.

**స్థాన భ్రంశము**

రథానికి ముందు భాగాన పల్లంగా ఉండే చోట సారథి కూర్చుంటాడు. సారథికి వెనుక భాగాన కొంత ఎత్తైన ప్రదేశంలో యోధుడు ఉంటాడు. యోధునికి వెనుక భాగాన పల్లంగా ఉండే చోట శస్త్రాస్త్రములను అందించే సేవకుడు ఉంటాడు. ఇవి పూర్వము యుద్ధరంగంలో రథములో వ్యక్తులు ఉండే ప్రదేశాలు.

ప్రస్తుతము అర్జునుడు తాను ఉండవలసిన చోట లేడు. యుద్ధము చేసే స్థితిలో లేనందున యోధుడు ఉండే ప్రదేశాన్ని త్యజించాడు. యోధుని వెనుక సేవకుడు కూర్చొనే ప్రదేశము రథోపస్థ ప్రదేశము. ధనుర్బాణాలను పడేసిన పార్థుడు రథోపస్థ ప్రదేశంలో కూర్చున్నాడు.

అర్జునుని ఈ విషాద స్థితిని సంజయుడు ధృతరాష్ట్రునికి విపులంగా వివరించి చెప్పాడు.

**ఇతి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం**
**యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే అర్జున విషాదయోగో నామ ప్రథమోఽధ్యాయః**

